# విషయానుక్రమణిక

## నవంబరు 1957

# ఆంధ్రప్రదేశ్ ప్రథమ వార్షికోత్సవము

**1957 నవంబరు 1 వ తేదీ**



రాజధానినగరంలోని పోలీసుమైదానంలో పోలీసుదళాల వందనసమర్పణను స్వీకరించుతున్న గవర్నర్ శ్రీ భీమసేన్ సాచార్

# తాపసి

దాశరథి

ఇరులు నిశాసతీ భుజములెక్కి శిరమ్మున నిక్కి తారకా
తరుణుల గల్లభాగములు తాకి నభమ్మును ప్రాకి నిండు చం
దురుపయిసోకి భూధరము త్రోవలలోపయనించి మెల్లగా
ధరపయి కాలుమోపెను కదా! హరిపీల విపీల కాంతులన్.

ఇటు ప్రాకి అటు ప్రాకి ఇందుబింబాననా
ముఖముపై కస్తూరిబొట్టుపెట్టి,
ఇటుదూకి అటుదూకి కుటిల నీలాలకా
భ్రుకుటి కాధనువు నంబకము కూర్చి,
ఇటుసాగి అటుసాగి ఇందీవరేక్షణా
పక్ష్మ భాగములపై వచ్చి వ్రాలి
ఇటువీగి అటువీగి మృగనేత్రి బంగారు
చెక్కిలిపై అగర్ చుక్క నునిచి

వెండికొండపయిన్ మబ్బువిధము తోచి
చంద్రకేదారమున లేడిచాయ తిరిగి
ఆదిశేషునిపై విష్ణువై శయించి
చీకటులు కూర్చె నందమ్ము లోకమునకు

ఇరులు కోకిలములై ఎచ్చోట కూయునో
అచ్చోట ఆమని అవతరించు
ఇరులె తుమ్మెదలుగా ఏ వేళ మ్రోయునో
ఆ వేళల వసంత మాగమించు
ఇరులె ఉత్పలములై ఏనాడు పూచునో
ఆరోజు నవశరత్తన్న మాట
ఇరులె నెమళ్లయి ఎట నృతిసేయునో
అటనె నవాషాఢ మందగించు

ఇరులకన్న అందమెచట కానగరాదు
ఇరులె అందమునకు దరులుసుమ్మ
ఇరులు లేనినాడు నరులు కానగరారు
నరులు లేనినాడు ధరణిలేదు

కబరీ భరమ్ములై కనుపించు చీకట్లు
కావలె నాకెల్ల కాలములను,
నల్ల కల్వలవోలె నాట్యమాడెడు నిరుల్
కన్పించవలె నెల్లకాలమిచట
నీలమేఘమ్ములై నింగిబ్రాకెడి తమం
బెల్లవేళల కనుపించవలయు
జవరాలి కనుపాపచాయ దోచెడు నాంధ్య
మన్నికాలాల ప్రత్యక్షమగుత.

ఇరులె కురులయి ఝరులయి పరుగులెత్తి
ఇరులె కరులయి హరులయి ఇంపు నింపి
ఇరులె తరులయి సురలయి ధరణి నిండి
ఇరులె నరులకు మరులు కల్పించవలయు

తిమిరలతా కుడుంగమున దీపముపెట్టెడి వెఱ్ఱిదాన, దీ
పము పురుపీ మహాంధ్య మది పాము; పృదాకువు పుర్వమెక్కునో
కృమి ఉరగమ్ము మ్రింగునొ గ్రహింపుము పైదలి! తామసీ తురం
గమ ఖురఘట్టనమ్ముల వికావికలైనవి దీపదీధితుల్.

వెచ్చదనము లేని వెఱ్ఱిదీపమ్ముల
పెట్టదలచెదేల పిచ్చిదాన,
వర్షధారవోలె వచ్చు చీకట్లలో
మట్టి దివ్వె నిలుచుమాట కల్ల

గాలి నాల్కమీది కంటకమ్ములలోన
చిక్కుకొన్న యట్టి చిన్నిపురుగు
అంధకారమందు ఆటాడుదీపంబు
మరు నిముసము నందు మడియగలదు.

## తా మ సి

అంధకార గృధ్రమార్చెను పెనురెక్క
లంతటను తుఫానులలము కొనియె
చిన్నదీప కళిక యెన్నాళ్లు నిలుచును?
మలిగిపోవుగాక మరు నిముసము

ఆకాశమ్మది చీకటిల్లు శశి తారార్కావళుల్ మిణ్గురుల్,
లోకం బియ్యది చీకటింటి పరదాలో నున్న మృత్పిండ; మిం
దాకల్పింపగ జూచెదేల పరిహాసార్థమ్మొ! దీపావళీ
ప్రాకారమ్ములు? తామసీ ధరణి కంపంబల్లదే వచ్చెడిన్.

పాపిని, నాకు దీపముల బారులు చిమ్మెడి కాంతి ధారపై
కోపము; నన్ను చీకటుల కోవలలో శయనింపనిమ్ము, ని
ద్రా పరతంత్రమై బ్రతుకు దాగిలి మ్రుచ్చుల నాడుచున్న దే
లా పురికొల్పెదమ్మ! నను అంధతమః పథముల్ త్యజింపగా

విద్యుద్వల్లిక శాశ్వతమ్ముగ నభోవీథిన్ ప్రభాదండమై
విద్యోతించిన రీతి నుండిన నినున్ వీక్షింపగాలేను, నీ
ఖద్యోత ప్రతిమాన తైజసిక శృంగారమ్ము నాకేలనే,
ఆద్యంతమ్ములు లేని చీకటి పథం బందేగు ఘూకానకున్.

కానుగు చెట్ల నీడల నొకానొక స్వప్నపు సెజ్జపైన ని
ద్రాణములైన లోచనములన్ శయనింపగనిమ్ము; అంధకా
రాన మనస్సు శాంతిపడె; రాను భవత్కమనీయకాంతి సౌ
ధానకు; నన్ను పిల్వకు ముదార భవద్ధృదయాంగణానకున్.

# విశ్వాంతరయానము

యస్. ఆర్. కె.

గగనపథానికి ఎగరాలని మానవుడు ఆదినుంచీ కలలు గంటూనే వున్నాడు. గగనపథం స్వర్గసీమ, అక్కడ అతని దేవతలూ, పితృదేవతలూ నివసించుతూవుంటారు. సూర్యచంద్రాది గ్రహాలు ప్రత్యక్ష దైవాలు. ఆదేవతలను మానవుడు పూజిస్తున్నాడు. బొందితో స్వర్గానికి పోయిన పుణ్యపురుషుల గాథలు పురాణాలలో అనంతంగా వున్నాయి.

ఉన్నట్లుండి, రష్యనులు, ఒక కృత్రిమగ్రహాన్ని తయారుచేసి విశ్వాంతరంలోకి విసరివేశారు. ఈ బాల చంద్రుడు, చంద్రుడు తిరిగినట్టే భూమిచుట్టూ తిరుగ నారంభించాడు. దీంతో విశ్వాంతరయానమునకు గల అవకాశాలను గూర్చి ప్రపంచమంతా అత్యుత్సాహంతో ఆలోచించ మొదలుబెట్టింది. ఈ కృత్రిమ గ్రహానికి రష్యనులు "స్పుట్నిక్" అని నామకరణం చేశారు. గగనపథాన దీని అవతరణతో, శాస్త్రవిజ్ఞానవేత్తలలోనూ, సామాన్య ప్రజలలోనూకూడా, విశ్వాంతరయానాన్ని గూర్చి, చిత్ర విచిత్రాలైన అనేకరకాల ఊహాగానాలు చెలరేగుతున్నాయి. ఏది ఏమైనా,

సరిగా ఈ వ్యాసాన్ని ముగింపుచేస్తున్న ఈతరుణానికి—అనగా 3-11-57 తేదీ గం|| 11-45 నిమిషాలకు, రష్యా మరొక కృత్రిమగ్రహాన్ని ఈ ఉదయం అంతరిక్షంలోకి వదలినట్లు మాస్కో రేడియో ప్రకటించింది. దీనిలో ఒక కుక్కను కూడా పైకి పంపారట. ఇది సురక్షితంగా వున్నట్లుకూడా ప్రకటించారు. దీనికి కావలసిన ఆహారపానీయాలనుకూడా ఆ గోళంలో వుంచారు. ఈ కుక్కకోసం 'ఎయిర్ కండిషన్డ్' గదికూడా ఏర్పాటుచేశారట! దాని అదృష్టం! అవును విశ్వాంతరంలోకి ఎగిరిన ప్రథమగౌరవంకూడా దానికి దక్కిందిగదా!

దీన్లో, విశ్వకిరణ ప్రసారాలను, సూర్యమండల ప్రసారాలనూ, శబ్ద తరంగ ప్రసారగతులనూ, ఎక్స్-రే, అల్ట్రా-వైలెట్ రే ప్రసారాలను, నమోదు చేసి ప్రసారంచేసే యంత్రాలను ఉంచారు.

ఈ రెండవ స్పుట్నిక్ బరువు 1120.7 పౌనులు, అంటే దాదాపు అర టన్ను. మొదటిదాని బరువు 183 పౌనులు మాత్రమే. ఇది సెకనుకు 26000 అడుగుల వేగంతో అంటే గంటకు 15173 మైళ్ళ వేగంతో పరిభ్రమించుతోంది. ఇది భూమిని చుట్టి రావటానికి 102 నిమిషాలు పడుతున్నది. రోజుకు 14 ప్రదక్షిణాలు చేస్తుంది. మొదటి స్పుట్నిక్ 16 ప్రదక్షిణాలు చేస్తోంది. దాని వేగము గం||కు 18000 మైళ్ళు. మొదటి స్పుట్నిక్ 560 మైళ్ల ఎత్తున ఎగురుతోంది. ఇది 930 మైళ్ల ఎత్తున ఎగురుతున్నది.

ఈకృత్రిమగ్రహచాలనం, మానవజాతి, సాంకేతికపరిజ్ఞాన రంగంలో సాధించుతున్న విజయ పరంపరల చరిత్రలో ఒక మహత్తర ఘట్టం. ఈ సంఘటనను పురస్కరించుకుని, నలుగురుతోపాటు మనంకూడా, విశ్వాంతరయానానికి గల అవకాశ అనవకాశాలను—పోనీ ఊహాగానంగానే—కొంత చర్చించి వినోదించుదాం. 'స్పుట్నిక్' ప్రయోగ వివరాలను గూర్చి దినదినం అనేక విషయాలు పత్రికలలో చదువుతూనే వున్నాం గనుక దానిని గూర్చి ఇక్కడ ఎక్కువ చర్చించటం లేదు.

'సూర్యమండల గ్రహకూటమిని గూర్చి కోపర్నికస్ స్థాపించిన సిద్ధాంతం సర్వత్రా అంగీకరించబడి ఖగోళశాస్త్రం అభివృద్ధి చెందినకొలదీ, సూర్యుని చుట్టూ తిరుగుతున్న ఈ గోళాలను గురించీ, వాటిమీద జీవరాసుల ఉనికికి గల సావకాశాలనుగురించీ, విశ్వాంతరయానానికి గల సావకాశాలనుగురించీ పలువురు యోజించ మొదలుపెట్టారు. ఈ విషయాన్ని పురస్కరించుకుని, శాస్త్రవిజ్ఞాన పరిశోధనకు సంబంధించిన గ్రంథాలే కాక, కేవల ఊహా వైచిత్రిగల కాల్పనిక రచనలుకూడా బహుళసంఖ్యలో వెలువడుతూ వచ్చినాయి. వాటి నన్నిటినీ జనం మహోత్సాహంతో చదువుతున్నారు. ఇట్టి వాఙ్మయ ప్రచురణ ఒక కొత్త వాణిజ్యావకాశంగా కూడా పరిణమించింది.

పశ్చిమ దేశాలలో అనేక 'విశ్వాంతరయాన సంఘాలు 'ఏర్పడినాయి. ఆలులేదు చూలులేదు కొడుకుపేరు సోమలింగమని, టోకియోలో అనేకమంది, అంగారకగ్రహంలో ఇళ్ళస్థలాలు కొనటానికి యెగబడుతున్నారు. ఒక పెద్ద మనిషి, అంగారకగ్రహానికి హక్కుదారైనట్టు ఆగోళంలో నివేశన స్థలాలు అమ్ముతున్నారు. ముందుగా కొనుక్కోకపోతే మళ్ళీ స్థలం దొరకదని కొందరికి బెంగగాకూడా వుంది, చేతిలో డబ్బు తక్కువగా వున్నవాళ్ళకు!

ఆకాశంలో ఒకటి రెండు మైళ్ళు పైకి పోవాలంటే, ప్రప్రథమంగా మానవుడు కనుగొన్న సాధనం గాలి గుమ్మటం. దీనికి వున్న యితర ఇబ్బందులమాట అటువుంచి, ఇది గాలికంటే తేలికైనదై వుండాలి. అందుచేత దీనికిగల అవకాశాలు చాలా పరిమితమైనవి. ఈ సంవత్సరమే, అమెరికా సైనికశాఖలోని మేయర్ ఒకరు, గాలిగుమ్మటంలో 100,000 అడుగుల ఎత్తుకు వెళ్ళగలిగాడు. ఇది ప్రపంచావధిని ఇంతవరకు సాధించిన గరిష్ఠప్రమాణం. (మనిషి లేకుండా రష్యనులు, 120,000 అడుగుల ఎత్తుకు ఒక గాలిగుమ్మటాన్ని ఎగురవేయగలిగారు) ఈ కారణం చేతనే, విమానాలకుగల యానావకాశాలుగూడా పరిమితమౌతున్నాయి.

విశ్వాంతరయానానికి 'రాకెట్' (అవాయి) ఒక్కటే పరమసాధనమని, శాస్త్రవిజ్ఞానవేత్తలు ఏనాడో గ్రహించారు. రాకెట్లను తొలుతగా తయారు చేసినవారు చీనావారని చెబుతారు. ఈ అవాయిల సంగతి అనాదికాలంనుంచీ తెలిసేవుంది. రాకెట్ అసలు ఎలా ఎగురుతుంది? న్యూటన్ స్థాపించిన 'చలనసూత్రాలలో మూడవది — "కార్యము ప్రతి కార్యమును కల్గించును—కార్య ప్రతికార్యముల చలనశక్తి పరస్పర వ్యతిరేకమార్గముల వ్యాపించును" అనేది. ఈ సూత్రంలో నిర్వచింపబడిన 'చలన' ధర్మమే రాకెట్ చలనానికి కారణమౌతున్నది. రాకెట్ వెనుక భాగంలో హఠాత్తుగా కలిగింపబడిన ప్రేలుడు రాకెట్‌ను, ముందుకు నెట్టుతుంది. ఈ ప్రేలుడును నిర్ణీత పద్ధతిలో నిర్వహించి ప్రేలుడువల్ల సృష్టింపబడుతున్న వాయువులను, నిర్ణీత పరిమాణముగల విసర్జన నాళికాముఖం నుంచి క్రమపద్ధతిని బయటికి పంపేటట్లు యేర్పాటు చేయగలిగితే రాకెట్ యొక్క పురోగమన వేగాన్ని మనం క్రమబద్ధం చేయవచ్చు. రాకెట్ల నిర్మాణంలో తుపాకిమందులాంటి ఘనపదార్థాలను ఉపయోగించితే రాకెట్‌లో ఇంధన నిక్షేపానికి సువిశాలములైన, వివరాలను నిర్మించవలసి వస్తుంది. వీటి బరువు తలకుమించిన దౌతుంది. అందుచేత ఎక్కువ ఎత్తుకు పంప నుద్దేశించిన రాకెట్లలో ఇంధన ద్రవ్యాలుగా ఘనపదార్థాలను ఉపయోగించటం సాధ్యంకాదు. ఘనపదార్థాలకు మారుగా ద్రవపదార్థాలను ఇంధనాలుగా వాడవచ్చుననే అభిప్రాయం కలిగినా 1926 వరకూ ఈ ప్రక్రియను సాధించినవారెవరూ లేరు.

1926 లో, గొడార్డ్ (Goddard) అనే శాస్త్రవిజ్ఞానవేత్త, ఆల్కహాలునూ, ద్రవరూపంలోవున్న ఆక్సిజనును కలిపి ఒక ఇంధనద్రవ్యాన్ని తయారుచేసుకుని దాన్ని వాడిచూచాడు. గొడార్డ్ ప్రయోగించిన రాకెట్ ఒకమైలుకు మించి ఎగరలేదు. గాలి గుమ్మటాలు ఎగురుతున్న ఎత్తుతో పోల్చిచూస్తే యిదేమీ చెప్పుకోదగిన సంగతి కాకపోయినా, రాకెట్ విన్యాసానికి సంబంధించినంతవరకు, ఇది ప్రధానమైన ముందడుగేనని చెప్పాలి.

రెండవ ప్రపంచయుద్ధ తరుణంలో నాజీలు ప్రయోగించిన 'వి—2' అనే రాకెట్ ఆయుధాల సంగతి అందరికీ జ్ఞప్తి వుండేవుంటుంది. ఈ 'వి—2'ల నిర్మాణం, రాకెట్‌కు సంబంధించిన సాంకేతిక విజ్ఞానంలో మహత్తరమైన పురోగమనమని అంగీకరించి తీరాలి. సాంకేతికరంగంలో మానవుడు సాధించిన మహత్తర విషయాలన్నీ, యుద్ధావసర పరిణామాలుగానే సాధింపబడుతూ వుండటం దురదృష్టకరమైన విషయం. విమానాలు, జలాంతర్గాములు, అణ్వస్త్రాలు ఇవన్నీ యుద్ధావసరాలకొరకు నిర్మింపబడినవే కదా?

వి—2 రాకెట్ పొడవు 46 అడుగులు వుంటుంది. ఆక్సిజన్‌ద్రవం, ఆల్కహాలూ కలిపి దానికి ఇంధనంగా వాడతారు. ఇది గంటకు 3000 మైళ్ళ వేగంతో పోతుంది. దానితోవున్న యిబ్బంది వొకటే, ఇది వదలిన వారి చెప్పుచేతల్లో వుండదు. అందుచేత ఒక ప్రత్యేక లక్ష్యాన్ని ఛేదించాలంటే దీన్ని నమ్ముకుని లాభంలేదు.

యుద్ధం ముగిసిన అనంతరం, ఇటు రష్యనులు, అటు అమెరికనులూకూడా, ప్రతిభాశాలురైన జర్మన్ శాస్త్రవిజ్ఞానవేత్తలను చాలామందిని, తమ తమ దేశాలకు తీసుకొని వెళ్ళారు. వీరిలో, 'వి—2' నిర్మాత హెర్మన్ వాన్‌బ్రాన్ (Herman Vaun Braun) అమెరికాలోవుండి ఖండాంతర వేధి ఆయుధ నిర్మాణంలో ప్రముఖపాత్ర వహించుతున్నారు. ఈఖండాంతర వేధి ఆయుధోత్పత్తికి వి—2 బీజప్రాయమైనది ఈ ఖండాంతర వేధి ఆయుధాలను నిర్మించటానికి, వాటిని సర్వసంపన్నములైన తిరుగులేని ఆయుధాలుగా రూపొందించటానికి, ఇటు అమెరికా, అటు రష్యాకూడా చాలా తీవ్రంగా కృషిచేస్తున్నాయి. ఈ ఖండాంతర వేధిరాకెట్లు ఆటంబాంబులనూ, హైడ్రోజన్ బాంబులనూ ముక్కులకు తగిలించుకుని, నిరాటంకగతిని, నిరవధిక వేగంతో, శత్రు కేంద్రాలకు వెళ్ళి ఈ బాంబులను వదలి వాటిని ధ్వంసం చెయ్యాలి. ఈ రాకెట్‌ను వదులుతున్న విన్యాసకేంద్రమునుంచి, రేడియో, రాడార్ మొదలైన సాధనలతో దాని గమనాన్ని అదుపు చేసి క్రమబద్ధం చేసే సావకాశం వుండాలి.

ఇప్పుడు నిర్మింపబడుతున్న ఈ ఖండాంతర వేధులు, ముందు రానున్న విశ్వాంతరయాననౌకలకు ప్రాథమిక ప్రాతిపదికలు కానున్నవని మనం ఊహించవచ్చు. ఈ ఖండాంతర వేధుల నిర్మాణం సంపూర్ణంగా ఫలోన్ముఖమైనప్పుడు, విశ్వాంతరయానం సుసాధ్యమౌతుంది.

ఈ ఖండాంతర వేధులు చోదితాస్త్రాలుగా వుంటేగాని లాభంలేదని చెప్పాం. చోదితాస్త్రమంటే, విన్యాసకేంద్రంనుంచి దీని గమనాన్ని క్రమబద్ధంచేసి లక్ష్యసిద్ధిని చేకూర్చే అవకాశం వుండాలి. రాడార్ సాధనాన్ని అభివృద్ధిచేస్తే, ఈ ఆయుధాలను ఇలా అదుపుచేసే సావకాశం కలుగవచ్చు. ఇటీవల 'జర్‌మేనియమ్' స్ఫటికాల గుణగణాలనుగురించి జరిగిన పరిశోధన ఫలితాలుచూస్తే, ఈ అడ్డంకులను త్వరలోనే అధిగమించవచ్చు ననిపించుతుంది. ఇది ఇలా వుండగా మరికొన్ని యితర బాధలున్నాయి. రాకెట్లకు తగునైన ఇంధన ద్రవాలు లభించాలి. ఈ ఇంధన ద్రవాలలో చాలా భాగం ఇతరపదార్థాలను తినివేసే స్వభావం కలవి. ఇలాంటివి రాకెట్‌నే తినివేయవచ్చు. రెండవది: ఈ రాకెట్ల నిర్మాణానికి ఉపయోగించేపదార్థం వాతావరణ కర్షణవల్ల తగలబడి భస్మమైపోకుండా నిలువగలిగిందిగా వుండాలి.

ఈ సాధన సంపత్తిని చేకూర్చుకోవటానికి అమెరికన్ సైనికశాఖవారు తీవ్రంగా కృషిచేస్తున్నారు. కాని ఈ ఖండాంతరవేధి కార్యక్రమంలో ప్రధానపాత్ర వహించుతున్న వాన్‌బ్రాన్ విశ్వాంతరయానానికే ఒక పథకాన్ని తయారుచేసి అక్కపెట్టారు. ఈయన, శాస్త్రవిజ్ఞానజగతు వదలి కాల్పనిక జగతులో విహరించుతున్నారని ఈయన పథకాన్ని అవహేళన చేస్తున్నవారు లేకపోలేదు. ఏదియేమైనా ఆయన భూమినుంచి పైకి లేచిపోవటానికి, అక్కడనుంచి విశ్వాంతరంలో విహరించటానికి ఒక సమగ్రమైన పథకాన్నే తయారుచేశారు. అది ఆచరణసాధ్యమా కాదా అనేది ప్రయోగానంతరంగాని తేలేవిషయం గాకపోయినా, ఈ పథకం పరిశీలనార్హం.

ఇక్కడ, అసలు భూమితో తెగతెంపులు చేసుకుని పైకిపోవటానికిగల ఆటంకాలేమిటో, వాటిని అధిగమించటానికి అవసరమైన సాధనసంపత్తి యేమిటో ముందు విచారించవలసివుంది. భూమ్యాకర్షణ శక్తిని అధిగమించట మెలా అనేది ప్రధానసమస్య. మనం

వాడే రాకెట్‌కు ఒక నిర్ణీతమైన గమనవేగాన్ని చేకూర్చగలిగితే ఇది సాధ్యమౌతుంది. దీన్ని 'అధిగమన వేగం' (Escape Velocity) అంటారు. ఈ అధిగమన వేగం గంటకు 25000 మైళ్లు వుండాలి. అంటే సెకనుకు 7 మైళ్లు. ఈ గమనవేగాన్ని సాధించగలిగితే, భూమ్యాకర్షణను అధిగమించి విశ్వాంతరంలో ప్రవేశించవచ్చు. భూవాతావరణం అవధిని దాటితే తరువాతి గమనం మరింత సులభమౌతుందంటున్నారు. విశ్వాంతరంలో ప్రవేశించిన తరువాత చంద్రగోళానికిగాని ఇతర గ్రహాలకుగాని తేలికగా చేరవచ్చు.

ఇక రెండవ ఆటంకం—వాతావరణ కర్షణ: దినదినం మనం ఉల్కలు రాలిపడటం చూస్తూనేవుంటాం. ఇతర గోళాలనుంచి ఊడిరాలిన యీ ముక్కలు, అత్యంత తీవ్రవేగంతో రివ్వున దూసుకొనివస్తూ, ఆ తీవ్రవేగంతో భూమియొక్క వాతావరణంలో ప్రవేశించగానే, కస్సునమండి, క్రిందపడకుండా మధ్యమార్గంలోనే భస్మమై కర్పూరంలా హరించిపోవటంకూడా మనం దినదినం చూస్తూనేవుంటాము. వాయుకర్షణవల్ల ఉల్కలు అలా మండిపోతాయి. తీవ్రమైన వేగంతో, రాకెట్లు వాయుగర్భంలోనుంచి పయినించేటప్పుడు వాటికికూడా ఇదే దురతి పడుతుంది. ఈ వాయుకర్షణప్రమాదాన్ని తట్టుకోగల, తగిన లోహాలుగాని, లోహమిశ్రమాలుగాని, ఇంతవరకు పెంపొందింపబడలేదు. కాని రష్యనుల 'స్పుట్నిక్' విన్యాసానంతరం, ఇట్టిది సాధింపబడినట్లు మనం ఊహించవలసి వస్తున్నది. రాకెట్ విన్యాసరంగంలో రష్యనులు విశేష సాంకేతికపరిజ్ఞానం సంపాదించారని 'స్పుట్నిక్' ప్రయోగంతో స్పష్టంగా తేలిపోయింది.

ఖగోళశాస్త్రం చాలా కచ్చితమైన శాస్త్రం, విశ్వాంతరంలో పరిభ్రమించుతున్న గోళాలనుగూర్చి మనకు అనేక విషయాలు తెలుసు. అందుచేత, విశ్వాంతరయాన నౌకలను, విశ్వపథానికి లేపగలిగినప్పుడు ఆయా గోళాలను చేరటానికి అవి యే యే దిక్కులకు పోవాలో ఆ యానమార్గాలను మనం తేలికగా లెక్కగట్టి నిరూపించవచ్చు.

విశ్వాంతరయానావకాశాలను సమీక్షచేస్తూ ప్రసిద్ధ శాస్త్రవేత్త లియనార్డు ఇలా అన్నారు: "స్పెయిన్ అగ్రంలోనుంచుని అమెరికాఖండం ఉనికిని స్థిరం చేసుకుని, ఆ ఖండాన్ని చేరుకోవటానికి తెప్పపడవలో బయలుదేరబోతున్న కొలంబస్ పరిస్థితి ఆనాడు ఎలా వున్నదో, ఈనాడు విశ్వాంతరయాన రంగంలో మన పరిస్థితి సరిగా అలానేవుంది. ఇంచుమించు ప్రాంగణంలో వున్నాం"

ఒకే ఒక రాకెట్‌తో విశ్వాంతరయానానికి ఉపక్రమించటం సాధ్యంకాదని శాస్త్రవేత్తలు మొదటినుంచీ చెబుతున్నమాటే. ఎలాంటి రాకెట్‌ను నిర్మించినా ఒకే ఒక రాకెట్, "అధిగమనవేగాన్ని" అందుకోలేదు. ఇది పెక్కు రాకెట్ల సమీకరణ అయివుండాలి. అట్టడుగు రాకెట్ పేలి కొంతదూరం పోయి దానిలోని ఇంధనద్రవ్యం అయిపోగానే అది ఊడి క్రిందపడిపోవాలి. అప్పుడు తక్షణం రెండవది పేలాలి—ఇలా ఒకదానివెంట ఒకటి పనిచేస్తేనే గాని తగిన 'అధి గమనవేగాన్ని' అందుకోలేదు. గంటకు 25000 మైళ్ళ ఈ అధిగమనవేగాన్ని అందుకోవటానికి కనీసం 3 రాకెట్ల దొంతరను వాడాలని లెక్కగట్టారు. ఒక చిన్న మోటారుకారంత బరువున్న ఒక బరువును విశ్వాంతరంలోకి పంపాలంటే, దాన్ని మోసుకుపోవటానికి వాడే రాకెట్ల బరువు ఒక పెద్ద సముద్రపు ఓడ బరువంత వుంటుందని కూడా అంచనా వేశారు.

ఈ అంచనాలను, ఇప్పుడు 'స్పుట్నిక్' విన్యాసాన్ని గురించి రష్యనులు ప్రకటించిన అంకెలతో పోల్చి చూడవచ్చు. ఈ రాకెట్లను నిట్టనిలువుగా పంపలేదని అందరూ అంగీకరించుతున్న విషయమే. ఈ కృత్రిమగోళం ఇప్పుడు ఒక నిర్ణీత వలయంలో భూమి చుట్టూ తిరుగుతున్నది. దాన్ని ఆ వలయంలో స్థాపన చేయాలంటే నిట్టనిలువుగా పైకి పంపి లాభంలేదు. దాన్ని ఆవలయంలో స్థాపించటానికి భూభాగానికి సమానాంతరంగా పోయే గమనాన్ని ఏ దశలోనో దానికి కొంత కలుగజేసి వుండాలి. ఈవిషయం నిజమేనని రష్యన్ పత్రిక 'ప్రావడా' కూడా అంగీకరించింది. రష్యన్‌శాస్త్రవేత్తలు ప్రకటించుతున్న వివరాలనుబట్టి ఈకృత్రిమ గోళాన్ని విసరటానికి ఉపయోగించిన రాకెట్ల గమనవేగం గంటకు 18000 మైళ్లు మాత్రమే. ఇది భూమ్యాకర్షణ శక్తిని అధిగమించటానికి వలసిన 25000 మైళ్ళ 'అధిగమన వేగాని' కంటే చాలా తక్కువ. పైన వివరించిన విధంగా రష్యనులు దీని విన్యాసాన్ని ఒక ప్రత్యేకమైన పద్ధతిని నిర్వహించా

రవటం స్పష్టం. విశ్వాంతరయానకేంద్రంగా నిర్మించబోతున్న గోళాన్ని ప్రత్యేకమైన పద్ధతిలో విన్యాసం చేయాలని వాన్‌బ్రాన్, మిగతా శాస్త్రజ్ఞులూ అంటున్నదే. వాటిని మొదట కొంచెం ఏటవాలుగా వదలాలి, అనంతర గమనంలో వేసే రాకెట్లు దీన్ని తిరిగి నిట్టనిలువుగా పంపాలి అన్నారు. రష్యనులు పంపిన గోళం భూమి చూట్టూ గంటకు 18000 మైళ్ళ వేగంతో భ్రమణం చేస్తున్నది—560 మైళ్ళ ఎత్తున. ఇది ఇంతయెత్తున పోవటంలేదని కొందరంటున్నారు. భూమియొక్క వ్యాసం షుమారు 7916 మైళ్ళు వున్నదనీ, భూమధ్య కేంద్రం, కేంద్రంగా, ఈకృత్రిమ గోళంయొక్క గమనవలయం యేర్పడ్డదనీ మనం దృష్టియందు వుంచుకుంటే స్వల్ప వ్యత్యాసాలు గమనించదగినవి కావు.

ఈకృత్రిమ గ్రహాన్ని విన్యాసం చేయటంవల్ల నూతనంగా లభించనున్న శాస్త్ర విజ్ఞాన విషయాలు, విశ్వాంతర యానాన్ని గూర్చి పూర్వం వ్యాప్తిలోవున్న అనేక ఊహలను తారుమారు చేయవచ్చు. కాని పూర్వం శాస్త్రజ్ఞులుచేసిన ఊహలూ, కట్టినలెక్కలూ వేసిన అంచనాలూ చాలావరకు నిజమేనని యిందువల్ల రూఢి అవుతోంది. రష్యనులు సాధించిన విషయాలేమిటో వారు బహిర్గతం చెయ్యకుండావున్న కారణంగా వాటినిగురించి కచ్చితంగా చెప్పటానికి అవకాశంలేదు. అందుచేత, అమెరికన్ వర్గాలనుంచి మాత్రమే లభించిన వివరాలను ఒకదానికొకటి చేర్చి, విశ్వాంతరయానరంగంలో సాధించిన పురోగమనాన్ని అంచనా వేయవలసి వస్తోంది.

ఇక వాన్‌బ్రాన్ పథకాన్ని కొంచెం పరిశీలించుదాం. ఈ పథకంలోని ప్రధాన విషయాలు ఇవి: విశ్వాంతరంలో 1000 మైళ్ళ ఎత్తున ఒక విశ్వాంతర యాన కేంద్రాన్ని ('స్పేస్ స్టేషన్')(Space Station) నిర్మించాలి. ఈ స్టేషన్ నిర్మాణానికి కావలసిన వివిధ భాగాలను ముందుపంపి ఒక వలయంలో తిరుగుతూండేటట్టు స్థాపించాలి. అనంతరం మనుషులు పైకిపోవాలి. ఈ భాగాలన్నిటినీ ఒకటిగాచేర్చి స్టేషన్ కట్టాలి. ఈ కేంద్రాన్ని విశ్వాంతరయాన నౌకల, లేదా రాకెట్ల నిర్మాణకేంద్రంగా ఉపయోగించాలి. ఈ పథకంలో వున్న వైచిత్రియావత్తూ ఇక్కడేవుంది. ఇక్కడనుంచి యాననౌకలను వదలటం చాలా సులభమట. అక్కడనుంచి చంద్రగోళానికి వెళ్ళాలంటే. 7000 మైళ్ళ గమనవేగంవున్న నౌక చాలట. అంటే భూమిమీదనుంచి లేవటానికి కావలసిన వేగంలో ఇంచుమించు నాలుగోవంతు. ఈ స్టేషన్ నిర్మాణానికి కావలసిన పరికరాలను పైకి పంపటానికి వాన్‌బ్రాన్ ఒక సమగ్ర ప్రణాళికను వివరాలతోసహా తయారుచేసే వుంచారు. స్టేషన్ నమూనా విషయంలోనే ఇంకా కొంత ఆలోచిస్తున్నారు. ఈ స్టేషన్ నెమ్మదిగాతిరిగే చక్రాకారంలోవుంటే వీలుగా వుంటుందని ఆయన అభిప్రాయం. దానికి కొంత కృత్రిమాకర్షణశక్తి లభిస్తుందనీ స్వల్ప పరికరాలతో నిర్మించవచ్చుననీ ఆయన ఊహ. ఈ స్టేషన్ భాగాలను పైకిపంపటానికి మూడు అంచల రాకెట్లను చాలా వాటిని తయారుచేయాలి. వాటిలో ఒకొకదాని బరువు ఇంధనద్రవ్యాలతోసహా 7000 టన్నులు. దీన్ని పేలిస్తే 84 సెకండ్లలోపల 5250 టన్నుల బరువుగల ఇంధనాన్ని వ్యయంచేసి మొదటి రాకెట్ రాలిపోతుంది. ఇక 990 టన్నులు బరువుగల రెండు రాకెట్లు మాత్రమే మిగులుతాయి. మరొక 124 సెకండ్లయేసరికి రెండో రాకెట్ కూడా రాలిపోతుంది. ఇక 143 టన్నులు మాత్రం బరువుగల చివరి రాకెట్ మిగులుతుంది. ఇది 1075 మైళ్ళ ఎత్తుకు ఎగిరి అక్కడనుంచి నెమ్మదిగా పడిపోనన్నాపోతుంది లేదా భూమిచుట్టూ తిరుగుతూ విశ్వాంతరంలో నిలిచన్నాపోతుంది. దీని గమనవేగం 15840 మైళ్ళు వుంటుంది.

ఇదంతా కేవలం ఊహామాత్రమైన ప్రణాళికే ననుకోండి! అయినా వాన్‌బ్రాన్‌గారు చెబుతున్న ఈ బ్రహ్మాండమైన రాకెట్లను నిర్మించాలంటే, అత్యంత వ్యవప్రయాసలతో కూడుకున్న వ్యవహారం మాట అటుంచి ఈ రాక్షస యంత్రాలు అదుపుతప్పితే అప్పుడు ఎక్కడ ఏంజరిగి ఎలా పరిణమించుతుందనేది ఊహాకందని విషయం. అమెరికనులు న్యూమెక్సికోలోని 'వైట్ శాండ్స్' అనే చోట, ఈఖండాంతర వేధి రాకెట్ల కార్యక్రమాన్నంతా సాగించుతున్నారు. ఇక్కడ జరిగే పరీక్షలలోనే ఒకొక్క రాకెట్ ఉన్నట్టుండి అదుపుతప్పి, దాని యిష్టం వచ్చినట్టు వ్యవహరించుతూ వుంటుంది.

'స్పుట్నిక్'తో రష్యనులు కొంత ముందుకు పోయారు గనుక వారితో పోటీకి అమెరికనులు కూడా

తమ పరిశోధనలను యింకా తీవ్రం చేయవచ్చు. ఇటీవల అమెరికనులు ఒక రాకెటును 4000 మైళ్ళ ఎత్తుకు పంపినట్లు ఒక వార్త వచ్చింది. ఇది అనధికారవార్త కావటంవల్ల ఇందులో కొంత అతిశయోక్తి వుందని అంగీరించినా ఇది పెద్ద పురోగమనమేనని అంగీకరించాలి.

రష్యనులు విన్యాసంచేసిన ఈ బాలచంద్రునివల్ల కలిగే ప్రయోజనం యేమిటి అని కొందరంటున్నారు. భూవాతావరణాన్ని అతిక్రమించిన అనంతావధిలో వుండే స్థితిగతులేవిటో మనం దానివల్ల తెలుసుకోవచ్చు. భూమిచుట్టూ వున్న ఈవాయుగర్భం మన్ని ఎలా రక్షించుతోందో ఇటీవలనే మనకు అర్థమైంది. ఉల్కాలు, విశ్వాంతరయాన నౌకలు ఎదుర్కోవలసిన భయంకర ప్రమాదాలలో మొట్టమొదటివి. ఇవి ఈ నౌకలను ఫిరంగిగుండ్లు లా ఎదుర్కొని ఛిన్నాభిన్నం చేస్తాయి ఈ ఉల్కాలు అనుక్షణం వేలాది సంఖ్యలో భూమిపైపు ఫిరంగిగుండ్లులా దూసుకువస్తూ వుంటాయి. కాని అదృష్టవశాత్తూ, ఇవి తీవ్రతరమైన గమన వేగం కలిగివుండటంచేత భూవాతావరణంలో ప్రవేశించగానే వాయుకర్షణవల్ల మండి భస్మమైపోతాయి. అవిధంగా మనం తలలు బ్రద్దలైపోకుండా రక్షింపబడుతూ వున్నాము. సోవియెట్ స్పుట్నిక్ చాలా చిన్నది కావటంచేత వీటి ప్రమాదాలనుంచి తప్పుకుంటూ వుండవచ్చు. అంతేగాని ఈకృత్రిమ గోళాలు ఏమాత్రం పెద్దవైనా అవి ఉల్కాల ప్రమాదాన్ని ఎదుర్కోవలసి వస్తుంది.

ఇక రెండవప్రమాదం విశ్వకిరణాల ప్రసరణ: (Cosmic Radiation). ఈ కిరణాలు విశ్వాంతరంలో ఎక్కడ ఎలా ఉత్పత్తిఅవుతున్నాయనేది అంతు తెలియని యింద్రజాలంగావున్నా వాటి ఉనికిమాత్రం విస్పష్టమైపోయింది. ఈ కిరణాలు, ఊహించటానికి వీలులేని గమన వేగంగల అణువులను కలిగివుంటాయి. ఏ పదార్థమూ వీటిధాటకు తట్టుకోలేదు. ఈ విశ్వకిరణాలు భూవాతావరణంలోనుంచి దూసుకువచ్చి భూమిలోకి కొన్నివందల అడుగులలోతువరకూ చొచ్చుకుపోతూ వుంటాయి. జీవకంపరాలమీద వాటిప్రభావ మెట్టిదో—అది ఒక అంతుతెలియని అజ్ఞాతభీభత్సం! నిజానికి జీవపరిణామంలోవస్తున్న విపర్యయము (Mutations) లకు ఈ విశ్వకిరణప్రసారమే కారణ మనుకుంటున్నారు. విపర్యయమంటే పరిసరానుగుణ్యంగా పెంపొందటమని పొరపాటుగా అర్థం చేసుకోకూడదు. జీవపరిణామానికి పరిసరానువృత్తి కారణమనే బహుజనవిశ్వాసం వుంది. కాని, జీవపరిణామానికి ప్రధానకారణం, విపర్యయమనీ, ఇది పరిసరానువృత్తికి అతీతమైనదనీ నవీన శాస్త్రజ్ఞులు ఇప్పుడు చెబుతున్నారు. ఈ విపర్యయ కారణంగా మార్పుచెందుతున్న జీవరాసులను పరిసరానువృత్తి సంస్కరించుతుంది. పరిసరానువృత్తిలేని పరిణామజీవులు నశించుతాయి. కోతిమానవుడుగా పరిణామంచెందటానికి విశ్వకిరణప్రసరణవల్ల కలిగిన విపర్యయమే కారణమై వుంటుంది. ఈ విశ్వకిరణప్రసారంనుంచి తప్పుకోవటానికి, శాస్త్రీయవిజ్ఞాన విషయాలను పురస్కరించుకుని కాల్పనిక రచనలు చేసేవారు (Science-fiction Writers) చిత్రవిచిత్రాలైన అనేకసూచనలు చేస్తున్నారు. అవన్నీ కేవలం ఊహాసౌధాలు. విశ్వకిరణప్రసారంనుంచి ఏవిధమైన పరిరక్షను సాధించటానికైనా ఇంకా చాలా కాలం పడుతుంది.

భీతావహములైన ఈ ప్రమాదములస్థితి ఇలా వుండగా, విశ్వాంతర యాత్రికులు యెదుర్కోవలసిన చిక్కులు ఇంకా చాలావున్నాయి. మనం భూమ్యాకర్షణకు ఎంతో అలవాటుపడివున్నాము. అట్టి ఆకర్షణలేనిస్థితిలో శారీరకంగానూ, మానసికంగానూ కూడా మన స్థితి కల్లోలమైపోవచ్చు. ఈ స్థితిరాకుండా చేయటానికి కృత్రిమంగా కొంత ఆకర్షణను నిర్మించుకోవలసి వస్తుంది. విశ్వాంతరంలో వున్న పరిస్థితులు స్పష్టంగా తెలిస్తేనేగాని, దానికి తగువైన సాధనలను ఊహించటానికి సావకాశం వుండదు.

మామూలు రైలుప్రయాణం చేస్తుంటేనే మన వాళ్లకు ఒళ్లు తిరగటం, కళ్లు తిరగటం వేవిళ్లమనుషుల్లా వాంతులు చేసుకోవటం ఇవన్నీ ప్రారంభమౌతాయి—గంటకు 40 మైళ్లు మించని ఈ వేగానికే. 25000 మైళ్ల వేగంతో పోతున్న మనుషులసంగతి ఎలావుంటుందో ఊహించండి! ఇంత భయంకర చలనం జీవకండరాలనుకూడా విచ్ఛిన్నం చేయవచ్చు.

ఇంతవరకూ ఇవి మనం ఊహించగల ప్రమాదాలు, విశ్వాంతరంలో మనఊహకు అందని ప్రమా

దాలు ఇంకా ఎన్నో వుండవచ్చు. ఏది ఏమైనా విశ్వాంతరయానాన్ని సాధించటానికి తీవ్రమైన ప్రయత్నాలు సాగుతున్నాయి. విజయం చేకూరేదినం అతి సన్నిహితమై వున్నదనే ఆశించుదాం. వాన్ బ్రాన్ పథకంలోవున్న అనేక చిక్కులను ఇతర శాస్త్రవేత్తలు ఎత్తిచూపి తీవ్రంగా విమర్శించుతున్నారు. ఇలా ఎత్తిచూపుతున్నారు గనుక వీటిని అధిగమించగల శక్తులనుకూడా త్వరలోనే శాస్త్రజ్ఞులు సాధించవచ్చు. విశ్వాంతరాధిపత్యంకొరకు రష్యా అమెరికాలమధ్య చెలరేగిన పోటీదృష్ట్యా, ఈ కార్యం త్వరలోనే సిద్ధించవచ్చు.

నూతనంగా మనం విశ్వాంతరంలో నిర్మించ నూహించుతున్న స్టేషన్‌నుంచి, చంద్రుణ్ణి చేరుకోవటానికి 7000 మైళ్ళ గమనవేగమున్న వాయునౌక చాలునని పైన చెప్పుకున్నాం. అంగారక గ్రహాన్ని చేరటానికి అంతకంటే ఇంకా కొంచెం గమనవేగమున్న వాయునౌక కావాలి. విశ్వాంతర కేంద్రంనుంచి దాన్ని నిర్ణీతమైన కాలంలో, నిర్ణీతమైన దిక్కుగా వదలాలి— అంగారకుని గమనాన్నీ, భూమిచుటూ తిరిగేటప్పుడు ఈ విశ్వాంతరయాన కేంద్రగమనాన్నీ లెక్కగట్టి. శుక్రగ్రహానికి పోవాలంటే ఈ నౌకను అంగారక గ్రహానికి పంపేదిక్కుకు ఎదురుగావున్న దిక్కుకు పంపాలి.

సూర్యకుటుంబ గ్రహాలలో భూమితో పోలిక చేయదగిన గ్రహాలు అంగారకుడూ, శుక్రుడూ, ఇవి రెండే. అంగారక గ్రహవ్యాసము 4230 మైళ్లు. శుక్ర గ్రహ వ్యాసము 3008 మైళ్లు. శుక్రగ్రహంమీద ప్రాణవాయువు (Oxigen) లేదంటున్నారు. అందుచేత అక్కడ జీవరాసుల ఉనికికి ఆస్కారం కనుపించదు. అంగారక గ్రహంలో అట్లాంటి ఆస్కారం కనుపిస్తున్నది. (ఇది వేరే ప్రత్యేకవిషయం. ఈ విషయాన్ని ఇక్కడ చర్చించటానికి అవకాశం లేదు.) అక్కడ ఏదోరకం జీవరాశి ఉండే ఆస్కారముందనేమాట నిజం. కాని బహుళప్రచారంలో వున్న 'శుక్రగ్రహంలోని కాలువలు' వగైరా వ్యవహారమంతా వట్టి అభూతకల్పన.

ప్రతిదీ అసాధ్యమంటూ కూర్చునే నిరాశావాదులు కొందరు ఎప్పుడూ వుంటూనే వుంటారు. అలాగే, ఈ విశ్వాంతరయానం కడంటా సాగే వ్యవహారం కాదని కొందరంటూనే వున్నారు. కాని మానవుడు త్వరలో విశ్వపథాన్ని జయించబోతున్నాడని ప్రపంచం సర్వత్రా పలువురు విశ్వసించుతున్నారు.

# ఇందిర

## శ్రీ మాస్తి వెంకటేశఅయ్యంగార్

* కన్నడ రచనకు అనువాదం *

నారాయణమూర్తి జీవితానికి ఇంటా బయటాకూడా సుఖం లేదు. అనేక కారణాలవల్ల ఎప్పుడూ దుఃఖంగా వుంటూ వుంటాడు. కచ్చేరీనుండి యింటికి వచ్చి ఏదో విధంగా రెండు ముద్దలు మింగి పడక గదిలోకివెళ్ళి కూర్చున్నాడు. అతని భార్య యింట్లో పనులు చేసుకొంటూవుంది. "పాపం, ఒక్కతే చేసుకొంటూ వుంది పనులన్నీ, సాయంచేసేవాళ్లు ఎవ్వరూ లేరు." అని అనుకొన్నాడు. ఇంకా యిలా అనుకొన్నాడు. "ఇందిరో! ఆమె కూడా యింటిపనులన్నీ తానే చేసుకొంటూ వుండేది. అయినా ఎప్పుడూ నవ్వుముఖంతో ఉండేది. అయితే యింతమంది పిల్లా జెల్లా ఇందిరకు లేరు. అబ్బ, యీ పిల్లల బాధను వర్ణించడం కష్టం. పిల్లలు లేనివాళ్లు అయ్యో! మాకు పిల్లలు లేరు, సంతాన సుఖం మేము పొందడం లేదు, అని బాధపడుతూ ఉంటారు. పిల్లలు వున్నవాళ్ళ బాధ వేరేలా ఉంటుంది. పాపం, ఆ బిడ్డణ్ణి ఆసుపత్రిలో వదిలి వచ్చాను. ఇక్కడే ఇంట్లో పక్కలమీద పడుకొని నిద్రిస్తూ వున్న పిల్లలమాదిరిగా వాడుకూడా మా పిల్లవాడేగదా! కాని సావిత్రి అలా భావించడం లేదు. ఇందిర బ్రతికివుంటే యిలా ఉండేదా!"

ఇలా ఆలోచిస్తూ వుండగానే నారాయణమూర్తికి కునుకు వచ్చింది. దుఃఖంగా వున్న మనస్సు, అలసిపోయిన శరీరం—యీ రెండిటికీ విశ్రాంతి అవసరం. ఇంతలో అక్కడికి ఇందిర వచ్చింది.

ఆమె ఎలా వుంటుందో తెలియనంతవరకు ఆమె రాకలోవున్న అంతరార్థం మీకు బోధపడదు. ఇందిర మంచిరూపసి. కోలముఖం. నిర్మలంగాను అందంగాను మిసమిసలాడుతూవుంది ఆమె ముఖకాంతి. ఆ అందం రెండు కనుబొమల మధ్యగా వెళ్ళి కనుదోయి మీదకు మళ్ళింది. వికసించిన మల్లెపుష్పాలలా వున్నాయి ఆమె నేత్రాలు. ఆ సుందర పుష్పాల్లో నల్లని తుమ్మెదలు చిక్కబడిపోయి బైటకురాలేక చంచలంగా అటూ యిటూ తిరుగుతూ వున్నవి. "ఇదిగో, వదిలివేశాం" "ఇదిగో వదలలేదు." అంటూ ఆ తుమ్మెదల్ని ఆశపెడుతూ వున్నవి ఆ కనురెప్పలు. పొడుగుపాటి అందమైన ముక్కు. సగం వికసించిన గులాబీ రెక్కల్లాంటి పెదవులు. సన్నని, తెల్లని బియ్యపు గింజల్లాంటి పండ్లు. పసుపుపచ్చగ నిగనిగలాడే బుగ్గలు. ముఖాన రెండు కనుబొమల మధ్య కొంచెం పైగా చిన్ని కుంకంబొట్టు. నిజానికి చాలా అందమైన ముఖం ఇందిరది. అంత పొడగరీ కాదు, అంతపొట్టీ కాదు. చూడటానికి సామాన్యంగా వుంటుంది. మొత్తంమీద ఇందిర అపరూపసుందరి.

ఆమెను చూస్తేనే చాలు సంతోషం కలుగుతుంది. సంతోషమే గాదు. ఎంతకోపం వచ్చినా మటుమాయమై పోవలసిందే. మన కోపాన్ని వ్యాకులతను తొలగించే వాళ్ళు రావడం మనకు యిష్టం వుండదు కారణం వాళ్లు 'మన వాళ్లు' కావడమే. అందువల్లనే నారాయణమూర్తి ఇందిరను చూచికూడా ఏమీ మాట్లాడ లేదు.

ఇందిర అతని దగ్గరకు వచ్చింది. అతని ముఖాన్ని పైకి ఎత్తుతూ చిరునవ్వు నవ్వి అన్నది—"అప్పుడే నిద్ర వచ్చిందీ! మాట్లాడరేం? అయితే వుండండి దానికి యిదే మందు" అంటూ ఆమె నారాయణమూర్తి ఒడిలో కూర్చున్నది.

వైమనస్యాన్ని ప్రేమ అత్యద్భుతంగా జయించింది. రాగికీ బంగారానికీ ఎక్కువ తేడావుంటుందా లేక ప్రసన్నతకూ అప్రసన్నతకూ ఎక్కువ తేడావుంటుందా? వైమనస్యం రాగిని బంగారం చేయలేదు గాని ప్రేమమాత్రం ఆపని చేసివేస్తుంది. అప్రసన్నతను ప్రసన్నతగాను, శత్రువును మిత్రునిగాను, దుఃఖంతో క్రుంగిపోయేవారిని సుఖవంతులుగాను చేసివేస్తుంది.

అనువాదకులు : శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి

ఆకాశంలో విహరించే తారలాంటి అందమైన రమణి నారాయణమూర్తి ఒడిలో కూర్చునే సరికి అతని మనస్సు చంద్రునిలా చల్లబడి పోయింది. అతనికోపం శాంతించింది. వ్యాకులత తొలగిపోయింది. నారాయణమూర్తి ఆమెను హృదయానికి గట్టిగా హత్తుకున్నాడు.

"ఇందిరా!" అని పిలిచాడు.

"నేను, మాట్లాడను. ముందుగా నేను పలకరిస్తే మీరు పలకలేదుగా! యిక మీరు ఇందిరా, ఇందిరా అని యిరువది సార్లు పిలిచినా పలకను. నోరుకదపను.

"ఇందిరా !"

"నోరుకదపనని చెప్పలేదూ !"

"అయితే నోరు కదపకుండానే యిన్నిమాటలు మాట్లాడుతూ వున్నావా ?"

"అదిగాదు. మళ్ళీ నన్ను పేరుబెట్టి పిలుస్తారని అలా అన్నానండీ !"

"ఏం ! ఎందుకు ?"

"మీరు నన్ను పేరుబెట్టి పిలిస్తే నాకు ఎంతో సంతోషం కలుగుతుంది !"

"నిజంగానా !"

"కాకపోతే యిందులో సందేహమా !"

"అయితే దీన్ని అబద్ధమనే భావించవచ్చు."

ఇందిర నారాయణమూర్తి భుజంమీద తన తల ఆనించింది. నారాయణమూర్తి చెక్కిలిని ఇందిర ఉచ్ఛ్వాసనిశ్వాసాలు స్పృశించాయి. ఆమె ముఖాన్ని రెండుచేతుల్లోకితీసుకొని చూచాడు. అబ్బ, ఎంత అందమైన ముఖం! ఆమె నేత్రాల్లో అపారమైన ప్రేమనిండివుంది. ఇందిరను గట్టిగ కౌగలించుకున్నాడు.

"ఇందిరా అని నేనుపిలిస్తే నీకు అంత సంతోషం ఎందుకు కలుగుతుంది?"

"ఏమో నాకు తెలియదు."

"తెలియకుండా ఎందుకు ఉంటుంది ! నిజం చెప్పు."

"ఏమి చెప్పాలో నేర్పండి. అలాగే చెబుతాను."

"నేర్పితే చెప్పేటందుకు నీలాంటి తెలివిగలదే కావాలి!"

"నేను వీణవాయించితే మీకు బాగా వుంటుందా?"

"నీవు వీణ వాయించితే విని చాలారోజులైంది. నిజంగా వీణ అంటే నాకు చాలాయిష్టం.

"ఎందుకని?"

"వీణానిస్వనం మధురం. అందుకని"

"ఆ నేర్పరితనం, ఆకళ ఎవరిది?"

"నీది —"

అవును నాదే. మీరు 'ఇందిరా' అని పిలిస్తే నా హృదయంలో వీణానిస్వనం మారుమ్రోగుతుంది. ఆ మధురనాదం కేవలం నాఒక్కదానికే వినబడుతుంది. అందుకనే నాకు సంతోషం కలుగుతుంది.

నారాయణమూర్తి ఏమీ మాట్లాడలేదు. ఇందిర కూడా మౌనంగావుంది. ప్రణయజీవులకు—కలయిక సమయంలో—సంభాషణలవల్ల కలిగినంత ఆనందం మౌనంగావున్నా తప్పక కలుగుతుంది. కొద్దిసమయం గడిచింది. నారాయణమూర్తి ఇలా అన్నాడు—

"ఇందిరా!"

"ఏం?"

"నేనంటే నీకు ఎంతప్రేమో చెప్పు!"

"నిన్ను గాఢంగా ప్రేమిస్తూవున్నా"నని ఆమె అనాలని నారాయణమూర్తి అభిలాష. ఈవిధంగా భావించని భర్త ఎవరు వుంటాడు?"

"నాకు మీమీద అసలు ప్రేమ లేనేలేదు."

"లేదూ!......ఎందుకని?" నారాయణమూర్తి ముఖం వెలవెలబోయింది. తాను అనుకొన్న ప్రకారం సమాధానం అతనికి లభించలేదు.

"మీరంటే నాకు కొంచెంగూడా ప్రేమ లేదు. కాని మీరంటే ఏమిటో అమిత పిచ్చిగా వుంటుంది నన్ను పిచ్చిదాన్ని చేసివేశారు" అని నవ్వుతూ తన శిరస్సు అతని బుజంమీదకు బాగా వాల్చింది. నారాయణమూర్తి ముఖం వికసించింది.

"ఇందిర హృదయం చాలా చిన్నది. అయినా అందులో ఎంత ప్రేమ నిండివుంది! ప్రేమను గూడా ఎంత అద్భుతంగా ప్రకటిస్తూవుంది! నాకోసం ప్రాణం అర్పించేటందుకుకూడా ఇందిర సిద్ధమే" అనుకొన్నాడు నారాయణమూర్తి. అతని హృదయం ప్రేమతో నిండిపోయింది.

"ఓం" అనే అక్షరానికి విద్వాంసులు అనేక అర్థాలు చెబుతారు. అదేవిధంగా నారాయణమూర్తికి 'ఇందిర' అనే శబ్దంలో అనేక విశేషాలు ద్యోతక

మైనవి. అపరిమితమైన ప్రేమ. అమితమైనదయ. మిక్కుటమైన మోహం మొదలైనవన్నీ కనబడ్డాయి. అతని శరీరంలోనిరక్తం ఇందిర అనే శబ్దాన్ని బట్టి ప్రవహిస్తూ వున్నదా" అన్నట్లు తోచింది.

ప్రేయసి తన ప్రియుని భుజంమీద తల ఆనించి అతనివంక చూడటం ప్రారంభించింది. నారాయణమూర్తి ఆమెను తనదగ్గరకు చేర్చుకున్నాడు. తలవంచి ఆమెను తదేకంగా చూడటం ప్రారంభించాడు. ఎంతసేపు అలా కూర్చున్నారో తెలియదు.

అన్నివిధాల సుఖం పొందుతూవుండే గృహస్థు స్థాయిని ఆ సమయంలో నారాయణమూర్తి అందుకున్నాడు. అట్టి సుఖం, అట్టి శాంతి కలగడం చాలా కష్టం. అంతటి సుఖశాంతులు కలిగితేమాత్రం వాటితో సరితూగే వస్తువు మరొకటిలేదు. అపొందిన సుఖాన్ని గురించి దాని వాస్తవికతనుగురించి యోజించేశక్తి ప్రారంభంలో మానవునికి ఉండదు. కొంతసేపు నారాయణమూర్తి కూడా యీస్థితిలోనే వున్నాడు. తరువాత "ఇంతకు ముందో" అని ఆలోచించడం ప్రారంభించాడు. ఇంతకుముందు ఏమి జరిగిందో అతను మరచిపోయాడు. విషయం మరచినా హృదయం మాత్రం వ్యాకులంగానే వుంది.

"ఇందిరయిప్పుడు యిక్కడ వున్నది. సరే, యింతకుముందో......"అని కొంచెం సేపు ఆలోచించాడు. కొంతజ్ఞాపకం వచ్చింది. వ్యాకులత మితిమీరింది. కొద్ది సేపటికే అన్ని విషయాలూ మరచిపోయాడు. మనస్సు శాంతించింది. మళ్ళీ అన్ని విషయాలు జ్ఞాపకం వచ్చాయి. ఇంతకుముందు...... ఆ ఆసుపత్రిలో పడివున్న పిల్లవాడు......యింటిలో నిద్రపోతూవున్న యీ చిన్నపిల్లలు......వీళ్ళను గన్నతల్లి.........ఆసుపత్రిలో ప్రమాదస్థితిలో పడివున్న పిల్లవాడిని గన్నతల్లీ.........మెరపులా అన్ని విషయాలు మెరసిపోయినవి. మళ్ళీ ఏమీజ్ఞాపకం రాలేదు.

"ఇందిరా!"

"ఏం?"

"ఇందిరా! ఎప్పుడు వచ్చావు?"

"షుమారు అరగంట అయివుంటుంది."

"ఈ గదిలోకి వచ్చావా!"

"అవును."

"ఎక్కడనుంచి యీ రాక?"

"అదేమిటి! అలా ఎందుకు అడుగుతూఉన్నారు?

"నీవు ఎక్కడికి వెళ్ళావో చెప్పవూ?"

"ఎక్కడికీ వెళ్లి లేదే!"

"అయితే నిన్ను చూచి చాలారోజులైనట్లుందేం?

"బలే! బాగానే వుంది."

"ఉండు ఏమో జ్ఞాపకం వస్తూవుంది. ఆఁ అంతా జ్ఞాపకం వచ్చింది." అంటూవుండగానే నారాయణమూర్తి శరీరం కంపించింది. ఇందిర శరీరాన్ని తడిమి చూచాడు.

"ఇందిరా !నీవు నిజంగా యిక్కడేవున్నావా?"

"బాగానే వుంది. అలా అంటారేమిటి ? యిక్కడ లేకపోతే మీ చేతికి ఎలా దొరుకుతాను చెప్పండి !"

"అయితే నాకుఏమి జ్ఞాపకం వచ్చిందో చెప్పనా !"

"చెప్పండి."

"నీనా పెండ్లి ...మన కాపురం...మా అమ్మ నాన్నతో మనం కలసివుండటం...అంతా నిజమే గదూ !"

"అవును నిజమే."

"ఆ తర్వాత అమ్మ చనిపోయింది. నాన్న చనిపోయాడు. చివరి సమయంలో నిన్ను దగ్గర కూర్చో పెట్టుకొని..."

"అవును"

"అమ్మా! పసివాడు. జాగత్త. అబ్బాయీ! పసివాడు జాగ్రత్తరా!" అని మనిద్దరికీ చెప్పారుగదూ!

"అవును"

"ఎంతో గారాబంగా పెంచావు వాడిని. నేను అప్పుడప్పుడు వాడిని కసిరే వాడిని. నీవు మాత్రం వాడిని ఎప్పుడూ కసరలేదు."

"మీరు కసిరితే తప్పేముంది? వాడి మంచికేగా!"

"అదికాదు నా అభిప్రాయం. నీవు చాలా గారాబంగా పెంచేదానివని చెప్పడమే నా ఉద్దేశ్యం. యింతలో ఒకసారి జ్వరం వచ్చి నీవు మంచంపట్టావు."

"అవును."

"ఎన్నో మందులు వాడాను, జ్వరంవల్ల సన్నబడి పోతూ వుండే దానివి. అప్పుడు నాకుండే బ్రద్ధలై

పోతూ ఉండేది. ఒకరోజున...నీవు...అది స్వప్నమా లేక నిజమేనా?

"అసలు విషయం ఏమిటి?"

నారాయణమూర్తి ఇందిరను గట్టిగా పట్టుకొన్నాడు.

"ఒకరోజున నువ్వు ఎక్కడికో......వెళ్ళిపోయావు."

"ఏమిటండీ యీ మాటలు?"

పిల్లవాడిని పెంచేవాళ్ళు ఎవ్వరూ లేరు. నాకు చాలా కష్టమైపోయింది. ఇందిరా! నేను చాలా రోజులు ఏడ్చాను. నా బాధకు అంతులేదు.

"ఊఁ"

"ఏడ్చి ఏడ్చి పిచ్చివాడిలా అయిపోయినాను.."

క్షణంసేపు నారాయణమూర్తి ఏమీ మాట్లాడలేదు. అతనిస్థితి యిప్పుడుగూడా పిచ్చివాడిలాగేవుంది, ఆలోచనా పరంపర బయలుదేరింది...ఇప్పుడు ఇందిర నాదగ్గరే కూర్చొనివుంది. నేను ఇందిరతో మాట్లాడుతూవున్నాను. యిదంతా సరే. కాని ఆరోజున వెళ్ళిపోయిందిగదూ?......ఎక్కడికివెళ్ళింది?...... ఆరోజున...ఎక్కడికో వెళ్ళిపోయింది...నిజమే వెళ్ళిపోయింది. కాని ఎక్కడికి వెళ్ళినట్లు? ఏమైపోయినట్లు?...యీ ప్రశ్నలకు ఏమీ జవాబుతోచలేదు.

నారాయణమూర్తి అప్పుడున్న స్థితిలో...అంటే అర్థనిద్రావస్థలో మానవుల మనస్సు అనేకవిభాగాలుగా విభజింపబడి ఉంటుంది. కొంతభాగం జాగ్రదావస్థలోనూ, కొంతభాగం నిద్రావస్థలోనూ ఉంటుంది. మనం ప్రతిరోజు వేరువేరు అవయవాలద్వారా పొందే జ్ఞానమంతా శరీరంలోని వేరువేరు భాగాలలో వుంటుంది. అర్ధనిద్రావస్థలో జాగృతిభాగాలలోని విషయాలు సహజంగానే జ్ఞాపకం వస్తాయి. నిద్రితములైయున్న భాగాలకు సంబంధించిన విషయాలు మాత్రం జ్ఞాపకం రావు. ఈసమయంలో నారాయణమూర్తి పరిస్థితి కూడా అలాగే వుంది. చాలా రోజులనుండి అనుభవం పొంది వున్నందున హృదయానికి హత్తుకొనివున్న విషయం వెంటనే జ్ఞాపకం వచ్చివేసింది. కాని విషాదకరమైన ఘట్టం హృదయానికి దూరంగా వున్నందున అర్ధనిద్రావస్థలో అది జ్ఞప్తికి రాలేదు. "ఇందిర ఏమైనట్లు?" అనే విషయం అతనికి అర్థంకాలేదు. కాని విషాదకరమైన ఒక అశుభఘట్టం మాత్రం అర్థమవుతూ వుంది.

"తరువాత ఒక పర్యాయం రెండు జాములవేళ పిల్లవాడికి ఆకలి వేసింది. యింటిలోవాడికి ఏమీ దొరకలేదు తినడానికి. ఇంటి దగ్గర మంచి చెడ్డ చూచే వాళ్లు ఎవరూ లేకపోవడమే యిందుకు కారణం. నేను కచ్చేరీనుంచి యింటికి వచ్చాను. పిల్లవాడు వెక్కి వెక్కి ఏడుస్తూ వున్నాడు. నాకు అమిత దుఃఖం కలిగింది.

"ఊఁ"

"వాడి పోషణచేసేవారు యింట్లో ఎవ్వరూ లేరు. ఎవరైనా వుంటే బాగుండుననిపించింది. కాని ఏమి చేయాలో తోచలేదు...ఒకరోజున బాబాయి వచ్చి యీడువచ్చిన ఒక అమ్మాయి వుంది. పెండ్లి చేసుకోమని చెప్పాడు—ఎందుకనో గాని పెండ్లి చేసుకొందామనే కోరికే నాకు కలగలేదు." కాని పిల్లమాత్రం మంచిది. అందుకనే చేసుకో" మని అనేక విధాల చెప్పాడు బాబాయి. వెళ్లి పిల్లను చూచాను. ఆమె యీ సావిత్రియే—అందంగానే వున్నది. కాని సావిత్రిని పెండ్లి చేసుకుందామనే కోరిక ఏమీ కలుగలేదు.

నాకు యింట్లో బాధగావుంది. ఏకాంత జీవితమంటే విసుగు పుట్టింది. ఇందిరా! నీవు లేనందున హృదయం వ్యాకులపడిపోయింది. బాబాయివచ్చి మళ్లీ చెప్పాడు. "ఒరే మూర్తి, ఆ పిల్లవాడిని చూసైనా పెండ్లిచేసుకోరా! ఇంట్లో వాడి మంచీ చెడూ చూచేవారు ఎవ్వరూ లేరు. సావిత్రిని పెండ్లిచేసుకో. పిల్లవాడిని పోషిస్తుంది. పిల్లవాడినేకాదు. నిన్నుగూడా పోషిస్తుంది."

"మంచిదే."

"నేను అంగీకరించాను."

"నా యిష్టప్రకారమే పెండ్లి చేసుకున్నాను. సావిత్రి యిక్కడకు వచ్చింది. కొద్దిరోజుల వరకు సావిత్రికూడా నీలాగేవుంది. కాని తరువాత తరువాత మారిపోయింది. సావిత్రికి సంతానం కలిగినప్పటి నుండీ యీ పిల్లవాడినిగురించి శ్రద్ధవహించడం మానివేసింది. ఈ విషయమై నేను దానిని కోప్పడ్డానుకూడా. కాని లాభం లేకపోయింది. సావిత్రికికూడా కోపంవచ్చింది. అప్పటినుంచీ యీ యింట్లో సుఖం మృగ్యమైపోయింది.

ఇందిర ఏమీ మాట్లాడలేదు. ఆమె కళ్ళనుండి కన్నీటిధారలు అవిరామంగా ప్రవహిస్తున్నట్లు నారాయణమూర్తికి కనపడింది.

ఆపిల్లవాడూ, సావిత్రికి పుట్టిన యీ పిల్లలూ, సమానమే. కాని సావిత్రికి మాత్రం అలాతోచలేదు. యిద్దరినీ వేరువేరుగా భావించింది. నేను ఏమీ చేయలేక పోయాను. అన్నం పెట్టేది, మిగతా మంచీ చెడూ అంతా చూచేది సావిత్రేగదా! నేనేమి చేయగలను? ఆమె ఏమిచేసినా చూస్తూ వూరుకోవలసి వచ్చింది.

ఇందిర ఏమీ మాట్లాడలేదు.

'నేను అసలు పెండ్లి చేసుకొన్నది ఆ బిడ్డడికోసమే. కాని వాడికి మాత్రం సుఖం కలుగలేదు. ఏదో విధంగా పెరిగి పెద్దవాడైతే అన్ని కష్టాలు యీడేరుతవని అనుకొన్నాను. ఆవిధంగానూ జరగలేదు.

ఇందిర మౌనంగానే వున్నది.

"మొన్న వాడు ఎక్కడనుండో జ్వరంతో వచ్చాడు. డాక్టరుకు చూపించాను. ఆయన ప్లేగువ్యాధి అని చెప్పాడు. వాడిని యింటిలో వుంచితే మిగతా వాళ్ళకు గూడా వ్యాధి సోకుతుందేమోనని భయం కలిగింది. ఆసుపత్రిలో చేరుస్తామూ అంటే అక్కడ వాడికి సేవచేసే వాళ్లెవరూ లేరు. ఎలాగా అనే ఆలోచనలో బడ్డాను. ఆసుపత్రిలో నే చేర్పుమని సావిత్రి సలహా చెప్పింది."

"సరే"

"వాడిని అక్కడే చేర్చారు. బాబాయి అక్కడ వున్నాడు. సావిత్రినన్ను పిల్లవాడివగర, ఆసుపత్రిలో వుండనీయలేదు. నేను అక్కడ వుండకూడదట. దాని హృదయం చాలా కఠోరం. ఇందిరా! సావిత్రి హృదయం నిజంగా పాషాణం."

ఇందిర కదలకుండ కూర్చొనివుంది.

ఇవాళ సాయంత్రమే వాడిని చూచి వచ్చాను. పిల్లవాడు గిలగిల తన్నుకుంటూ వున్నాడు నేను చూడలేకపోయాను. ఊరికి దూరంగా కాపురం వుండటంవల్ల త్వరగా యింటికివచ్చాను. అమ్మా! అమ్మా! అని ఒకటేఅరుపు. అమ్మఏదీ! పాపం, ఎంత బాధపడుతూ వున్నాడో చెప్పలేను."

"వాడు బాగానే వున్నాడు. మీరేమీ బాధపడకండి." అన్నది ఇందిర.

"నాకు ధైర్యం కలిగేటందుకా యిలా అంటున్నావు? సాయంత్రం అంత బాధపడుతూ వున్న వాడికి అప్పుడే ఎలా నయమవుతుంది? పోనీలే? నీవు సమయానికి వచ్చావు. వాడి వ్యవహారం యికనువ్వు చూస్తావుకదూ!"

"తప్పకుండా."

"అయితే యికనాకు చింతలేదు. చూడు! నిన్ను చూడంగానే నాబాధంతా మాయమై పోయింది. అంటూ నారాయణమూర్తి ఇందిరను ప్రేమతో కౌగలించుకొన్నాడు.

"నిజంగా పిల్లవాడికి నయమయిందా?"

"ఆ నయమయింది."

"నువ్వు చూచావా?"

"ఆ, మీరుకూడా చూస్తారా?"

"ఏడీ! ఎక్కడున్నాడు?"

"అడుగో" అంటూ ఇందిర గదిగుమ్మం వైపు ప్రేలితో చూపించింది. నారాయణమూర్తి అటు చూశాడు. గోపాలుడు నిలబడివున్నాడు. వాడు బాగా ఆరోగ్యంగా వున్నాడు. నారాయణమూర్తికి అమితానందం కలిగింది. సంతోషంతో ఇందిరను చూద్దామని ఆవైపుకు తిరిగాడు. ఇందిర రూపం అస్పష్టంగా కనబడింది. "ఇందిరా" అని పిలుస్తూ ఆమెను పట్టుకుందామని ప్రయత్నించాడు. కాని ఆమె చిక్కలేదు పర్వత శిఖరంమీద నిలబడి మేఘాల్ని పట్టుకుందామని ప్రయత్నించి విఫలుడైపోయిన బాలునిలా అయింది. నారాయణమూర్తి స్థితి. "ఇందిరా" అని గట్టిగా అరిచాడు. ఇంతలో మెలకువ వచ్చింది.

ఇందిర చనిపోయి పది సంవత్సరాలు గడిచాయి. అప్పుడు పత్నీ వియోగ దుఃఖం అంటేఏమిటో అతనికి బోధపడింది. నేడు ఆ ఇందిరయే కలలో కనబడి తియ్యని మాటలు మాట్లాడి అదృశ్యమై పోయింది. నేడు మళ్లీ రెండవసారి పత్నీవియోగదుఃఖం కలిగింది నారాయణమూర్తికి.

నారాయణమూర్తి కిటికీగుండా బైటకు చూచాడు. రాత్రిసమయం. అంతటా నిశ్శబ్దంగావుంది. పిండారబోసినట్లు వెన్నెల కాస్తూవుంది. నిర్మల ఆకాశంలో చంద్రుడు తన ప్రియురాండ్రకు తారా సమూహం మధ్య ఆనందంతో విహరిస్తూ వున్నాడు. అతని శీతల కిరణాలు తమ కాంతితో యావత్తు ప్రపంచాన్ని స్నానం చేయిస్తూవున్నవి. ఆహా ఏమిశాంతి? ఎంత ఆనందం?

ఆ నీరవమైన వెన్నెలరాత్రియందు బిడ్డడు గోపాలునికి గూడా అతని తల్లి ఇందిరతో బాటు అనంతశాంతిదేవతామతల్లి ఒడిలో శరణ్యం లభించిందనే విషయం నారాయణమూర్తికి తెలియలేదు.

# మా ఆవిడ నీళ్లాడేదాకా మా గుమ్మంతొక్కొద్దు

శ్రీ కవికొండల వేంకటరావు

**పాత్రలు:** భర్త రామేశం; భార్య వెంకమ్మ; ఆడపిల్ల; మగపిల్లడు; అల్లుడు; ప్రక్కింటి ఆడమనిషి; ప్రక్కింటి మగమనిషి

## మొదటి రంగము : రామేశం ఇంట్లో

ప్రక్కింటి ఆడమనిషి: మనకు విద్య కావాలమ్మా! అప్పుడు కంయొక్క విలువ తెలుస్తుంది.

వెంకమ్మ: ఏమో! ఇంతకాలం విద్యలేకుండా పెరిగాను.

ప్ర.ఆ: నీకు పిల్లలా?

వెంక: అవును! ఉన్నారమ్మా! ఒక మగపిల్లవాడు, ఒక ఆడపిల్ల.

[పిల్లవాడు, పిల్ల అలా వెళతారు.]

ప్ర.ఆ: వాళ్ళేనా?

వెంక: అవునమ్మా వాళ్ళే! వాళ్ళల్లో ఆడపిల్లకు పెళ్ళి చెయ్యాలి.

ప్ర.ఆ: ఏం? మగపిల్లవాడికి పెళ్ళిచేయనక్కరలే!

వెంక: వాడే కట్టుకుంటాడు ఎవర్తెనో ఒకర్తెను.

ప్ర.ఆ: అలాంటి ధీమాయే ఆడపిల్ల విషయంలోనూ మనం కలిగివుండాలి—వాళ్ళిలా వస్తున్నారు.

[పిల్లవాడు పిల్లా వస్తారు]

మగపిల్లవాడు: అక్కా! మనం "కారెమ్ము" ఆడుకుందామా?

ఆడపిల్ల: వద్దురా! చింతగింజ లాడుకుందాం!

[వాళ్ళిద్దరూ నిష్క్రమిస్తారు]

ప్ర.ఆ: అప్పుడే వాళ్ళిద్దరిలోను తేడా కనిపించేని.

వెంక: కనబడదుటమ్మా! ఆడపిల్ల ఆడపిల్లే. మగపిల్లవాడు మగపిల్లవాడే. అందుకనే ఆడపిల్లకు త్వరగా మనం పెళ్ళిచేయా లంటూవున్నది.

ప్ర.ఆ: ఏం? ఆడపిల్ల చదువుకుంటే చెడిపోతుందా?

వెంక: చెడదు కాని—దానికి చదువు అనవసరమని నా అభిప్రాయం.

ప్ర.ఆ: ఏమో! నేను వాళ్ళకు చదువుండా లంటాను. మగవాళ్ళకెలాగయినా చదువు వస్తుంది. ఆడవాళ్ళకే రాదు.

వెంక: రాకేం అమ్మా! చెప్పిస్తే వాళ్ళకూ వస్తుంది. ఇప్పటిమట్టుకు ఇద్దరకు సరిసమానంగా చదువు చెప్పిస్తున్నాం.

ప్ర.ఆ: నాకూ పిల్లలుంటే నేనూ చెప్పిస్తును.

వెంక: పిల్లలు నీకు లేరో! బ్రతికిపోయావు. పిల్లలుంటే భాగ్యముండాలి, భాగ్యముంటే యోగ్యత వుండాలి. అన్నీ వుంటే ఆరోగ్యముండాలి.

ప్ర.ఆ: అన్నీ ఒకచోట చేరివుండవు. అవి మనం చేర్చుకోవాలి.

వెంక: అవునమ్మా! పిల్లలంటే ఏలాగో కలుగుతారు కాని, భాగ్యంకలుగదు.

ప్ర.ఆ: ఏమి? మీకు భాగ్యం లేదా?

వెంక: అసలు లేదనను. కాని తగినంత భాగ్యం లేదు. ఏది రేడియో? ఏది ఎలక్ట్రిసిటీ? ఏది వంటలక్క?—చెప్పండీ!

ప్ర.ఆ: భాగ్యం తనంతనే వస్తుంది అని నా వూహ. పిల్లలే కలగరు.

వెంక: ఎవరికేది లేదో దాన్నిగురించి ఒత్తి చెబుతారు.

ప్ర. మగమనిషి: (పిలుస్తాడు) ఒసేవ్! (అని)

ప్ర.ఆ: మా ఆయన పిలుస్తున్నారమ్మ! వెళ్ళొస్తా!

వెంక: బొట్టుంచుకు వెళ్లు. (బొట్టు పెట్టును)

ప్ర.ఆ: ఏమిటో పూర్వకాలపు ఆడమనిషివి! ఇంకా బొట్టు పెడతావు. [తెఱ]

## రెండవ రంగము: ప్రక్కయిల్లు

ప్ర.మగ: ఏమి? ఎక్కడికి వెళ్లావు? ఇంతలోకే వెళ్లాలీ, నేను ఇడ్డెనలు తెచ్చే లోపుగా! వెళ్ళి ఏం పాము కొచ్చావు?

ప్ర.ఆడ: ఏమీ పాముకు రాలేదండీ! ఒక సంగతి తెలుసుకు వచ్చాను. వాళ్ళకొక ఆడపిల్ల, ఒక మగపిల వాడూనట!

ప్ర. మగ: అయితే ఏమంటావు?

ప్ర.ఆడ: మనకు అలా లేరని.

ప్ర.మగ: మన కున్నది మన కున్నది, వాళ్ళ కున్నది వాళ్ళకున్నది.

ప్ర.ఆడ: మనకేమిటుంది?

ప్ర.మగ: భాగ్యం ఉంది, ఆ భాగ్యం పెట్టి ఇడ్డెనలు కొనుక్కుంటున్నాం, సినీమాలు చూస్తున్నాం! రేడియో వేసికొంటున్నాం, ఎన్నో ఇతర వినోదాలు చూస్తున్నాం! వాళ్ళకేముంది?

ప్ర.ఆడ: వీటన్నిటితో పాటు మనకొక్క ఆడపిల్లైనా ఉంటే బాగుండుననిపిస్తోంది.

ప్ర.మగ: ఆలా నీవు అఘోరిస్తూవుండబట్టే, ప్రభుత్వం ఈ పైనుండి ఆడపిల్లలను కూడా పెంచుకోవచ్చునని చట్టం చేసింది.

ప్ర.ఆడ: నేను అఘోరించబట్టి చేసిందనక పోతే, మీలాంటివాళ్లు చాలా మంది వుండబట్టి ఆలా చట్టం చేసింది ప్రభుత్వం అని ప్రభుత్వాన్ని అభినందించ రాదూ?

ప్ర.మగ: ప్రభుత్వమును అభినందించడం సుళువే కాని, ఎవరిస్తారే ఆడపిలను దతత?

ప్ర.ఆడ: మగపిల్లవాణ్ణి ఎవరిస్తారో, ఆడపిల్లను వాళ్లే యిస్తారు.

ప్ర.మగ: కనుక్కో అసైతే, ప్రక్కింటి వాళ్ళ ఆ పిల్లను మనకు పెంపు ఇస్తారేమో.

ప్ర.ఆడ: ఇవ్వకేం చేస్తారు? వాళ్ళకేం భాగ్యమా! బ్రదుకు తెరువా? బరువల్లా వదలిపోయిందని వాళ్లు భావిస్తారు. ఈ రోజు నేకనుక్కొంటాను. కనుక్కోమన్నారా?

ప్ర.మగ: ఈ వేళే కనుక్కోవడం ఎందుకులే? మఱి రెణ్ణాళ్లు పోయాక కనుక్కోవచ్చు.—మనకు మాత్రంకలుగ కూడదూ పిల్లలు?

ప్ర.ఆడ: మళ్లా ఈ చట్టం మాఱిపోతుందేమో?

ప్ర,మగ: ఇది మాఱితే దీనిఅబ్బ మరోటి. మనకీ భాగ్యం వున్నన్నాళ్ళు, ఎన్ని చట్టాలు మాఱినా ఇబ్బందిలేదు. ముందీ ఇడ్డెనలు తినుచల్లాఱిపోతాయి. (అని తాను తిన ప్రారంభించును)

ప్ర.ఆడ: ఉండండి! వాటిల్లో ఇంటి నెయ్యి కొంచెం వెయ్యనియ్యండి. (అని నెయ్యి వేసి తానుకూడా ఆరగించును.) [తెర]

## మూడవ రంగము: రామేశంఇల్లు.

రామేశం: ఏమిటావిడ అలా నిన్ను వేధిస్తూ వుంటుంది.

వెంక: ఏమీ లేదు. వాళ్ళకు మన ఆడపిల్లను దత్తత యిస్తామేమో అని ఊ—అడుగుతుంది.

రా : నీవు అల్లా ఇయ్యడానికి వల్ల పడదంటున్నావా?

వెంక: అవును. అంటున్నాను. మనం కన్న పిల్లలు మనవాళ్లే! మగవాళ్ళు అయినా ఆడవాళ్ళు అయినా!

రా : ఇక అవితే ప్రభుత్వంచేసిన చట్టం ఎవరి కోసం?

వెంక: ఎవరికోసమో అది? మన కోసం మాత్రం కాదు· నిక్షేపం లాగు తొమ్మిది నెలలు మోసి నేను కనడం ఏవిఁటి? ఆవిడపెంచడమేమిటి? ఆవిడతో నిష్కర్షగా చెప్పేశాను. ఆడపిల్లనైనా సరే మగపిల్లవాణ్ణి అయినా సరే, మన పిల్లల్ని మనం అయి ఇవ్వమని.

రా : నిష్కర్షగా చెప్పేశావు?

వెం : ఆఁ! నిష్కర్షగా చెప్పేశాను! మళ్ళీ మాట్లాడితే సిగ్గులేదటమ్మా అడగడానికి, ఎన్నిసార్లు అని అడుగుతావు?, నీనోరు నొప్పిపెట్టదా? అనికూడా అంటాను.

రా నీవు కన్నట్లైతే ఈ పిల్లల్నందఱిని.

వెం : నేనుకాకపోతే మీరా ఏమిటి? మోసిందాన్ని నేను. నొప్పులు అవీ పడ్డదాన్ని నేను—అయినా దానికంత రాద్ధాంత మెందుకండీ? ఆవిడడిగింది, నేనియ్యనన్నాను. దీనికి మీరాద్ధాంత మెందుకు?

రా : ఎందుకూ లేదు. మనకొక మగపిల్లవాడు చాలడా అని.

వెం : ఎక్కడికీ చాలడం? ఉన్నమ్మకు ఉన్నకొద్దీ ఉండాలనిపిస్తుంది. కన్నమ్మకు కన్నకొద్దీ కనాలనిపిస్తుంది. ఇంతకూ ఈ విషయంలో మీ అభిప్రాయమేమిటి?

రా : ఏమీ లేదు. ఒక కుటుంబానికి ఒక మగపిల్లవాడో, ఒక ఆడపిల్లో ఉంటే చాలని.

వెల : ఆసంగతి ఇదివరకే తోచవలసింది మీకు; నాకు తొలిచూలు మగవాడు కలిగినప్పుడే తోచవలసింది.

రా : అప్పటి కిన్ని వ్యూహాలు లేవు. ఇవన్నీ ఈ 'ఫామిలీ ప్లానింగు', ఆర్థిక సమస్య వచ్చాక ఇప్పుడిప్పుడు నాలో రేకెత్తాయి.

వెం : ఏమో! నాలో రేకెత్తలేదుసుమండీ ఆలాంటి కొత్తవ్యూహాలేవిన్నీ! మన సంపద అంతా మన సంతానం అని నా వ్యూహ!

రా : అయితే అలాఅని చెప్పేస్తా ఆయనగారితో.

వెం : ఏమిటి? ఈవిడ నన్ను వేధిస్తున్నట్టే, ఆయన మిమ్మల్ని వేధిస్తూవున్నారా ఏమిటి? చెప్పారు కారేం ఈముక్క? వాళ్లి భార్యాభర్తల కిద్దఱకూ పుట్టినబుద్ధే యిది? అలా అయితే మనల్ని వదలి పెట్టరు వాళ్లు! ఇంతకూ ఆడపిల్లను పెంచుకుంటే వాళ్ళయింటిపేరు నిలబడుతుందా? ఆయన పేరు నిలబడుతుందా? ఆమెను తరింపజేస్తుందా? ఏమో! మన ఆడపిల్లనుగురించి మన మేమి అంటామో అని అడిగి వుంటారు. ఈ వాదనతో మరి పొద్దు పోగొట్టుకోకండి. లెండి, మడిగట్టుకోండి. [తెర]

## నాలుగవ రంగము:

[వీధి గుమ్మం]

(నేపథ్యంలో ఆడపిల్ల పాట)

పొదుపుగా బ్రదుకండి!
పొదుపుగా వుండండి!
పొదుపుపత్రాలను కొనరండి!
పిల్లలాకోసమై
తాపత్రయం పడకండి!
ధనము కొఱతైయుండ,
ధాన్యంబు కొఱతగా,
మన స్వాతంత్రత ఎట్టు
చెల్లుబడి యగునండి?
మన ప్రభుత్వంబెట్లు
నడచునో చెప్పండి!
పొదుపుగా బ్రదుకండి,
పొదుపుగా వుండండి,
పొదుపు పత్రాలనుకొనరండి!

ప్రక్కయింటి మగమనిషి : ఆపిల్లవాళ్ళ ఆడపిల్లలాగుంది.

ప్రక్కయింటి ఆడమనిషి : వాళ్లి ఆడపిల్లే! ఎంతలో ఎంతఎత్తు పెరిగిందో!—ఇట్టే ఎదుగుతారు ఆడపిల్లలు!

ప్ర. మగ : మరి ఆడపిల్లను పెంచుకుందాం అన్నావు మఱి!

ప్ర. ఆడ : మనముంచుకుంటే అంత ఏపుగా కనిపించక పోవును.

ప్ర. మగ : ఆలా పొదుపుపాటపాడుతూ పత్రాలిచ్చుకుంటూ నడవకపోను.

ప్ర ఆడ : మరేంచేయును?

ప్ర. మగ : మనమిద్దఱం, కట్టబెట్టే ఏమగాణ్నో పెళ్లాడి, ఈపాటికి కాపురంచేస్తూవుండును, ఏవూళ్ళోనో!

ప్ర. ఆడ : ఏవూళ్ళో ఏంఖర్మమూ, మనవూళ్ళోనే పెళ్ళాడియుండును ఆలా వెళ్లేఒక అబ్బాయిని.

ప్ర. మగ : ఆలా ఒక మగ అబ్బాయి వెడుతున్నాడా?

ప్ర. ఆడ : వెడుతున్నాడేమిటి? వాళ్లిద్దరూ కలిసి, ఒకేపాట పాడుతుంటే.

[పై పాట తిరిగి యిద్దఱి గొంతుకలతో వినిపించును.]

ప్ర. మగ : అయితే వాళ్ళిద్దర్నీ ఇలా పిలుద్దాం!

ప్ర. ఆడ : మీ కిష్టమైతే పిలవండి!

ప్ర. మగ : ఏం నీకిష్టం లే?

ప్ర. ఆ : ఆలా మనం అనుకోనేలో వాళ్ళిద్దఱూ మాయమై పోయారు.

ప్ర.మగ : మళ్ళీ వస్తారు! ఎక్కడికి వెడతారు? వాళ్ళ పాట ఇంకా వినిపిస్తోందే! [తెర]

## అయిదవ రంగము: రామేశం ఇల్లు

వెం : ఆ యింటం పొదుపు లేదే?

ఆడ : ఆ యింటికి వెడితే వారు పెంచుకుంటాం అని అంటారని నా భయం, అంచేత నేను వెళ్ళ లేదు.

వెం : మీ రిద్దరూ వెళ్ళినా?

ఆడ : మే మిద్దరం వెళ్ళినా వాళ్ళు పెంచుకుంటాం అనేటట్టు న్నా రు!

వెం : మీ కిద్దరకు పెళ్లైంది అని అన్నా?

ఆడ : ఆఁ! అల్లా కనిపించారు! అంచేత వాళ్ళయింటికి వెళ్ళ లేదు.

వెం : వాళ్ళ యింటికి వెడి తే తప్పక తీసికొని వుందురే ఒక పొదుపు పత్రం! మా అమ్మ! నీవంటే వాళ్లి కెంతో ప్రేమ.

ఆడ : ఇప్పుడైతేం, మించిపోయిందిలేదు. అక్కడకు వెళ్ళివస్తా! సరా!

వెం : వెళ్ళొచ్చి చెప్పు ఏమన్నారో, ఏం చేశారో.

ఆం : ఏం చెబుతారు? ఏం చేస్తారు? వాళ్ళు శేడి యోరే బాగు చేయించుకుంటారా? 'ఎలెక్ట్రిక్' బిల్లే కడతారా? అద్దె యిస్తారా? కాఫీయే త్రాగుతారా? అన్న మే తింటారా? అన్నీ పోతే మిగిలేది పెట్టి, ఒక మోటారుకారు కొంటా మంటారు. నన్ను చంపడంకొని పొదుపు పత్రమూ కొనరు. ఏమీ కొనరు.

వెం : అంత చేటు బండలైతే నిన్ను వాళ్ళు పెంచుకు ఎట్లా సుఖపెడతామన్నారో! నిన్నివ్వలేదో బ్రతికిపోయినాం! ఇంతకూ వాళ్ళూ పిల్లె సుఖ పెట్టేదేమిటి? మగడు సుఖపెట్టాలిగాని: ఏ మమ్మ! ఎన్ని పొదుపు పత్రాలు సంతకాలు చేయించి డబ్బు కట్టించావు ఈ వేళ !

ఆడ : మీ అల్లుడుగారూ నేనూ ఊరికే తిరిగి వచ్చాం! అంతే! ఎవ్వరూ పొదుపుమాట యెత్తడం లేదు. పత్రాలు కొనడం లేదు. దీనికి నాన్నగారు ఏమి జవాబు చెప్తారో?

[రామేశం అందాకా ఏదో పని చూసుకుంటూ ఆగి]

రామే: అంటే, మతి సరియైన పద్ధతిలో మీ వృత్తి జరుపలేదన్నమాట. వీధిలో కేవలం పచార్లు చేస్తూ కాలక్షేపం చేశారన్నమాట! ఏదైనా పని పూనుకుంటే అది 'సీరియస్'గా చేయాలి. వేళాకోళంగా చేయరాదు.

ఆడ : నేను వేళాకోళంగా చేశానా [అని ఏడ్చును.]

వెం : ఏడవకమ్మా! ఈ పొదుపూ వద్దు ఈ పత్రాలు వద్దు. నివ్వూ నీ మగడూ సుఖంగా వుంటే అంతే చాలు.

ఆడ : [వెక్కి వెక్కి ఇంకా ఏడ్చి, ఏడ్పు ఆపునట్లు తెఱ]

## ఆరవ రంగము: ప్రక్క ఇల్లు

వెం : ఏమమ్మా! మా అమ్మాయివద్ద ఒక పొదుపుపత్రం కొంటే మీ క్షేమైనా పరువు నష్టమా?

ప్ర. ఆడ : మీ అమ్మాయిని మాకు పెంపిస్తే ఏం అభ్యంతరం?

వెం : మా అమ్మాయికి పెళ్ళి అయిపోయింది. మరి పెంపకం లేదు గింపకం లేదు.

ప్ర ఆడ : మా యింట్లో డబ్బు అయిపోయింది. మరి పొదుపు పత్రాలుకొనడం లేదు గిదుపు పత్రాలు కొనడం లేదు.

వెం : మాటకుమాట తెగులు.

ప్ర. ఆడ : ఆటకుఆట తెగులు [అని చెయ్యి విసరును]

వెంక: నీవు పొదుపుపత్రం కొనకపోతే పోయావుగాని నన్ను మాత్రం కొట్టబోకు. అప్పుడే అయిపోయిం దీ మీభాగ్యం. మా పొదుపుపత్రం కొనేదగ్గఱ కొచ్చేటప్పటికి అయిపోయిందా మీభాగ్యం?

ప్ర.ఆ: మా భాగ్యం అన్నది మాతోటే వుండదు. మాయింట్లోను వుండదు. ఒక్కదమ్మిడి మాఖజా నాలో నిలవుండదు.

వెంక: మరి నిలవుండకపోతే ఏమాతుందమ్మా అంత భాగ్యమూను?

ప్ర.ఆ: ఏమాతుందా ? నా వొంటిమీదుంటుంది! నా యింటిమీ దుంటుంది. నీకెందుకు ఆ ఆరా తీయడం.

వెంక: ఇంకా నయం? నీ తుంటిమీదుంటుంది అన్నావు కావు.

ప్ర.ఆ: అది అనగలను. నేను కట్టిన చీర నీవు కట్టగలవా? ఆఖరుకు నే తుడుచుకునే తుండుగుడ్డ నీకుందా? ఇవన్నీ కొనుక్కొంటూ, మా బ్రతుకుతెరువు పెంచుకోమా? మీ పొదుపు పత్రాలే కొనమా? ఏమో ఆయనగారు ఎలా చేసుకొస్తున్నారో ఈ సంసారము. ఇంట్లో ఏమీ లేదు. పొదుపూ లేదు. పోపూ లేదు. (అని తుంట్లు బాదుకొనును.)

వెంక: అంతచేటు బాదుకోనక్కరలేదమ్మా! ఇంతకూ మీ ఆయన్ను అడగమంటావు!

ప్ర.ఆ: ఏమో? ఎవర్నడుగుతావో గోదావరిలో దూకుతావో వెళ్ళు. [తెర]

## ఏడవరంగము: ప్రక్కయిల్లు

[ఆడపిల్ల, ఆడపిల్ల మొగుడు, వెంకమ్మ, రామేశం ఒకసంఘంగా చేరి సంచారము; మళ్ళీ పైపాట పాడతారు.]

ప్ర. మ: ఏమిటి మీరంతా మాచేత యీ పొదుపు పత్రాలు కొనిపించడానికి కాక సంఘముగా చేరారా?

రామే: మీచేత కొనిపించడ మేమిటి? అందరిచేత కొనిపిస్తాము. చూడండి ఒక నమోనా!

వెంక: అవునే అమ్మాయి! ఒక నమోనా కాగితం ఇయ్యి వారికి.

ఆడపిల్ల: నావద్దలేదు. ఆయనవద్ద వుండబోలు.

ఆడపిల్ల మొగుడు: అవును. నావద్దనే వున్నాయి. ఇదిగోనండీ! ఇది చిత్తగిస్తే అన్నీ తెలుస్తాయి.

ప్ర.మగ: వీళ్లిద్దరికీ ఎప్పుడు పెళ్లి అయింది?

ప్ర. ఆడ: అసలు పెళ్ళి అయిందో లేదో వాళ్ళిద్దరికీ, మీరంటున్నారుగాని

ప్ర. మగ: అందరూ మనమిద్దరం వుండగలమచ్చు వుండగలరుటే!

వెంక: అయితే మీయిద్దరూ ఇంకా పెళ్ళి కాకుండానే యిలా వున్నారన్నమాట.

రామే: ఏలా వుంటేనేం అదే పొదుపు. పెళ్లి అనీ పేటాకులు అనీ డబ్బు వ్యయం చేయడ మెందుకని వాళ్ళు అలా వున్నారులాగుంది.

వెంక: మనం మాత్రం ఏం ఖర్చుచేశాం? మనమ్మాయి పెళ్ళి దానంతటదే అయింది.

ప్ర. మగ: ఇదంతా పొదుపులకి లక్షణం. పెళ్ళిళ్ళకు వెచ్చించే ఖర్చుపెట్టి యీ పొదుపుపత్రాలు కొంటే ఎంతో మెఱుగు.

ఆడపిల్ల, ఆడపిల్ల మొగుడు: అందుకే మీదగ్గరి కొచ్చాం.

ప్ర. మగ: ఏమే ఏమంటావు?

ప్ర. ఆడ: నే నేమంటాను. మీయిష్టమంటానుగాని — అయినా నాకు వేవిళ్ళు అంటున్నా రంతాను. మగపిల్లవాడో ఆ పుట్టేది ఆడపిల్లో తెలుసుకుని మరీ త్యాగం చెయ్యండి.

ప్ర. మ: ఆఁ! అంతమటుకు ముదిరిందీ మనపాకం! ఇక పొదుపు చూపించే దేమిటి మనము? ఆపుట్టే వాళ్ళిద్దరైతే కవలపిల్లలు! అందు ఆడపిల్ల ఒక్కర్తె మగపిల్లవాడొకడు అవితే చెప్పక్కర్లేదు — ఇదిగో చూడండి! ఓ గుంపూ! ఓ పొదుపు గుంపూ! మా ఆడమనిషి నీళ్ళాడేదాకా మా గుమ్మం మీరు తొక్కవద్దు, తొక్కవద్దు. తొక్క తొక్కవద్దు.

[తెర]

# కళల జా    ప్రయో

శ్రీ అరవిందులు

సౌందర్యోపాసనా దృష్టిని తిరస్కరించి, కేవల ప్రయోజనము నపేక్షించుటే యాధునిక విధానముగ నీ మధ్య మనదేశమునఁ బరిగణింపఁబడెను. ఈ విధానము యూరపుఖండము తా ననుభవించిన రసానుభవ శిక్షణమును, నూతన సంస్కృతీ సంప్రదాయ సంపదను బురస్కరించుకొని పరిహరించినది. భారతదేశమున కీ యనుభవము క్రొత్తది కాదు. చాల ప్రాచీనకాలముననే యీ దేశమునందు రసానుభవానందము పరాకాష్ఠము నధిష్ఠించినది. కాని యీ మధ్య పరపాలనముచేఁ బ్రవేశపెట్టఁబడి, ధనసముపార్జనా లక్ష్యసంవలితమైన నిర్జీవ విద్యావిధానముచే నీ ప్రాచీనసంప్రదాయములకు బ్రహ్మాండమగు నాఘాత మేర్పడినది. సౌందర్యోపాసనమునకు మారుగా నీ విద్యావిధానమునందు విపరీతమగు నూహాశక్తి ప్రాబల్యము వహించినది. భావోద్రేకము పెల్లుబికినది. సుకుమారతత్త్వ చింతనము మాత్రమే తలయెత్తినది. అయినను నీ సౌందర్యదృష్టి జాతి స్వభావమున నిగూఢమై యున్నదే కాని, రూపఱలేదు. అది భారతీయుల సుకృతి విశేషము.

మన ప్రాచీనులు, సంగీతమునకు, శిల్పమునకు, కవిత్వమునకును నెంత విలువ నిచ్చిరో యీ కాలము వారి కర్థముకూడ కాదేమో!! అందులకు కారణము ఈ కాలమువారికి జీవితపరమార్థమవగతము కాలేదు. కేవల భౌతిక సుఖానుభవమే వారికి సర్వోత్కృష్టముగ గోచరించును. భౌతికవిభూతి, మానవాభివృద్ధికి ప్రాతిపదికయే. ఏ జాతికైన తొలుదొల్త కడుపునిండ తిండి, తలదాచుకొనుటకు నీడ, కట్టుకొనుటకు వస్త్రము లత్యంతావసరములే. ఇవి యేర్పడిన నాఁడే జాతికొక య    మేర్పడును. ఈ సమస్యను మన ప్రాచీన సామ్యవాద మానవసంఘములు పరిష్కరించినవి. మానవజాతిలో ముప్పాతిక మువ్వీసము ఏతత్సమస్యా పరిష్కారమునకే పాటుబడుచున్నది. ఏ కొద్దిమంది బుద్ధిమంతులో దీని నతిక్రమించి యున్నతి నార్జించుటకు తహతహ లాడుదురు. అత్యవసరమగు నీ సహజవాంఛలు, సర్వసాధారణమైనవి, పాశవికమైనవి, విపరీతమైనవి, విచక్షణా రహితమైనవి. ఇవి మనకును, పశుపక్ష్యాదులకును సమానమైనవి. దీని నే మన వేదాంతము 'ప్రాణమయకోశము'ని వివరించినది. ఇట్టి యత్యవసరవాంఛల నాధారించుకొనియే, ధనపిపాస, భోగతృష్ణ, కామినీ కాంక్ష లుద్భవించినవి. మానవేతరజాతులు కుక్షింభరత్వమునకే పరిమితమగుచుండ మానవజాతి, నాగరకతోపేతమై, సుస్థిరమగు నార్థిక వ్యవస్థను సాధించి, వ్యక్తిగతమగు నాస్తిపాస్తుల నార్జించినది. తన్మూలమున, సాంఘికమగు నసమానత్వము, నన్యాయ్యము, దౌర్జన్యము, వంచన, పరస్పర విద్వేషము, వ్యక్తి సంబంధము కుటుంబసంబంధము వర్గసంబంధమునగు స్వార్థపరాయణత్వము చెలరేగి యివి యన్నియు మానవాభివృద్ధి కనివార్య మనిపించినవి. జగన్మాత సదసత్తులమూలమున జగత్క్రియను జరిపించును. క్షణికమగు నసత్తుమూలమున నామె జగత్కళ్యాణమును సమకూర్చును. పాశవిక మనః ప్రవృత్తు లీ రీతిగా కాలక్రమమున జగత్తు నల్లోలకల్లోలిత మొనర్చినవి. రాగద్వేషములు, కామక్రోధములు మున్నగు ప్రాణసంబంధమగు నుద్రేకములు సామాజికముగా కాక, వైయక్తికముగ తృప్తిని సాధించుచుండెను. ఇట్టి యుద్రేక వాంఛలను దీర్చుటకే యాధునిక జాతులు, సంఘములు, ప్రపంచమున మనుచున్నవి. అందులకే వర్తక వ్యాపారములు దినదినాభివృద్ధినందుచున్నవి. భౌతిక శాస్త్రములుకూడ మానవజాతికి సౌఖ్యమును, భోగసంపదను సమకూర్చుటకే పరిశోధింపఁబడు

అనువాదము : శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము

చున్నవి. ఇట్టి వాంఛా పరిసమాప్తికే వ్యక్తిగత సంపదలు, బానిస విధానము నమలులోనికి వచ్చినవి. ఇట్టి భౌతికేచ్ఛాసంతుష్టియే జాతులకు జాతులకు సన్నిహితత్త్వము నేర్పఱుచుచున్నవి. ఈ యిచ్ఛా పరిసమాప్తి విశ్వతోముఖముగ సిద్ధింపనిచో ప్రపంచ రాజ్యములందు విప్లవములు చెలరేగును.

బానిస విధానము మధ్యయుగములందు పరిహరింపఁబడినది. ఏలయన మానవ హృదయశక్తి ప్రవర్ధమానమైనది. నైతిక, మత, వేదాంత ప్రభావము వ్యక్తిని జాతిని అతిక్రమించి సర్వమానవ సృష్టి నలముకొన్నది. అందుచే బానిస విధానస్థానమునందు కూలీ పద్ధతి వచ్చినది. తన్మూలమున మానవు లైచ్ఛికముగా బానిసతనమును వలచి, యుదరపోషణము గావించుకొనుచుండిరి. ఈ విధానము కూడా క్రమముగా నీరసింపఁజొచ్చినది. సర్వమానవజాతియు నేఁడు ఉదరపోషణముతోఁ దృప్తిఁజెందక, అనఁగా అన్నమయకోశము నతిక్రమించి ప్రాణమయ, మనోమయకోశములందు యథేచ్ఛగా సంచరింపవలయునని యుత్కంఠించుచున్నది. ఉత్తమవర్గమునకుఁ జెందిన కతిపయ మానవులు నిత్యజీవితములం దనుభవించు భోగభాగ్యములను, తాము ననుభవింపవలయునని, సర్వమానవులును నేఁడాకాంక్షించుచున్నారు. ఇవియే కాదు; జాతీయ సౌభాగ్యమును, ప్రభుత్వమును, యుద్ధనీతులను రాజలాంఛనములను, దాముకూడ పంచుకొనవలయునని సర్వమానవులు పట్టుపట్టినారు. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, స్వాతంత్ర్యము-సమానత్వమను రెండింటికి సామరస్యము గూర్చి సాధ్యమైనంతవఱకు ప్రజల కందఱకు నందుబాటునకుఁ దీసికొనిరావలయును అను నుద్యమము సర్వత్ర సాగినది. ఇట్టి యాశయమే రక్తపాత సహితమై ఫ్రెంచివిప్లవముగా రూపొందినది. ఈ ప్రజాస్వామ్యమును, ఈ సామ్యవాదమును, ఈయరాజకమును, నెదుర్కొనుటకు ధనికోన్నతవర్గము సర్వశక్తుల ప్రయత్నించినది. తాత్కాలికముగ కొంతయవరోధము కలిగినది. కాని కాలప్రవాహము నరికట్టనేరి సాధ్యము? భూతకాలముకన్న భవిష్యత్కాలము శక్తిమంతమైనది. పరిణామపరిభ్రమణ మప్రతిహతముగ సాగును. దాని సంచాలనము నడ్డగించునవన్నియు నందే హతమై తీరును. దానితోఁ బోరాడుటన్న భగవంతుని సంకల్పము నెదుర్కొనుటయే; భగవచ్ఛాసనమును దిరస్కరించుటే. కారణజగత్తులో నిహతఃపూర్వమే యిట్టి దుష్టశక్తులు పరాజయమందినవి. "నిహతాః పూర్వమేవ" బాహ్యజగత్తున వాని కార్యరూపమును మాత్రమే సందర్శింతుము.

సర్వసాధారణమగు మానవకోటి యిట్టి భౌతిక వాంఛల నతిక్రమింపలేదు. దాని భావనకూడ నీ భౌతిక స్థాయి నధిగమించదు. హిందూమతత్త్వ మిట్టి యావరణనే 'మనోమయ కోశము'ని పేర్కొన్నది. సర్వమానవ సామాన్యము, కతిపయ జీవజాలము నీ కోశమునుండి తమ సమస్త వ్యవహారములను నడపించుకొనును. ఇట్టి మనోమయకోశము నతిక్రమించి మానవునకు బుద్ధి లేక భావన యనునది కలదు. ఇట్టి బుద్ధిని పరిశుద్ధమొనర్చుకొన్నచో అది మనోదేహములనతికరించి స్వతంత్రముగ వర్తించును. ఉద్రేకములన్నియు శాంతి వహించును. కొలఁదిమంది మనుష్యులుమాత్రమే యీ బుద్ధియను నింద్రియము నభివృద్ధిఁ గావించుకొనఁగలరు. అందును కొలఁదిమందియే దానిని పరిశుద్ధ మొనర్చుకొనగలసమర్థత కల్గి యుందురు. ఘనమైన యోజనాశక్తిగలవారు, కొన్ని గంటల పరిమితివఱకును, భౌతికావరణమును కొంతవఱకు నతిక్రమించి, యీ బుద్ధీంద్రియమును స్వతంత్రముగ వినియోగించుకొనఁగలరు. కాని యీ యల్పకాలము నందును వారిభావన యవిచ్ఛిన్నముగ సాగునని తలంపలేము. దైనందిన జీవిత నీరసభావము లీ పరిశుద్ధ భావప్రవంతి నడ్డగించుచునే యుండును. అయినను పరిణతులైన యోగులు కొందఱీ విశుద్ధబుద్ధితో సదా రమింపఁగలరు. ఈ విశుద్ధబుద్ధి చిత్తశుద్ధివలన సంక్రమించును. జాంతవికము, శక్తిమంతము, నుద్రేకపూరితము నగు ప్రాణమువలన నేర్పడిన చిత్తము సదా కల్లోలితమై యుండును. దానిని ప్రశాంతమొనర్చిన చిత్తశుద్ధి కల్గును. సామాన్యమానవులబుద్ధి, భౌతిక వాసనల నతిక్రమింపని మనస్సుతో నిండియుండును. మానవజాతిలో నధికసంఖ్యాకులు యోజింప సమర్థులు కారు. వారికి కొన్ని యాలోచనలుమాత్ర ముండును. కొందఱు మాత్రమే యవ్యవస్థితముగఁ జింతింపఁగలరు. వీరు తమ వాంఛలను, యభిమానములను, కామోద్రేకములను, పూర్వపరిచయములను, రాగద్వేషములను జిందరవందరగ కలిపి, తమ భావనను కలగాపులగ మొనర్తురు. అతిస్వల్పసంఖ్యాకులైన భావుకులు మాత్రమే యచంచలమగు నాంతరదృష్టితో తమ ధీశక్తిని ప్రదర్శింతురు. వీరే నిజమైన నిరంకుశులు. వీరి నిరంకుశత్వము భౌతిక సంబంధమైనది కాదు. ఆభిజాత్యమునకు సంబంధించినది కాదు. ధనమదాంధతచే

సంక్రమించినది కాదు. తీవ్రోద్రేకబలమువలనగాని, పదవీవ్యామోహముచేతగాని యేర్పడలేదు. ఇది కేవలము విజ్ఞానసంబంధమగు నిరంకుశత్వము. ఏకాలము నందైన నిట్టి నిరంకుశవాదు లుద్బుద్ధమౌదురు. మానవ సమాజమున నీ యసమానత్వ మఖండమగు ప్రాముఖ్యమును బడయకతప్పదు.

బుద్ధి నతిక్రమించియు కొన్ని యితరశక్తులు కలవు. వాని నన్నింటిని కలిపి మనము స్థూలముగ నాధ్యాత్మికత్వమని వ్యవహరింతుము. ఇట్టి శక్తులు గలవారు కోటి కొక్కరు గానవత్తురు. బుద్ధిమంతులు గాఁ బరిగణింపఁబడువారిలోఁగూడ నీ శక్తులు సమగ్రముగ వికసింపవు. మేధాకుశలతను, భావనాపటుత్వమును, ఉద్రేక తీవ్రతనే యనేకు లాధ్యాత్మిక సంపదయని భ్రమింతురు. ఆధ్యాత్మికత తదతీతమైనది. అయ్యును వీనినన్నింటి నంతర్గర్భితము గావించుకొన్నది. ఇది సర్వసృష్టికిని కారణభూతమైనది. దానిని సముపార్జించుటయే మానవచరమలక్ష్యము. ఇట్టియాధ్యాత్మికార్ణవ తరంగములు కతిపయ మానవహృదయక్షేత్రముల యందనేక పర్యాయములు తరంగితమైనవి. అట్లగుటలో గల లక్ష్యము, తక్కిన మానవజాతికి చైతన్యమును ప్రసాదించి, శాంతచిత్తులను గావించుటయే!! దీనినే మతమని సాధారణముగ వ్యవహరింతుము. ఇట్టి స్థితికి పూర్వము బుద్ధిసంపదయే మానవుఁడు సాధింపవలసిన దానిలో సర్వోత్కృష్టమైనది. ఇట్టి బుద్ధిబలము చేతనే ప్రాచీనమానవసమాజము భేదించినది. ఇట్టి బుద్ధికి ద్విముఖములు గలవు. ఒకటి హేతుపూర్వక బుద్ధి లేక నిర్ణాయకబుద్ధి. రెండవది భావనాత్మక బుద్ధి. ఈ ద్విముఖబుద్ధివికాసముచేతనే సమగ్రయోజన సిద్ధించును. శాస్త్ర, వేదాంత, విమర్శనాదులచేతను, కవిత్వాది కళాదర్శములచేతను, ప్రాచీన మానవ సమాజము తలమున్కలైనది. అట్టి సమాజమున కిప్పుడు పతనము సంభవించినది. నూతన మానవ వ్యవస్థకు శంకుస్థాపనము జరుగుచున్నది. శాస్త్రాదులు మానవులకు సౌఖ్యసౌకర్యములను గల్పించుటకై వినియుక్తమగుచున్నవి. సర్వప్రపంచమానవులు నిట్టి భోగతృష్ణాపరాయణులై యఱ్ఱులు సాచుచున్నారు. సూక్ష్మసుకుమారగభీరములగు కళావిషయములుకూడ సర్వమానవ మానసవీథులలో నస్పష్టముగను, నగమ్యముగను నేడు పరిభ్రమించుచున్నవి.

## 2

మానవబుద్ధి ద్వివిధములని పేర్కొంటిని. ఇందొక్కొక్కటి యొక్కొక్క విధమగు కార్యకలాపమును నెఱవేర్చును. ఇందు మొదటి బుద్ధి సృజనాత్మకమైనది. భావనాశక్తి గలది. ఏకాగ్రత కలది. సత్యసందర్శనమున కిది కేంద్రస్థానము. ఇక రెండవబుద్ధి విమర్శన, వివేచన, గవేషణ, హేతుపరిశీలన మను గుణములు కలది. తొలి బుద్ధిచే సందర్శితమైన సత్యమును, మలి బుద్ధిచే బరామర్శించి, సాకల్యముగ గ్రహింపనగును. నేటి విద్యావిధానమునందీ మలిబుద్ధికి సంబంధించిన కార్యములు శాస్త్రపఠనము మూలమునను, నింద్రియశిక్షణము మూలమునను సిద్ధింపఁజేయుటకుఁ బ్రయత్నింపఁ బడుచున్నది. తొలి బుద్ధికి సంబంధించిన కార్యములలో నొక్క యేకాగ్రతకు మాత్రము కొంత ప్రోత్సాహము కలదు. ఈ కారణముచే కేవల శాస్త్రీయ విద్య, బుద్ధిని నిశితమొనర్చి, కొంత పరిమితిలోఁ బరిశుద్ధము గావించును గాని, యది సంకుచితము, కఠినము మాత్రమే కాక, ప్రమాదభూయిష్ఠము కూడ. సృజనాత్మక బుద్ధిని సుశిక్షితమొనర్చుకొనని వ్యక్తి, యొకేయొక స్థానమునుండి యభివృద్ధిగాంచునే గాని సర్వతోముఖమానవ సంస్కృతీ వికాసము ననుభవింపఁజాలఁడు. అంతేకాదు. శాస్త్ర దృష్టినికూడ విస్తృత మొనర్చుకొనలేడు. టెనిసన్ కవి తన దృష్టి ప్రకృతి పరిశీలనమునందు సుశిక్షితమైనదని, కాని తాను తత్త్వతః అల్పుఁడనని యొకచో పేర్కొనెను. ఈ వర్ణన మాతనిపట సమంజసము. సుశిక్షితమైన తత్త్వము లేనిదే, సుశిక్షితమైన దృష్టివలన మానవున కుత్కృష్టత సిద్ధింపదు. తత్త్వమథనమే విస్తృత విద్యావిధానచరమలక్ష్యము. ఇట్టి తత్త్వ మథనమున కత్యంతోపయోగకరములైనవి—భాష, వాఙ్మయము, సంగీత, చిత్రలేఖన శిల్పాదులైన కళలు, వేదాంతము, మతము, చరిత్ర, మున్నగునవి. మానవ స్వభావస్వరూపములను కవీశ్వరుల కావ్యదర్పణములందు సందర్శించవలయును. ప్రకృతిని మానవుని తులనాత్మకముగ సమీక్షింపవలయును. ఇది యంతయు సృజనాత్మక బుద్ధికిఁ జెందిన కార్యకలాపమే. దీని ప్రాముఖ్యమును గుర్తించినను, కవిత్వాది లలితకళలు సామాన్య మానవున కవసరము లేనివనియు, నిత్యజీవితమున నిరుపయోగకరము లనియు, ధనవంతులకు, భోగపరాయణులకు కాలక్షేపమునకు మాత్రమే వినియోగపడుననియు తలంచుట సర్వసాధారణమైనది. ఇట్లు భావించుటకు హేతువు భోగలాలసులైన యే కొలఁది

మందిరియో, ప్రపంచాధిపత్యమును బడసి, సర్వకళలను
తమ హస్తగత మొనర్చుకొని దుర్వినియోగ పఱచిరి.
ఇది మానవాభ్యుదయ మధ్యకాలమున జరిగిన విష
యము. కాని రసానందానుభవ మేకాలఁది మందియో,
గుత్తకుఁ గొన్నది కాదు. ఇది మానవజాతికి స్వత
స్సిద్ధము. నిత్యజీవితానుభవములోనిది. సౌందర్యో
పాసనము మానవున కుగ్గుపాలతో నలవడిన విద్య.
సహజవాంఛాపరిసమాప్తియందు, నరనారీ ప్రేమకలా
పమునందు, భోజనభాజనములందు, వస్తువాహన
వినియోగమునందు, నీ సౌందర్యార్చనమే
మానవుని పశువునుండి వేఱుపఱచి, యున్నతిని
గల్గించినది, నాగరకుని గావించినది, ఉద్రేకముల కొక
ప్రశాంతస్థితిని చేకూర్చినది, భావనాశక్తిని వృద్ధిపఱచి,
మేధావిని గావించినది. ఇట్టి యౌన్నత్యమును ప్రసా
దించిన యీ సాధనమును మానవుఁడు విస్మరించినచో,
పతితుఁడగును. కేవల మేధాసమృద్ధినే సముపార్జించి
శాస్త్రీయపరిజ్ఞానమునే త్రవ్వి తలకెత్తించుకొన్న
వానికి, సర్వప్రపంచము నూడిగము చేసిన చేయ
వచ్చును. కాని హృదయశక్తి, తత్త్వజ్ఞానము వృద్ధిఁ
జెందనిచో మానవుఁ డసురాధముఁడే యగును. పూర్వ
కాలమున, 'అట్లాంటిస్' నాగరకతా స్వభావముకూడ
నిట్టి యాసుర సంబంధమైనదే. ఈ నాగరకతా వైభవము
తోపాటు దౌష్ట్యముకూడ మిన్నుముట్టి, యత్యుత్కృ
టమై భరింప నశక్యమైనపుడు, మూలమట్టముగా సాగర
గర్భమున నది లీనమైనది. భారతదేశ పురాణగాథల
ననుసరించి, యసురుల వైభవము నిట్టిదే. దానికికూడ
నట్టి దుర్గతియే పట్టుటకు కారణము విపరీతమేధా విజృం
భణమే.

కళాప్రయోజనములలో ప్రథమమైనది రసా
నందము. ద్వితీయము మేధోద్దీపకము. తృతీయ మత్యు
త్తమ మగు నాధ్యాత్మిక వికాసము. రసానంద మప్రధాన
మని దీని తాత్పర్యము కాదు, తులనాత్మకముగ ప్రయో
జనములను పరీక్షించినపుడది సామాన్యమనక తప్పదు.
అయినను, రసానందానుభవము కల్గినపుడే మానవునకు
కళాసంబంధమైన ఉత్తరోత్తరమగు నుత్కృష్ట ప్రయో
జనములు సిద్ధించును. విషాదాంత గాథలయందీ యను
భవ తీవ్రత యధికము. ఇది మనస్సును క్షాళన మొన
ర్చును. అందుచేతనే యీ విషాదాంతగాథలకు "అరి
స్టాటిల్" అధిక ప్రాముఖ్య మిచ్చెను.

వీని ప్రభావమును "కెథారిసిస్" అను ప్రాచీన
గ్రీకు తంత్రములయందలి పవిత్రపదముచే నీతఁడు వర్ణిం
చెను. దీనిని మన ప్రాచ్యులు "చిత్తశుద్ధి" యని
పేర్కొనిరి, సంకల్ప, వికల్పాత్మకమైన దీ చిత్తము.
బహు జన్మవాసనా సంయుతమైనది. బహుముఖీనము
లగు భావానుభవ విలసితమైనది, కవిత్వమందలి భావ
విశిష్టతచే చిత్త వికారోద్రేకములు శాంతించునని
యరిస్టాటిల్ అభిప్రాయము. ఇది కేవల కవిత్వమునకే
కాక లలిత కళల కన్నింటికిని విశాలముగ నన్వయించు
కొననగును. కళా సంబంధమగు సౌందర్యము చిత్త
వికారములను శాంతింపఁజేయును. సౌందర్యము,
సత్యము నభిన్నమైనవి. మన వేదాంతము ననుసరించి
యీ సమస్త ప్రపంచ మానందములో నావిర్భవించి,
యానందమునందే జీవించి, యానందములోనే పర్యవ
సన్నమగుచున్నది. ఆనంద స్వరూపమును వర్ణించు
త్రిపదము-ప్రేమానందసౌందర్యములు, అఖిల ప్రపం
చము—అనగా మానవ మానవేతర ప్రకృతి, జీవితము
నందు దివ్య సౌందర్యమును సమీక్షించుచు, నేవంవిం
దృశ్యమానాంశములను ప్రేమించుచు, నిష్కళంకమగు
నానందము ననుభవించుటే జీవిత తరణోపాయము,
సమస్త మానవకోటియు సమష్టిగా భగవానుని సమీపిం
చుటకు సులభ సోపానమీ సౌందర్యోపాసనమే.
అవిద్యనుండి విద్యకధిగమించు మార్గమిదే. అవిద్యయ
నఁగా మాయా సంవలితమగు ప్రపంచము; ఇది భగవం
తుని కళా సామ్రాజ్యము. విద్యయనఁగా నిర్వికార,
నిరంజనమగు పరిశుద్ధ చైతన్యశక్తి. "అవిద్యయా మృత్యుం
తీర్త్వా, విద్యయా అమృత మశ్నుతే" యనిక దా
యుపనిషద్వాణీ ప్రబోధము.

ఆనందమునుగూర్చి ప్రస్తావించుచుంటిమి. ఈ
యానందము నిర్మలముగా నుండవలయును. స్వకీయో
ద్రేకములు, బాధావమానములు దీనిని కళంకిత మొనర్చ
రాదు. సత్యాసత్యభావన, సౌందర్యాసౌందర్య
జ్ఞానము మన యాలోచనను, ఇంద్రియములను బాధిం
చును. తద్బాధానివారణమునకై యఖండ రససాక్షా
త్కారమును గావించుకొనవలయును. తన్మూలమున
మనము మన చరమలక్ష్యమును సులభముగా నందుకొన
గలము. ఇట్టి యఖండరస సాక్షాత్కార మొక్క
మారుగా లభింపదు. ఖండసౌందర్య సమీక్ష నలవఱచు
కొని, క్రమక్రమముగా నఖండ సౌందర్య సందర్శనా

సామర్థ్యమును సంపాదింపవలయును. ఖండము నఖండముచేతను, క్షుద్రము నక్షుద్రముచేతను, అధమము నుత్తమముచేతను బూరించుకొనుచు దీనిని సాధింపవలయును.

మానవత్వాభివృద్ధియం దొకానొక దశలో ఈ రసపరిజ్ఞానమున కనంతమగు విలువగలదు. ఇది మానవ ప్రవర్తనను సరిదిద్దును. అనాగరకమగు వాంఛలయందు, కామోద్రేకములయందు హేయభావమును గల్గించును. విపరీతచర్యలను పరిమిత మొనర్చును. అనుభవమును, నడతను నాజూకు పఱచును. విజ్ఞానాత్మకమగు యూరోపియన్ సంఘ మిట్టి స్థాయి నందుకొన్నది. కాన్ఫ్యూషియన్ మతవిధానమునం దిట్టి యాలంకారికజీవితము గోచరించును. హైందవ మతమునందలి పవిత్రాచార ప్రవర్తనాపద్ధతికూడ నిట్టిదియే, కాని రాను రాను నీయాచార వ్యవహారములు బాహ్యాడంబరములుగా మారినవి; నిర్జీవములైనవి. ఇవి యుత్తమస్థితికి నూతగా కాక, యధమస్థితికిఁగూడ కారణభూతమగుచున్నవి. రసానంద పరిప్లావితమైనపుడు పాశవిక సహజాతములుకూడ సుశిక్షితములై యుత్తమస్థితి కుపయుక్తమగును. దీనివలన కల్గు నష్టమేమన నిది యాధ్యాత్మికానుభూతి కొక్కొక్కసమయమున నవరోధము కలిగించును. సహజసౌందర్యాసక్తి క్రమక్రమముగ బాహ్యరూపవ్యసనముగ పరిణమించును. అది యొక నిర్జీవమగు స్వామ్యమగును. అందుచే నీవిధానమునకు భవిష్యత్కాలమున, విశేష ప్రాముఖ్యముండదు. దీని యవధులను గుర్తించి, ఉన్నత సత్యార్హతను, దాని యాధికారిక వాంఛలను గమనించి, ఋజుత్వమునకును, భావానుభవ స్వాతంత్ర్యమునకుఁ దగు ప్రాముఖ్యము నొసగవలయును. మానవుఁడు భూతకాలమున తాను సాధించిన యభివృద్ధినే యంటిపెట్టుకొని సంచరించుట కలవాటుపడును. అట్టి యంధానుకరణమునం దాతఁడు తన లక్ష్యమునుగూడ విస్మరించును. ఇది చాల ప్రమాదకరము. వ్యర్థనియమపాశములను ఛేదింపవలయును. ఏతత్కార్యమునకై తిరిగి సౌందర్యోపాసనమే శరణ్యము. ఇది యున్నతస్థాయిలో జరుగవలయును. అప్పుడే, దుష్టఫలితములకు దారితీసిన క్షుద్రసౌందర్యార్చనము సక్రమ ఫలితముల నొసంగును. జీవితమే యొక కళ. దాని సౌందర్యగభీరతలు ప్రతి వ్యక్తికి సుబోధకము కావలయును. ఇట్టి జీవితకళ, తన్ను సదా సంస్కరించెడి ప్రేమ సద్భావములకు సపర్యలు సలుపవలయును.

## 3

బాహ్యరూపాభిమానము మూలమునను, నియమయుత భావప్రకటనము వలనను, సక్రమ క్రియావిధానముచేతను మానవుఁడు తన ప్రవర్తనను బవిత్ర మొనర్చుకొనును. కళాదృష్టివలన మానవాళికిఁ గల్గు ననేక ప్రయోజనములలో నిది యత్యంత సామాన్యమైనది. అయినను నీ ప్రయోజన మత్యంత విస్తృతమైనది. ప్రముఖము, ననివార్యము నైనదికూడ. మానవ నాగరకతాభివృద్ధి కిది ప్రాతిపదిక యననగును. ఇంతకన్న కళ చేకూర్పఁగల యధికతరప్రయోజనము— నీతినియమ పాలనమునకుఁ దగుశక్తిని ప్రసాదించుట. నిత్యజీవితములో మనకుఁగల నైతికపరిజ్ఞానము సౌందర్యదృష్టివలన సిద్ధించినదేయనియు; మన ప్రవర్తనలోఁ గల యవినీతి యేతద్దృష్టిరాహిత్యముచే నేర్పడినదన్న విషయము సాధారణముగా మనము గుర్తింపఁజాలము. కాని కొన్ని క్షుద్రబాహ్యసంఘటనలనుబట్టి యీ విషయమప్పుడప్పుడు మనకుఁ గనువిప్పు కల్గించును. అసహ్యవేదనాకరములగు విపరీత రక్తపాతములయందు, దుర్భర దురంత హింసాకృత్యములయందు, నపరిమిత భోగ లంపటత్వమునందు, మనకుఁ గల్గు హేయభావమునకుఁ గల కారణ మీయకలంక సౌందర్యదృష్టియే. గ్రీకుల కిట్టి సౌందర్యదృష్టి కలదు. అది నిత్య చైతన్యోల్లసితమైనది. ఉదాత్త నైతికస్థాయి నందుకొనలేని యితర దేశీయులందీ దృష్టి కేవల రసానందానుభవమునందే పరిమితమైనది. మానవుని లోఁగల ప్రబల సహజాతములలో దయ, జుగుప్స మున్నగునవి ముఖ్యమైనవి. జుగుప్సకు, ఘృణతకు భేదముకలదు. ఘృణతయనఁగా స్వార్థ సంకుచితత్వమును, హింసాస్వభావమును నేవగించుట. ఇట్టి యేవగింపు కల్గియుండుటనఁగా స్వభావమునందు దయాదాక్షిణ్యములు కల్గియుండుటని యర్థము. అందుచేతనే సంస్కృతమున నిర్ఘృణత యను పదమునకు కనికరము లేకుండుట యనునర్థము రూఢమైనది. దీనినిబట్టియే ఘృణపదము కృపకు పర్యాయమైనది.

అత్యుత్తమమగు నీతి రసార్ద్రమైనది. సౌందర్యోపాసనమే యీ నీతికి బలము. అట్లయినప్పుడే నీతిపథ

మునం దెదురువచ్చెడి దుష్టశక్తుల దౌర్జన్యము నశింపఁ గలదు. గ్రీకుల నైతికబల మిట్టిది. ఇది రసానందమందు పరిమితమైనది. గ్రీకుల నైతికభావన నాల్గు సోపానములుగా నున్నది. మొదటిది బాహ్యాలంకారము, రెండవది యౌచిత్యమును బురస్కరించుకొని సామాన్య ప్రవర్తనమందు కానవగు శాస్త్రీయాశాస్త్రీయాచారములు, మూడవది శాస్త్ర సమ్మతోచిత న్యాయ్యము. ఇది సౌందర్యస్థాయికి మిక్కిలి దోహదమును కూర్చును. ఇఁక నాల్గవ సోపానము మహోత్కృష్ట సౌందర్యస్థితి. ఇదే చరమనైతికస్థాయి. 'అరిస్టాటిల్' నైతిక విధానమునందు గోచరించు విలక్షణత యిట్టిదే. ఆతఁడు మనవలె పాపపుణ్యములను బరిగణించి, నీతిని నిర్ణయింపఁడు. అతని దృష్టి కేవలము సౌందర్య ప్రామాణ్యమునందు బద్ధమైనది. అమితము—అతిమితము పరిమితము ననుమానములతో నాఁతఁడు నీతిని స్థిరీకరించును, కాని సౌందర్యస్థాయి ననుసరించి, గ్రీకుల జీవిత దృక్పథము సమగ్రమైనది కాదు. ఏలయన వీరి సౌందర్య పరిభావన విశాలభావ సముజ్జ్వలము కాదు. వారి కళాదృష్టి బాహిరమైనదే. అందుల కవసరమైన ప్రేమోద్విగ్నత వారిలోఁ గొఱఁతవడినది. భారతీయుల కట్లుకాదు. బృందావన శ్రీకృష్ణుఁడు శ్యామసుందరుఁడే కాదు; జగదేక సుందరుఁడగు భగవానుఁడుకూడ. ఇతఁడు నిరుపమ ప్రేమ స్వరూపుఁడు. సంపూర్ణమగు ప్రేమలేనిదే సంపూర్ణ సౌందర్యము మృగ్యము. సంపూర్ణ సౌందర్యము లేనిదే సమగ్రానందలబ్ధియుండదు. సౌందర్యదృష్టిప్రవర్తనకు పుష్టినొసంగినను, నది ప్రవర్తనాపరిధిని గూడ నతిక్రమింప వలయును. అప్పుడే మానవోన్నతి సాధ్యమగును. అట్లతిక్రమింపఁజాలక పోవుటచేతనే గ్రీకుల సౌందర్యార్చన విచ్ఛిన్నమైనది. వారికే కాదు, సర్వ మానవులకును నట్టి పరిస్థితియందు సౌందర్యముపై నేవగింపు, తిరస్కృతి కల్గును. సత్యమును కేవల సౌందర్య పాశములచే బంధింపజాలము. అట్టి ప్రయత్నమునకు పూనుకొనిన నది బాహ్య రూపమునందాబద్ధమై నిర్జీవమగును. అప్పుడే దానికి వ్యతిరేకత తలనెత్తును. అట్టి విరక్తినుండి సంయమన జీవితవిధాన మారంభించును. యూరపుఖండమునందలి నీతిశాస్త్రమంతయు ద్వంద్వభావ వైరుధ్యమునం దభివృద్ధి నందినది. ఇందొకటి గ్రీకుల సౌందర్యభావన. రెండవది క్రైస్తవ సంయమన భావన. ఈ క్రైస్తవ భావన మొక రీతిగా కృతకనియమపాలనముచేతను, మఱియొక రీతిగా ప్రేమవిరహిత నిష్ఠుర సంయమన స్వభావముచేతను భ్రష్టమైనది. తొలుతనీ క్రైస్తవ భావన సద్గుణపాలనము నాధారించుకొని, సౌందర్యదృష్టిని దోషదూషితము గావించినది. సత్య మెన్నటికిని సౌందర్యమునకు బానిస కానవసరము లేదు. అయినను సత్యము సుందరముగను, నానందదాయకముగను నుండవలయును. సౌందర్యరహితమైన సత్యమునకు జగత్తున విశేషాదరము లభింపదు. ఆ కొఱత కొఱతయే. సద్గుణములను సద్గుణములకొఱకే యుపాసించిన ప్రయోజనము శూన్యము. వాని యాచరణమునం దానందలబ్ధి యుండవలయును. అది సౌందర్యమువలన గాని సమకూడదు, సౌందర్య తిరస్కృత సత్యోపాసన మభివృద్ధి కారకము కాదని వేరుగా జెప్ప పని లేదు. కావున సౌందర్య దృష్టి నధోగతినుండి యూర్ధ్వగతికి; నైచ్యమునుండి యుదాత్తతకు; ఖండమునుండి యఖండమునకు మఱల్చుటకై మానవాళి సదా కృషి సల్పుచుండ వలయును.

రసానందకౌశలమువలన కల్గెడి తృతీయ ప్రయోజనము భావోద్రేకములను పూత మొనర్చుట. ఇది ప్రథమ, ద్వితీయ ప్రయోజనముల కన్న నధికమైనది. అరిస్టాటిల్ పండితుఁడు కూడ నీ ప్రయోజనమునే విశేషముగా ప్రస్తుతించెను. భావోద్రేకముల మూలమున సౌఖ్యానుభూతినందుటయే జీవితకవితాగానము, ప్రవర్తనమును, క్రియాశక్తిని, లయాత్మకముగ దీర్చిదిద్దునదే జీవితకళ. రసానందానుభవముచే నుద్రేకము లెట్లు ప్రశాంతి వహించి, పవిత్రములౌనో కొంత విచారించితిమి. ఇంతకన్నగూడ నీయనుభవమునకు విశేష శక్తి కలదు. అష్టరసధునులు ప్రవహించు దివ్య కేదారము మానవజీవితము. పశువులయందును, పశుతుల్యులగు మానవులయందును నీ రసవాహిను లున్నను, నివి వ్యర్థముగా నింకిపోవును. లేదా యింద్రియ సంతృప్తికి మాత్రమే యివి పనిచేయును. కొందఱిలో ఈరసములు భావోద్రిక్త సంయుక్త నిశిత జీవితానుభవములకుఁ గారణభూతములై హృదయ సంతృప్తి నొసంగును. కాని యల్పసంఖ్యాకులైన కొందఱు పురుషోత్తములు మాత్రమే యీ రసానందానుభవముచే నూర్ధ్వగతినంది, మేధోద్దీపనము మూలమున, సత్య శివసుందర మూర్తియు; సర్వవ్యాపకుడు,

# కళల జాతీయప్రయోజనము

సర్వాతీతుఁడు సృష్టిస్థితిలయ కారణభూతుఁడు నగు నా యఖిలరసామృతమూర్తి యఖండ రసామృత భాండ మందలి రసఘుళికల నాస్వాదింప శక్తి సముపార్జింతురు. మానవ హృదయము తనకుతాను పనిచేయ గలిగిన, నది జీవితకవితామాధుర్యము ననుభవించును. కరుణాద్భుత భావ విశిష్టతలను జవిమూఁచును. ప్రేమ సౌందర్యాను భవములను, ప్రశాంతి సౌమనస్యములను, శాద్రభయానక వీరములను—జీవితమునందు, ప్రకృతి యందును గూడ యథేచ్ఛగా బడయఁగలదు. అయినను నిది యుత్తమోత్తమము ననుభూతి కాదు. కాని పశుత్వముకన్న వేయిరెట్లు విశిష్టమైనది; శక్తిమంతమైనది. ఇది రసబంధురమగు బాహ్యాభివృద్ధి. అనేకులిట్టి యభ్యుదయము నే యాశింతురు. దానికొరకే శ్రమింతురు. ఈ యభివృద్ధి భౌతికేచ్ఛా ప్రభావముచే నెప్పటికైన విచ్ఛిన్నము కావచ్చును. అయినను కవిత్వాది కళలు సాధించిన బ్రహ్మాండమగు ప్రథమ విజయమిదియే. ఇంతకన్న బృహత్తరమగు విజయమును గూడ నీకళలు సంపాదింపగలవు. ఈకళలు, భౌతికేచ్ఛల నధఃకరించిన భావోద్రేకములను, నిర్లిప్తముగా హృదయ సంతుష్టికి, భావనాపరతంత్రతకు వినియుక్తమగునట్లు కావింపగలవు. అరిస్టాటిల్ పేర్కొనిన మానసికక్షాళన మిదియే. ఇదియే చిత్తశుద్ధి. భారతీయు లింతటితో విశ్రమింపలేదు. సమస్త ఆధ్యాత్మిక దివ్య శక్తుల సాధనకు నీ చిత్తశుద్ధి ప్రాతిపదిక. చిత్తశుద్ధి మూలమున నీ దివ్యశక్తుల నలవోకగా సాధింపనగును. 'యమనియమవిధి నిషేధక్రమ శాసితమైన ధర్మకల్పము' చేత చిత్తశుద్ధిని సాధించుటకు 'శిక్షాక్రకచము' నోర్వ వలయును. కాని కళోపాసనముచే నీ చిత్తశుద్ధి యనాయాసముగా లభించును. ఇదే కళావిశిష్ట ప్రయోజనము. కళాప్రచోదిత బృహత్తరప్రయోజనములలో గొన్నింటిని మాత్రమే లక్షించి, కళలు జీవితమున కాలంకారికములే కాని, యని వాక్యములు కావను భావన ప్రపంచమునందు ప్రబలినది. ఇది పొరపాటు.

ఇప్పుడు మన మసలువిషయమునకు వత్తము. జాతి పరిణామమునందు కళలకుఁగల స్థాన మెట్టిది? విద్యావిధానమునందు, జాతీయజీవనమునందు వాని ప్రయోజనము లెట్టివి? ఈ ప్రశ్నలకు సమాధానములు యోజింతము. ఇందు మొదటి ప్రశ్న నే యిట్లు మార్చనగును. సౌందర్య దృష్టివలన జాతీయ జీవితమున కేమైన ప్రయోజన మున్నదా? యని. ఉన్నదని నిరాఘాటముగా పేర్కొననగును. ఇంతకుముందే వచింపఁబడినట్లు, జాతిగౌరవ ప్రతిష్ఠలను బరిపోషించు సాంఘిక సంస్కృతి, సంయమనప్రవర్తనము, భావ సౌకుమార్యము, సౌజన్యము మొదలుగాగల యనేక విషయములీ సౌందర్య దృష్టివలన నే సంతరింపఁబడుచున్నవి. ఫ్రెంచివారు ప్రపంచమున్ననల నందుకొన్నారన్నను, ఐరిష్‌వారు, ఉన్నతవర్గమునకుఁజెందిన యాంగ్లేయులవలె గౌరవ భాజనులగుచున్నారన్నను, కారణము వారిలోఁగల కళాప్రియత్వమే కాని యన్యముకాదు. ఇట్టి కళాప్రియత్వ విరహితమైన జాతి యనేకవిధముల దుర్బలమైనదనకతప్పదు. సంస్కార విహీనుఁడైన యాంగ్లేయునిలోఁగల పాశవిక హింసా ప్రవృత్తి, ప్రష్యా దేశీయునియందుగల యసహ్యాకరమగు మూర్ఖత్వము, స్వార్థపరత్వము, ఆయా దేశములకు హానికల్గించినవి. విదేశీయులతోడను, విహితుల తోడను, వలసరాజ్యములవారితోడను, స్వతంత్ర రాజ్యములవారితోడను సంబంధబాంధవ్యములను నిర్ణయించుకొనుపట్ల నీ జాతుల స్వభావము మొత్తముపై నపకారమే యొనర్చినది. యుగయుగాలుగా సౌజన్య సద్భావ విలసితుఁడై, సహజీవన సూత్రబద్ధుఁడై యుదాత్తముగ ప్రవర్తించెడి భారతీయుఁడు, స్వరాజ్య సాధనకుఁ గావించిన సమరమున ఆంగ్లేయుల ప్రవర్తన మెంత కఠినముగా నుండెనో మన కందఱకును నెఱుకయే. రూప సౌందర్య పరిజ్ఞానమును, లయాన్విత ఋజుత్వమును, కళా సంస్కృతీ ప్రబోధముచే జాతి కంతటికిని కల్గింపనగును. పైన పేర్కొన్నట్లు సౌందర్య లక్ష్య విహీనులైన యాంగ్ల, ప్రష్యా దేశీయులు భావుకత లేనివారు. ఐరోపియను లందఱిలోను, వీరికి కవితా కళాపరిజ్ఞానమత్యల్పము. దక్షిణ జర్మనీయుఁడు, సంగీత కవిత్వాది లలిత కళోపాసనమునందు ముందంజ వేసెఁనాడు. కెల్టు, నార్మనులలో మహాకవులవతరించిరి. ఆంగ్లేయులలో శిల్పు లల్పముగాఁగలరుకాని, వారును తమ యనాగరక లక్షణముల నతిక్రమింప జాలనివారే!! లలితకళ లన్నింటిలో సంగీతము మిక్కిలి శక్తిమంతమైనది. ఏలయన నది యాపాతమధురమైనది. జీవుని సంపూర్ణముగ తనకుఁ గైవసము గావించుకొనునది. జీవుఁడు తానిట్లగుచున్నాననికూడఁ దెలిసి

కొనఁజాలఁడు. ఇంగ్లాండు దేశమునందు నామకుఁడైన గాయకుఁడొక్కఁడుకూడ నావిర్భవింపకుండుటే యాదేశీయుల యనాగరకతకుఁ బ్రబల నిదర్శనము. ఇది గమనార్హమైన విషయము. 'ప్లాటో' మహాశయుఁడు తన "రిపబ్లిక్" అను గ్రంథమునందు, విద్యావిధానమున సంగీతమున కత్యంత ప్రాముఖ్యము నొసఁగవలయునని వ్రాసెను. ప్రజల శీలము, తామలవాటుగా గ్రోలెడి సంగీతము ననుసరించి యుండునని యాతని వాదము. చిత్రలేఖన, శిల్పాదులకింతటి ప్రభావము లేదు. కాని సంగీతము తరువాతి స్థానము వీనిదే. సర్వేంద్రియములకు నయనము ప్రధానము. నయనేంద్రియ సంపాదితమైన జ్ఞానముద్ర మనః ఫలకముపై స్పష్టముగ పడును. అందుచే చిన్నతనమునుండియు, నయనేంద్రియములకు సౌందర్య సమీక్ష చేయఁగల దక్షత కల్గునట్లు శిక్షణ మొసఁగవలయును. అట్లొసఁగినచో ప్రకృతిలోఁగల సమైక్యత; వర్ణరంజనము, లయాన్వితత్వము సుబోధకములగును. క్రమముగా నీలక్షణములే నిత్యజీవితము నందును నెలకొనును. లలిత కళలవలనను, నుపయోగకళల వలనను సర్వతోముఖముగా సమకూడు మహాప్రయోజనమిదియే. ప్రాచీన గ్రీసుదేశమునందును; యూరపుఖండ చరిత్రమందలి కొన్ని యుగములయందును, జపాను దేశమునందును, ప్రాచీన భారతదేశమునందును, ప్రజలిట్టి కళాసక్తిని కళోపాసనాభిరతిని బహుముఖీనములుగాఁ బ్రకటించిరి. ప్రతిగృహమును నొక కళాప్రదర్శనశాల కావలయుననుట దుర్లభము. కాని దైనందిన కార్యకలాపము, నిత్యోపయుక్తము ప్రతి పరికరము, కళాత్మకముగా నుండునట్లు చూచుకొనవలయును. అపుడు మన యాచరణలు, ఆలోచనలు, అనుభవములు, నున్నతస్థాయి నందుకొని, మన జీవితములను మధుమయ మొనర్చుటే కాక, యుదాత్తభావ ప్రఫుల్లము కావించును.

సౌందర్యవస్తు సమీక్షవలనను, నుత్తమ కళాసక్తి వలనను భావోద్రేకములకు సరసమగు గమనమేర్పడును. చిత్తశుద్ధినిఁగూర్చి యింతకుఁ బూర్వమే కొంతముచ్చటించుకొంటిమి. కవితాకళ పరమప్రయోజన మీచిత్తక్షాళనమే యనినాఁడు 'అరిస్టాటిల్'. క్షుద్ర సంకుచితోద్రేకముల నధఃకరించి, జీవిత వికాసమునకుఁ దోడ్పడు నెనిమిది రసములను నిస్సంగముగా నాస్వాదించిన చిత్తశుద్ధి కల్గునన్నాఁడాతఁడు. ఇట్టి విధానము చిత్రలేఖన శిల్పాదులయందు కూడ సుసాధ్యమే. అవి మఱియొకరీతిగా నిట్టిలక్ష్యమునకుఁ జేర్చును. శిల్పము, కవిత్వమువలె పనిచేయును గాని, కవిత్వమునకున్న ప్రభావము దీనికి లేదు. కవిత్వమునకు లయాత్మక సంచలనము కలదు. శిల్పమునకు కదలిక లేదు. అది స్థాణువు. ఒకే ప్రదేశమునం దొకే భావసంచాలము నది ప్రదర్శించును. అది దేశకాలావధుల నతిక్రమింపఁ జాలదు. అయినను నీ స్థాణుత్వ ప్రశాంతతలే శిల్పమునకుఁ బార్థక్యమును బ్రతిపాదించుచున్నవి. కవిత్వము భావోద్రేకములను బ్రేరేచి, ప్రత్యేకానందమును బ్రసాదించును. శిల్పముద్రేకములను శాంతింపఁజేసి, సంయమనముతోఁ గూడిన పరిమిత సంతృప్తియందే యానందము ననుభవింపఁజేయును. గ్రీసుదేశము శిల్పమునకు కాణాచి. వీరి కవిత్వమునందును నీ శిల్పమహిమ వ్యాపించినది. సంగీతము భావోద్రేకములను గాఢమొనర్చును, ఒండొంటికి సమైక్యతను గూర్చును. కావున పరస్పర విలక్షణ గుణోపేతములైన యీ సంగీత, శిల్ప, చిత్రలేఖన, కవిత్వము లాత్మసంబంధములైన యుత్తమ విద్యలు. ఆత్మగమనము నీ విద్యలు పూతమొనర్చి పరిరక్షించును. ఆత్మకు సంయమనశక్తిని, గాంభీర్యమును; సమైక్యతను నివి ప్రసాదించును. అందుచే నీ కళలను నిర్లక్ష్యము చేయరాదు. ఈ కళాప్రగతియే మానవప్రగతి. ఈ ప్రగతి మందగించినపుడుగాని, క్షీణించినపుడుగాని, మానవుఁడింద్రియములకు బానిసయై, తత్సంబంధమగు సౌఖ్యసాధనమే పరమాశయముగా భావించి, సౌశీల్యమును గోల్పోవును. ఇవి సక్రమముగా వినియుక్తమైనచో, మానవుఁడు విద్యావంతుఁడు, సంస్కృతీ సంపన్నుఁడు, వినీతివశంవదుఁడునై ప్రవర్తించును.

## 5

కళాప్రయోజనములలో ముఖ్యమైనది మేధోద్దీపనము. మేధాకార్యము ద్విముఖములుగా నుండునని యును, అందొకటి భావనాసంబంధము లేక సృజనాత్మకమైనదనియు; రెండవది విచక్షణాత్మకము లేక విమర్శనాత్మకము నైనదనియు నితఃపూర్వమే పేర్కొంటిమి. రెండవశక్తి వివిధ శాస్త్రావలోడనము వలన వృద్ధి పొందును. మొదటిది వివిధ కళోపాసనము మూలమునను, ప్రపంచమును సానుభూతితో సమీక్షించుట లవనను వృద్ధిపొందును. ఇట్టి కళోపాసనముచే బుద్ధి నిశితమౌను. స్వార్థసంకుచిత స్వభావము నశించును. నూత్న

# కళల జాతీయప్రయోజనము

సుకుమారమైన ప్రేరణాత్మకశక్తి పెంపొందును. పలు విధములగు భావముద్రలను మనఃఫలకముపై చిత్రించును. ఒక్క వీక్షణమాత్రముననే సమస్త జగత్కార్యగతిని విదితము చేయును. జగత్తును విచ్ఛేద దృష్టితో కాక, సమైక్యదృష్టితో సమీక్షింపఁగల దక్షత కల్గించును. పరుల మనోగతులతో, స్వకీయ మనోగతి నేకమొనర్చి సాకల్యమును సమకూర్చును. దయార్ద్రమగు నాంతరంగిక దృష్టిని ప్రబలము చేయును. కళ చాల సుకుమారము, సూక్ష్మమునైనది. తన్నందినవారు తనంతవారౌ దురన్నట్లు, కళ నుపాసించువారిని కళాధర్మము లావహించును. కళ కాంతాసమ్మితముగా నుపదేశించును. అట్టి యుపదేశము నవగతమొనర్చుట కలవడిన బుద్ధి, నిత్యజీవిత మార్గనిహిత మహిత సత్యమును నిమేషములో గుర్తింపగల్గును. శాస్త్రాభ్యాసము మూలమునను నిట్టి బుద్ధి నైశిత్యము సంక్రమించును. కాని దానికిని, దీనికిని విశేష తారతమ్యము కలదు. శాస్త్రము బాహ్యవిషయ పరిజ్ఞానము మాత్రమే కల్గించును. అందును నది తన కనుకూల విషయము లందే ప్రసరించును. వ్యతిరేక విషయములందు చొరవ దానికి లేదు.

కళ అట్టిదికాదు. దానికే జగత్తునను వ్యతిరేకతయే లేదు. అది సర్వమును రసమయ మొనర్పగల పరుసవేది వంటిది. సకల సృష్టిస్వరూపముల, సమస్తప్రకృతి స్వభావముల నామూల చూడముగ సాక్షాత్కరింప జేయునదీ కళ. నవనవోన్మేషమగు శక్తిప్రదాయిని, మనఃకవాటములఁ దెఱచి, సృష్టికలాపమున కందు ప్రవేశము కలిగించును. మేధోద్దీపనము, హృదయవికాసకారకమునగు నీ కళావిశిష్టప్రయోజనము నందఱును పూర్తిగా గుర్తించినట్లు కనుపించదు. మానవులు భాషను గల్పించిరి. కవిత లాలాపించిరి. చరిత్రలు లిఖించిరి. వేదాంతగోష్ఠులు గావించిరి. బుద్ధికిఁ బదును పెట్టిరి. కాని సంగీతము, చిత్రలేఖనము శిల్పములకు గల వైజ్ఞానికపు విలువ నంతగా గుర్తించినవారు విశేషముగా కానరారు. కళలు, మానవుల కైచ్ఛికములే కాని, యావశ్యకములు కావను భావము ప్రబలుటచే నీకళ లేకొలఁదిమందికో మాత్రము నారాధనీయమైనవి. అయినను సౌందర్యమున కాకర్షితమాట రమణీయ గీతముల నాలకించుట వర్ణరంజితమైన చిత్రములను జికీర్షతో సమీక్షించుట, మున్నగు లక్షణములు విశ్వజనీనముగా మానవాళిని ప్రేరేచుచు వెన్నంటియే యున్నవి. మానవత్వమునకు దివ్యత్వము నాపాదింపఁగల కళారాధనా ప్రవృత్తికి దూరము కావలదని యీ యంతః ప్రేరణ మెప్పటికప్పుడు మానవుని హెచ్చరించుచునే యున్నది. కాని యీ హెచ్చరికను మానవుఁడు పెడచెవిని బెట్టుచున్నాఁడు. ఈ యమూల్యమగు హెచ్చరిక నాలించి, యుత్సాహోల్లాసములతో సుశిక్షితమగు మార్గమున కళారాధనము కావించుచు, దివ్యత్వము నార్జించుటకు యత్నింపక, క్షణికాడంబరములకే కాలముసర్వము వ్యయించుచుండుట శోచనీయము. మానవ మేధానిహితమైన మహితశక్తిని వెలార్చుటయందు, భావోద్రిక్తతా విలాసమునందు, బ్రహ్మానంద సబ్రహ్మచారి యయిన రసానంద రూపకమగు నానందమును స్వాధీన పఱుచుటయందు, జీవిత గమనమును దీర్చిదిద్దుట యందును నీ కళలకుఁగల స్థానమును మానవులు సక్రమముగాఁ దెలిసికొన్నచో, వారి పురోగమన మవిచ్ఛిన్నముగ సాగును. నేడు మానవులలో నధిక సంఖ్యాకులం దీకళాసంబంధమగు ప్రేరణ లఘమస్థితికి దిగజారుట మానవత్వ పతనమనియే భావింపక తప్పదు.

మేధావికాస కారకమగు నీ ప్రయోజనము కన్న మిన్నయైన యత్యుత్తమ ప్రయోజన మొకదానిని కళ చేకూర్పఁగలదు. జాతియందాధ్యాత్మిక వికాసమును గల్గించుటే యా పరమప్రయోజనము. కళలభివృద్ధి గాంచి మతముతో నెట్టి యవినాభావ సంబంధమును బడసినవో యైరోపియన్ విమర్శకులు వివరించిరి. ఇందు విప్రతిపత్తియేమియు లేదు. గ్రీసు, ఇటలీ, ఇండియా, దేశములందు, జాతీయ కళావికాసము, కళాప్రతిభ తత్తజ్జాతిమతచిహ్నములైన దేవాలయాదులను కళాత్మకముగాఁ దీర్చి దిద్దుటయందే ప్రదర్శితమాయెను. కళకు, మత సంబంధమైన యిట్టి బాహ్యాకృతులకుఁ గల సన్నిహితత్వమునుబట్టి యీ కళావికాశము కలుగ లేదు. కాని మానవుల యాధ్యాత్మికాశయము లన్నియుఁ వారవలంబించు మతమునందు కేంద్రీకరింపఁ బడినవి. ఆధ్యాత్మికత చాల విశాలమైనది. బాహిరమగు మత విధానములే దాని యవధులు కావు. అట్టి యాధ్యాత్మికోన్నతిని సాధించుటకే కళావిష్కారము జరుగుట. కళాప్రయోజనములలో నత్యుత్తమము. దివ్యజ్ఞానము, దివ్యమగు ప్రేమానందములు, దివ్యశక్తియను త్రివేణీ సంగమమే యాధ్యాత్మికత. మానవుఁడీయాధ్యాత్మిక

శక్తిసాధనకే సదాయుత్కంఠించును. పాశ్చాత్యులనుభవించెడి రసానందమును, సౌందర్య పరితృప్తిని, జీవితచిత్రణా పరిశీలనానందమును భావోద్రిక్తవిభూతిని, యనుభవింపఁ జేయుటే కాక, కళ, తదతీతము, నాంతరంగికము నగు నాధ్యాత్మిక సత్యానుభూతిని ప్రసాదించును. అట్టి యాంతరంగికాధ్యాత్మికానుభూతియే విశ్వముఖమున విశ్వేశ్వరుఁ డనుభవించు నానందము. అదే సృష్టియందు గాంచనగు దివ్యత్వము. ఇట్టి సర్వోత్తమ ప్రయోజన సంసిద్ధికే భారతీయుఁడు కళ నుపాసించును. అట్లని సర్వసాధారణముగ పాశ్చాత్యకళోపాసకులు ప్రాథమికముగా ననుభవించు రసానందమున కీతఁడు దూరుఁడు కాఁడు. ఏతదనుభవానంతర మీతఁడదే తన చరమసీమ యని భ్రమింపక, దాని నధిగమించి, యుగయుగాలుగా, తనజాతికి కాణాచియైన యాధ్యాత్మికానుభూతియందు రమించును. ఈ కారణము చేతనే ప్రాక్ప్రతీచీ కళాప్రయోజనములు భిన్నముగా నున్నవి. ఇప్పుడిప్పుడే, కళానిష్ణాతుఁడైన యైరోపీయను, ఆసియాఖండ కళాసంప్రదాయములను, సదాచారములను, నుత్తమోత్తమ లక్ష్యములను నవగాహనము గావించుకొనుట కారంభించినాఁడు. ఆసియాఖండమునం దితోధికముగా జరుగుచున్న కళాభివృద్ధిచే నీప్రాక్ప్రతీచీ కళాప్రయోజనము లేకమై, యేకైక మహోన్నత పరమప్రయోజన సంసిద్ధికీ సకలజగత్తును యావచ్ఛక్తిని వినియోగించునని యాశింపనగును. రసానందానుభవ మాధ్యాత్మికానందానుభవముగా పరిణమించి నపుడే యది చరితార్థమగును.

నిజముగా కళ కిట్టి సర్వోత్కృష్ట ప్రయోజనము సర్వత్ర సిద్ధింపవలయునన్న భారతీయ కళోపాసనావిధానమే ప్రాబల్యము వహింపవలయును. ఎచ్చోట సర్వమానవకోటియు విశ్రమించునో, యచటినుండి భారతీయుఁ డుపక్రమించి దుర్గమ శిఖరముల కెచ్చటికో చని, యందధిష్ఠించి తన యాత్మనావిష్కరించును. అది మానవుని భగవంతునిగా మార్పఁగల దివ్య ప్రదేశము. భారతీయుని యీ మహాప్రస్థానమునందు అతని శారీరక, మానసిక, హృదయ ప్రవృత్తులు సర్వము దివ్యత్వము నందును. సర్వమానవ జగత్తును నీ మహాప్రస్థానమున కుపక్రమించిన కళాప్రయోజనమును సమగ్రముగ సంపాదించినట్లౌను.

కళ యనంతమగు సత్యమును బ్రకటించు పటుత్వము కలది. అది యాకృతియందే పరిమితమైనది కాదు. ఆకృతి నాలంబనము గావించుకొని యఖండ సత్యమును దోబూచు లాడించును. భగవాను డెంత యద్భుతావహముగ నీ జగత్తును సృజించెనో ? అంతకన్న నద్భుతావహమీ కళాసృష్టి!! నాల్గు గీతల నేకమొనర్చిన మాత్రమున, నిరాడంబరముగ నాల్గురంగులను గల్పినంత మాత్రమున, సృష్టిలో నముఖ్యములగు విషయములే, కళాసృష్టిలో, గంభీరోదాత్త సత్యప్రతిపాదకము లగుచున్నవి. భావ మూలమున నిట్టిస్థితి నందుకొనుటకు విశేషముగ పరిశ్రమించవలయును. ప్రకృతి రామణీయకమున నెట్టిదో!! దేవుడన నెట్టివాఁడో!! మానవుని యాంతరంగిక స్వభావ మెట్టిదో యొక పాషాణమునందు గాని, యొక ఫలకమునందు గాని సముచితముగా గాంచనగును.

ప్రకృతి దృశ్యములయందు నిగూఢమైన మహితశక్తిని కళాకారుఁడు మాత్రమే సాక్షాత్కరించుకొనఁ గలఁడు. తన భావయిత్రీ కారయిత్రీ శక్తిప్రభావముచే ప్రకృతిలోఁగలలయాత్మక సంచలనమునుమాత్రమే కాక, నిస్తబ్దతయందును నిహితమైన యనంతశక్తినిగూడ నక్షర రమ్యముగాఁ బ్రసాదింపఁగల వరపుత్రుఁడు కళాకారుఁడు. మత ప్రతిపాదిత పరమసత్యము; మానవ మేధావికసిత శాస్త్ర వేదాంతములు; బహుముఖీన సంక్లిష్ట జీవిత సమస్యలు; అభ్యుదయానభ్యుదయ పరంపర లనేకములు, సజీవ సుందరాకృతులు వహించి భావోద్రిక్తతా ప్రేరకములై; విశ్వజనీన ధర్మములుగా నీ కళాకారుని మధుర హస్తమునందు సందర్శనీయములు. ఇట్టి కళాప్రదర్శనసందర్శనమున కలవాటు చెందిన మానవాత్మ, సామాన్యస్థితినుండి యుద్గమించి పరిపూర్ణ వికాసమునందుకొనుట కారంభించును.

సర్వసృష్టియు దివ్యప్రేమానందసంభరితము. ఈ యానందము, కలుషితమైన భౌతిక సుఖము కన్న నన్నివిధముల మిన్నయైనది. సమగ్రము, అవికారము, సమస్తవస్తు శోభావహము, సర్వసామాన్యమయ్యును సర్వోత్కృష్టము, నీచము నసహ్యమయ్యును మహోదాత్త గంభీరమును, రమణీయ భయానకమగు నీ సృష్టి ధర్మము సర్వులకును సద్గతి కల్గించుట, సర్వులను పవిత్రులను గావించుట, అందఱను సత్యశివసుందరులనుగాఁ దీర్చిదిద్దుట. ఇట్టి సృష్టి కళామూర్తైక బిందు

సంసేవన మాత్రముననే సర్వజీవనము, సర్వక్రియాశక్తియు దివ్యముగ పరివర్తించును. ఇక నీ యమృత సర్వస్వము నాస్వాదింపఁగల మానవుల యదృష్టమెవరికిదృష్టము? వారే దేవతలన, సృష్టి కళకుఁగల యీ శక్తి సర్వమును ద్విగుణీకృతముగా కళాసృష్టి మూలమున పుణికి పుచ్చుకొనవచ్చును. మానవుఁడు సాగించెడి యాతనాయత జీవితయాత్రను, రసవత్తరమగు నానందయాత్రగాఁ బరివర్తింపఁ జేయఁగల విజ్ఞానమీ కళాసృష్టికిఁ గలదు. ఇటి జీవిత యాత్రకాధార మాధ్యాత్మికత్వము, ఇది విశ్వమునం దంతటను నిండి నిబిడీకృతము. ఇదియే ప్రతి వ్యక్తికి, తన యనంత క్రియాకలాపమునందు, కష్ట సుఖములయందు చుక్కానిపట్టి, భవాబ్ధినుండి తరణోపాయమును జూపును. మానవహృదయమునందు వాసనా మాత్రముగా నుండి, సమస్త విశ్వతలమునందుగల దివ్యస్వభావ బల వీర్యములను; ప్రశాంతతోద్రిక్తతలను, నాకర్షణోత్సాహములను, సంపూర్తిగా మానవాత్మకు సంప్రాప్తింపఁ జేసి పరిమితావరణ బద్ధుఁడగు వాని, ననంతమునందు విలీన మొనర్పుటయను మహత్తరాధ్యాత్మిక ప్రయోజనమే కళవలన ప్రాపణీయమగు పరాకాష్ఠ లాభ లబ్ధి. అదియే సర్వతోముఖ కళావికాసము. అదియే దానికిఁ గల యఖండ స్వామ్యము.

మానవ సంస్కృతీ పరిణామమునందు కళవలనఁ గల్గు పరమప్రయోజనమునుగూర్చి కొంతవఱకు మాత్రమే ముచ్చటించుకొంటిమి. ఈ సందర్భముననే విద్యా విధానమునందు కళలకుఁగల స్థానమును గూర్చి కూడా కొంత ప్రస్తావించితిమి. ప్రజా సంస్కృతీ సంపదకు నుత్తమ మానసిక శిక్షణమునకు నైతిక రసానందానుభవ నైపుణ్యమునకును గారణభూతమైన యిట్టి కళాసంపద నేదేశము గాని తృణీకరింపఁ జాలదనుటలో విప్రతిపత్తి లేదు. కళాశిక్షణ మే కొలఁదిమంది నిపుణులకో సంబంధించిన స్వామ్యమని వేఱుచేయక, విద్యా విధానమునందును, సంస్కృతీ సంపాదనమునందును నొక యనివార్యమగు నంశము గావించవలయును. శాస్త్రములు, వాఙ్మయ పఠనము మున్నగు వానికి వలెనీ కళలకుఁ గూడ సముచితమైన స్థానము నొసంగ వలయును. అప్పుడే జాతీయ విద్యావ్యాప్తి యందును, సర్వతోముఖ మానవ సంస్కృతీ ప్రచారమునందును, నా దేశ మభ్యుదయ మార్గమున గమించుచున్నదని భావింప నగును. దీనినిఁ బట్టి ప్రతి మానవుఁడును నొక కళాకారుఁడు కావలయునని యుద్దేశ్యము కాదు. కాని ప్రతి మానవుఁడు తనకు భగవద్దత్తమైన కళా నైపుణ్యమును వృద్ధిగావించుకొనవలయుననుట తప్పు కాదు కదా!! తన కళాభిరుచిని ప్రతివ్యక్తియు సుశిక్షిత మొనర్చుకొనవలయును. తన సౌందర్య పిపాసను, తన రూపలాలసను, తన వర్ణరతిని, నిరంతరాభ్యాసముచే నిత్య జాగ్రుతము, సునిశితము, సుశిక్షితము, విశదము నొనర్చుకొనుటాతని పరమ ధర్మము. గొప్పగనో సామాన్యముగనో సృజింపగలవారికి, అసాధారణ ప్రతిభావిశేషసంపదచే నపూర్వశిల్పమును సృష్టించువారికి లేదా మానవ నిత్యజీవితోపయోగవస్తువులను నిర్మించు వారికి తమ నిర్మాణ విధానమవిచ్ఛిన్నముగ సాగునట్లు చూడవలయును. దేశీయులు కూడ వైకృతమును గాక ప్రకృతిని నైచ్యమును గాక యుదాత్తతను, గ్రామ్యమును గాక సంస్కారమును, విషమమును గాక సమత్వమును సదా వాంఛించుట కలవాటుపడవలయును. ఏ జాతి తన నిత్యజీవితము నుదాత్త సౌందర్యావరణమునందే యుండి, సమాహిత చిత్తముతో నట్టి సౌందర్యము నుపాసించునో, యాజాతి సంపూర్ణ కళాస్వరూపమును సాక్షాత్కరించుకొని, తాదాత్మ్యము నందును.

వంగదేశమునం దీమధ్య నారంభింపఁబడిన జాతీయ విద్యాలయములందు చిత్రలేఖనము, మృత్తికా నిర్మాణము ప్రవేశపెట్టఁబడినవి. వానికి సముచితమగు ప్రాముఖ్యము నొసఁగఁబడినది. కాని సరియైన కళా లక్ష్యము కుదురలేదు. ప్రజానీకమునందు చేతిపనులను గూర్చి విరసమగు భావము లేర్పడినవి. జాతీయ విద్యా సంస్థ లార్థికముగా మిక్కిలి హీనస్థితిలో నున్నవి. కళలను, కళాదృష్టితోఁ గాక, వ్యాపారదృష్టితోఁ జూచుట యొక్కటైనది. జాతీయతయని యెంత పరితపించినను, నాంగ్ల భావప్రాబల్యము, ఆంగ్లేయ విధానములు, ఆంగ్లాభిగమల ప్రభావము, జాతీయవిద్య యనఁబడు నీ విధానము నారంభమునందే నిష్ప్రయోజన మొనర్చెను. విద్యార్థులలో స్వతస్సిద్ధమగు నైపుణ్యము లేకపోలేదు. కాని వారు పొందిన బోధనమా నైపుణ్యమును నిరుపయోగ మొనర్చినది. ఆంగ్లేయులు కేవల వ్యాపార దృష్టితో, కళావిహీనముగా గావించు ఉత్పత్తి ననుకరించి యీ విద్యా సంస్థలయందును వస్తుసామగ్రిని తయారుచేయవలయునన్న, దేశమునకుఁగాని, వ్యక్తికిఁ

గాని యెట్టి ప్రయోజనము నుండదు. స్వేచ్ఛాయుత చైతన్యములో, క్రాంతదృష్టితో నొక రూపమును దర్శించి, సత్యస్వరూప పరిజ్ఞానముతో, స్వయం శిక్షణచే నేర్పడిన హస్తలాఘవముతో, నాత్మప్రేరణానుసారముగా దానికి వర్ణరంజితమగు రమణీయాకృతిని కల్పించిన కళాసృష్టిలో నుభయతారకత్వ మున్నది కాని, యేవో కొన్ని కొలతలను దీసికొని; ముక్కకి ముక్క దింపమన్నచో, కళాసక్తి యేమాత్రము నభివృద్ధి గాంచదు. ఇట్టి యథార్థ రచన కేవలము యాంత్రికము, లాంఛనప్రాయమునగు నాంగ్ల పద్ధతి. ఇది భావుకులగు భారతీయులకు నిష్ప్రయోజనము.

భారతదేశమునందు, నిజమైన జాతీయ కళా సముద్ధరణ మెప్పుడో ప్రారంభమైనది. ఇప్పటికే భారత జాతీయ సామాన్య కళాసృష్టి, విదేశీయోన్నత కళాఖండములను దలదన్నఁగలదనుటలో సందేహము లేదు. ఇట్టి పరిస్థితులలో నపరిష్కృతము సర్వసామాన్యము, నీరసమునగు కళాబోధన విధాన మాంగ్ల పాఠశాలలలో కొనసాగుట క్షమింపరాని యపరాధము. ఆంగ్లేయుల నైచ్య వ్యాపారదృష్టి మనకే మాత్రమును విహితము కాదు. ఇంకను మన దేశమునందు సమంజసమగు జాతీయ విద్యా విధానము పరిణామము చెందవలయును. పాశ్చాత్య లక్ష్యములు, స్వభావ విరుద్ధమగు విదేశీయ పద్ధతులు, మన మానసముల నుండి పూర్తిగా క్షాళనము కావలయును. చివరకు, తత్సంబంధమగు వాసనలు కూడ మనలో శేషింపరాదు. అందును విద్యా విధానమునం దిట్టి భావదాస్య మేమాత్రము పనికిరాదు. సరియైన విద్యా బోధనమందే జాతి మానసిక, కళాభ్యుదయ జీవన మాధారపడియున్నది. ప్రాచీన కళాతత్త్వము పునరుద్ధరింపఁబడవలయును. ప్రాచీన సంప్రదాయముల నిప్పటికిని పరిపోషించుచున్న కళాకారులలోఁగల సత్యదృష్టి, క్రాంతదర్శనము, ఋజుభావావేశము, నిసర్గ ప్రతిభాసంపద; జాతీయత, హస్తమాధుర్యము, నాంతరంగిక ప్రేరణానుకూలమైన దృష్టి, నవనవోన్మేషముగా తిరిగి సంపాదింపవలయును. జాతియంతయు నువ్వెత్తుగా మఱల ప్రాచీన సంస్కృతీ విశాలకళాపీఠమునందు సుప్రతిష్ఠముగ నుద్ధరింపఁబడవలయును.

# [illegible]

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి—శ్రీ కొండముది హనుమంతరావు

[ గతసంచిక తరువాయి ]

## రంగము: 3

* వెలుగూ చీకటీకాని అసురసంధ్య. బయటినుండి ప్రకృతి భీభత్సంగా రోది స్తున్న శబ్దం విన్పిస్తున్నది. ఆ వాన జల్లుకూ, గాలి వేగానికీ, కిటికీ గాజు తలుపులూ, సింహద్వారపు తలుపులూ తట్టుకోలేక బ్రతుకునకూ మరణానికీ మధ్య వ్రేలాడుతున్నవి.

లైట్లు వెలిగించుకోలేక హాల్లో ఒంటరిగా ఓ మూలగా బాధపడుతూ కూర్చునివున్నాడు డాక్టర్ నారాయణ. చూడటానికి అతనిలో చలనంలేదు. ఎఱ్ఱగా జ్యోతుల్లావున్నకళ్ళు, విశ్రాంతి లేమిసీ, బాధాతప్తహృదయాన్నీ సూచి స్తున్నవి. వేసుకున్న తెల్లనిదుస్తులు మాసిపోయి, దువ్వకొన్న చక్కని జుట్టు చెదిరిపోయి మనిషి ఓ పిచ్చి వాలకంలో పడివున్నాడు.

లోపల, మానవుడే కనిపెట్టిన యంత్రం ఆ మానవుణ్నే పరిహసిస్తు న్నట్లుగా పని చేసుకుపోతున్నది. ముందువున్న గది తలుపులు దగ్గఱకు వేసి ఉన్నవి. లోపల వెలుగుతున్న దీపాల నీడలు హాల్లోకి ప్రసరిస్తున్నవి. గదిలో జాకబ్ అటూ యిటూ తిరు గాడుతున్నాడు. నిశ్చయానికి రాలేక కాబోలు! కొంతసేపటికి అతనే గది తలుపులు తీసి మెల్లగా హాల్లోకి ప్రవేశిసూ :

జాకబ్: (మెల్లగా) డాక్టర్! (గదిలోఉన్న దీపం వెలుగు ఇద్దరిమీదకూ ప్రసరిస్తున్నది.)

డాక్టర్ నారాయణ: (పలుకలేదు. తలయెత్తి చూడ లేదు. కుర్చీలోమాత్రం అటునుండి ఇటు సర్దు కున్నాడు.)

జాక: (అతిన్ని సమీపిస్తూ) దయచేసి నే చెప్పేది వినండి.

నారా:(బాధగా ఒక్క నిశ్వాసం విడిచి కళ్ళు మూసుకున్నాడు.)

జాక : (అతన్ని మరీ సమీపిస్తూ) దయచేసి నే చెప్పేది వినండి, డాక్టర్! (కొంచెం మౌనం) బ్రతుకు మీద ఏమాత్రమో ఇచ్ఛ కలిగించింది మీరు. (స్వగతంగా) అందుకనే చూసి చూసి మిమ్మల్ని హింసించలేకపోతున్నాను. కానీ...కానీ... డాక్టర్ ...దయచేసి, దయచేసి మనస్ఫూర్తిగా మీరు చెప్పండి. దొరికిన అవకాశాన్ని చేసేతులా జారవిడుచుకోనా? నాకు తెలుసు. ఈ జన్మకిది ఒక్కటే ఇక శివరాత్రి. విధి గ్రుడ్డి దైనా, చెడ్డదైనా అందలం ఎక్కమంటున్నది నన్ను. నే నా పని చేయకుండా వుండలేను డాక్టర్!—వుండలేను. క్షమించండి నన్ను.

నారా: (జాకబ్ వేపు కోపంగా చూస్తాడు)

జాక: (ఏదో దృఢనిశ్చయానికి వచ్చినట్లుగా, తనలో తాను అనుకుంటున్నట్లుగా) అందరం మంచి వాళ్ళమే—అవసరం రానప్పుడు. అవును. ఇదివరలో నేనూ చాలా మంచివాణ్నే. కాదా డాక్టర్?

నారా: (ఎకసెక్కెంగా) అవునవును.

జాక: కాదన్నా నాకు పోయిందేమీ లేదు. కాదనే, మంచివారు కాదని ముద్ర వేసి నా చెల్లెలిని—ఎంత ప్రేమగా చూచుకొన్నాను దాన్ని!—నా చెల్లెలిని, తల్లిని—'అమ్మ!'—నా చెల్లెలిని, నా తల్లిని, నా తండ్రిని—అందరినీ వెలివేశారు. ఎవరో తెలుసా డాక్టర్? కనీసం ఎందుకో తెలుసా? నా చెల్లెలు పెద్దవాళ్ళమను కునే ఈ నీతివంతుల కోర్కెలకు అంగీకరించలేదు. అంగీకరించలేకపోయింది, వెర్రిపిల్ల! నా తండ్రి ఈ ప్రెసిడెంటునూ, ఈ మార్షల్‌నూ, కృతజ్ఞత కాని వీరి నిరంకుశత్వాన్నీ ధిక్కరించి విప్లవంలో చేరాడు. అందుకు ప్రతిఫలం? ఈనాటికీ నా తండ్రి సంగతి నాకు తెలీదు. ఇంక మా అమ్మ ఎందుకు మంచిది కాలేకపోయిందో తెలుసా డాక్టర్? వీరి దృష్టిలో! అవును! మీకెలా తెలుసు? మీ నాన్నగారికి తెలుసు.

నారా: మా నాన్నగారికా?

జాక: గాభరాపడకండి. మీరు విదేశాల్లో ఉన్నప్పుడు మీ యింట్లోనే కొంతకాలం తలదాచుకున్నాం ఆ సంగతి మీకు తెలియదు. నేనే తెలియనీయ లేదు—అవసరం రాలేదు కాబట్టి.

నారా: ఇప్పుడు అవసరం వచ్చిందా?

జాక: ఆఁ! అవసరం వచ్చింది. మనకు తెలియకుండానే, మన ప్రమేయం లేకుండానే, మనమందరం చరమాంకంలో ప్రవేశించాం. ఇందులో ఎవరు రాలిపోతారో ఎవరు నిలబడతారో నాకే తెలీదు.

నారా: చరమాంకమా?

జాక: నా సంగతి చెప్పనీయండి. ఒక రోజు ఉదయం నిద్రలేచి చూసేసరికి మా అమ్మ నా పక్కన లేదు. ఒక్క ఉత్తరం మాత్రం భద్రంగా ఆమె మంచం మీద పడి ఉంది.

నారా: ఏముందా ఉత్తరంలో?

జాక: ఏముంటుంది? ఆడదాన్ని చూస్తే మగవాడి చేతలూ, ఆలోచనలూ ఎంత వక్రమార్గంలో పయనిస్తాయో అందులో వివరించబడి ఉంది. మీ నాన్నగారు—ఒహ్హో ఎంతటి పెద్దమనిషి ఆయన!—ఈ సంగతి తెలిసినవెంటనే బీరువాలో వెతుక్కున్నాడు. వేసిన తాళాలు వేసినట్లే వున్నాయట కానీ, బంగారపు నగలు రెండు కనిపించటం లేదుట? మానవుడి సంస్కారం ఎంతటి నీచానికి దిగజారి పోయిందో తెలుసా డాక్టర్?

నారా: జాకబ్!

జాక: కోపం తెచ్చుకోకండి. శాంతంగా ఆలోచించండి. నా యీ స్థితికి ఎవరు కారణం? ప్రెసిడెంటా? మార్షలా? మీరా? చెప్పండి. నేను చేసిన అపరాధం ఏమిటి? అనామకుడిగా నా జీవితం ఎందుకు రాలిపోవలసి వస్తున్నది?

నారా: నేను మాత్రం కారణం కాదు.

జాక: కాదు కాబట్టే ఇంతకాలమూ మీ నీడలో తలదాచుకున్నాను. కానీ ఇప్పుడు మీరే, మీకు తెలీకుండానే, నాకు హాని చేస్తున్నారు.

నారా: ఎలాగు?

జాక: సంఘంలో గౌరవం పొందడానికి అధికారమైనా ఉండాలి. ధనవంతుడైనా అయి వుండాలి. కాకపోతే ఆ మనిషి వ్యక్తిత్వం అత్యున్నతమైనదైనా అయిఉండాలి. ఈ మూడూ నాకు లేవు.

నారా: అయినప్పుడు?

జాక: మీరా యంత్రానికి కర్తగా నన్ను అంగీకరిస్తే, నాకు కావాలిసింది, నేను యీయవలసిందీ కూడా నెరవేరుస్తున్నాను. ఇంతకాలం బ్రతికి ఉన్న ప్రయోజనం కొంతలో కొంతగానైనా నెరవేరుతుంది.

నారా: కానీ, నేనాపని చేయలేనే!

జాక: నా యీ జీవితగాథను మీకు వినిపించకూడదనే దినమెల్లా మిమ్మల్ని బాధిస్తూవచ్చాను- పరోక్షంగా, మీరు బాధపడడం చూసికూడా మిమ్మల్ని బాధిస్తూ వచ్చాను. కానీ చివరకు చెప్పక తప్పలేదు. చెప్పినా ప్రయోజనం

కన్పించడం లేదు.

నారా: చూస్తు చూస్తు ఆ పని నే చేయలేను జాకబ్ !

జాక : అలా అయితే మీ నాన్నగారు చేసిన పాపానికి మీరు పరిహారం చెల్లించవలసి వస్తుంది. ఆలోచించు కోండి.

నారా: జాకబ్ ! జాకబ్ !?

జాక : లాభంలేదు డాక్టర్ ! ఎంత సౌమ్యంగా వుండాలో అంత సౌమ్యంగా వున్నాను. కానీ దాని వల్ల నాకు ఉపకారంమాత్రం ఏ మాత్రమూ జరుగలేదు.

నారా: జాకబ్ ! జాకబ్ ! ఇంకొక్కసారి ఆలోచుంచు. నన్ను అన్యాయం చేయబోకు ! శిసుహత్యకన్నా ఘోరమైన పాపమిది !

జాక: (పెద్దగా నవ్వుతూ) పాపమా? ఎక్కడుంది డాక్టర్ ఆ పాపం? ఎక్కడ లేదు డాక్టర్ ఆ పాపం? మనమూ, మనచుట్టూ పరిభ్రమిస్తున్న సమస్తలోకమూ, పాపం మూలంగా నేఉద్భవిస్తున్నదని మర్చిపోకండి. మన తలిదండ్రులు, మన భార్యలు, చివరకు మనం కన్న బిడ్డలూ అందరూ ఒకరినొకరు మోసగించుకుంటూ, దూషించుకుంటూ దాలిగుంటలో కుక్కల్లాగా కదూ బ్రతుకుతున్నది? నీకోసం చేసుకున్నది న్యాయం. ధర్మం, సచ్ఛీలం పేరుతో బహుచక్కగా మోసగించవచ్చు ప్రపంచాన్ని. ఎదుటివాడు దాన్నే తనకోసం వినియోగించుకుంటే అది స్వార్థం. పాపం! మతమనే దుడ్డుకఱ్ఱతో వాడికి కపాల మోక్షం చేస్తారు మీరు. ఇది—ఇదే న్యాయమూ, ధర్మమూ!

నారా: (జాలిగా) ఉద్రేకపడకు. నీకు నేనొకనాడు ఆశ్రయమిచ్చానన్న సంగతి మఱచిపోకుండా శాంతంగా ఆలోచించు.

జాక : ఏం? ఉపకారం చేసినందుకు ప్రత్యుపకారం చేయాలా? ఎన్నడో కర్మకాలి వాడు మీ ఇంట తల దాచుకున్నందుకు జీవితాంతం, ఉపకారమనే జైలు గోడలమధ్య, శృంఖలాలు తగిలించుకుని, వాడు ఏడుస్తూ పడివుండవలసిందేనా? ఇదేనా ఉపకారానికర్థం? వీల్లేదు. ఎన్నటికీ అది వీల్లేదు. నేను, దాన్ని ఆచరించను. అవసరమొస్తే ఉపకారికి అపకారం చేయడానికైనా ఒప్పుకుంటాను.

నారా: (పెద్దగా అరుస్తున్నట్లుగా) జాకబ్!

జాక : (అంతకన్న పెద్దగా – అదే ఆవేశంలో) అవును! నువు దాన్ని ఇచ్చివేయవలసిందే. తప్పదు. ఇచ్చేయ్. ఇచ్చేయ్ డాక్టర్ !

నారా: ఇవ్వను. ఇవ్వను. ఇవ్వలేను. నేను బ్రతికుండగా ఇవ్వలేను.

[బయటనుంచి శాంతాదేవి స్వరం. కారు వెళ్ళిపోయిన శబ్దం.]

శాం : నారాయణా! నారాయణా!

నారా: వస్తున్నా. వస్తున్నా. శాంతా! (జాకబ్‌ను చూస్తూ) దయచేసి ప్రస్తుతానికి వెళ్ళిపో జాకబ్ తర్వాత మాట్లాడుకుందాం.

జాక : వెళ్లను.

నారా: (బ్రతిమిలాడు తున్నట్లుగా) వెళ్లవా?

జాక : వెళ్లను.

నారా: సరే! (గాద్గదికంగా) నిండా మునిగిన వాడికి చలియేమిటి?

[తలుపు తీస్తాడు. వానజల్లు లోపలికొచ్చి పడుతుంది. వానజల్లుతోపాటు శాంతాదేవి కూడా.]

నారా: (తలుపులు మూస్తూ) వచ్చావా శాంతా!

శాం : ఆఁ! ఆఁ! వచ్చాను నారాయణా! ఎల్లాగో వీలు చేసుకువచ్చాను. (జాకబ్‌ను చూసి భయపడి ఒక్కసారిగా) ఓహ్!

జాక: ఏం శాంతా! అంతగా భయపడుతున్నావు? నే నిక్కడ ఉండడం నీకేమైనా అభ్యంతరమా?

నారా: జాకబ్! అనవసరంగా నువు మా యిద్దరిమధ్యా జోక్యం కలుగజేసుకుంటున్నావు.

జాక: అనవసరంగా నువు మా యిద్దరిమధ్యా అడ్డురాకు డాక్టర్ !

నారా: ఏమిటిది శాంతా!

శాం : (చలిమూలంగాను, భయం మూలంగానూ వణికిపోతుంది.)

జాక: ఆమె చెప్పలేదు. కాదు. చెప్పడం చేతకాదు. నేను చెబుతాను. చెప్పనా శాంతా?

శాం : వ...వ...వద్దు.

జాక: ఏం అంతభయం? ఇంకా బ్రతుకుమీది అభిమానం నీకు చచ్చిపోలేదులావుంది!

శాం: ఓహ్ భగవాన్!

నారా: ఏమిటిది? ఏమిటి మీ సంభాషణ? కొంచెమైనా నాకు అర్థం కావడంలేదు. ఎవరో ఒకరు దయచేసి చెప్పండి. శాంతా కనీసం నువ్వైనా చెప్పవూ?

జాక: నేను చెబుతాను డాక్టర్!

శాం: వద్దు. వద్దు. జాకబ్! నిన్ను బ్రతిమిలాడుకుంటాను. జరిగిపోయిన విషయాలను ఎందుకు నారాయణకుకూడా జ్ఞాపకం చేస్తావు?

నారా: జరిగిపోయిన విషయాలా?!

జాక: అవును. జరిగిపోయిన విషయాలు. బ్రహ్మదేముడి వదనంమీద లేచిన మొటిమల్లాంటివి.

నారా: అంటే?

జాక: పరమ పతివ్రతల జీవిత గ్రంథాల్లోకూడా కొన్ని కాగితాలు పొగచూరి భ్రష్టమై పోయాయి.

నారా: నిజమేనా శాంతాదేవి!

శాం: (తలవంచుకుంటుంది)

జాక: ఆమె నడిగితే ఏం చెప్పగలదు డాక్టర్? నేను చెప్తాను వినండి. వీధినబోయే ఒక అనామకుడు, జీవితం అంటే ఒక్కసారి కళ్ళు తెఱచి అయినా పరిశీలించకముందే, మహారాజసౌధాల్లో కునికిపాట్లు పడుతున్న ఒక సుందరాంగిని చూసి మరులుగొన్నాడు.

శాం అబద్ధం అబద్ధం.

జాక: అబద్ధమా? సరే అయితే! నిజంచెప్పనా? నాల్గుగోడల మధ్య కళ్ళు మూసుకుని భవిష్యత్తులోకి తొంగి చూడటానికి భయపడుతున్న ఒక సుందరుణ్ని చూసి, ఒకనాటి సాయంకాలం, ఓ కులమింటిపిల్ల భ్రమపడి కామోసు, ఓ చిరునవ్వును దానంచేసుకున్నది. కదూ, శాంతాదేవీ!

శాం: అబద్ధం, శుద్ధబద్ధం.

నారా: (మౌనంగా) తర్వాత జాకబ్?

జాక: ఏముంది? మామూలుకథే! వసంతం వెళ్ళిపోయి శిశిరం ముసురుకొన్నది. ఆనందమునేది ఒక ఎండమావిగా తయారయింది. ఆ లక్ష్మీపుత్రి ఇంకో లక్ష్మీపుత్రుణ్ని చూచి, మోజుపడి తాళికట్టించుకుంది.

శాం: జాకబ్! జాకబ్! ఎందుకు నన్నిలా బాధిస్తున్నావు? నేనేం చేశాను నిన్ను? నామీద ఎందుకు నీక్కోపం?

జాక నిన్ను నేనేంచేశాను శాంతాదేవీ? చరిత్రకందిన కొందరినిగురించి నే చెబుతున్నది! అందులో నీకు ప్రమేయమేమిటో?

నారా: ఇదంతా నిజమేనా జాకబ్? (మెల్లగా) అబద్ధమైతే ఎంత బావుండును!

జాక: అబద్ధం చెప్పుకుంటూ జీవితాన్ని గడుపుకునేటంత హీనస్థితికి నేనింకా దిగజారలేదు డాక్టర్! అద్దమున్నది. మొహమున్నది. మచ్చలున్నదీ, లేనిదీ చూచుకోరాదూ?

నారా: (మెల్లగా) శాంతా!

శాం: నారాయణా! నారాయణా! చివరకు నువ్వుకూడా నన్ను బాధిస్తున్నావా? ఇందుకోసమేనా ఇక్కడకు నన్ను పిలిపించింది? ఇదేనా న్యాయం? ఆ ఉత్తరంలో రాసిందంతా అబద్ధమేనా?

జాక: అంతా అబద్ధమే శాంతాదేవీ! అయినా తెలీక అడుగుతాను. పశ్చాత్తాపమూ, ఆత్మప్రక్షాళనమూ-ఇటువంటివన్నీ నిజమనే నమ్ముతున్నావా? అంత మూర్ఖురాలివా? కాలుజారనే జారదు. జారాడా-కూడదీసుకోవటానికి ఏ మూర్ఖుడూ ప్రయత్నించడు. ఎందుకంటావా? ఆ ప్రయత్నం నిష్ఫలమౌతుంది కాబట్టి.

శాం: నిజమేనా డాక్టర్!

నారా: (మౌనం. కళ్లు చింతనిప్పుల్లా తయారవుతున్నాయి.)

శాం: అయ్యో! అయ్యో! ఈ వర్షంలో ఎందుకు తడిసి వచ్చాను? మోసపోయి ఎందుకు ఊబిలో దిగబడ్డాను? (దృఢనిశ్చయానికి వచ్చినట్లుగా) సరే! నారాయణా! జరిగిందేదో జర్గిపోయింది. దానికి భయపడవలసిన అవసరం కూడా లేదు. ఇహనుండీ మాత్రం నీకూ, నాకూ ఏసంబంధమూ లేదు. వస్తాను. వస్తాను, డాక్టర్! (గాద్గదికంగా)
(చీరచెంగుతో కళ్ళు తుడుచుకుంటూ, వీధిద్వారం దగ్గఱకు వస్తుంది. ఇది చూచి జాకబ్

హఠాత్తుగా ఆమెకు అడ్డుపోయి—)

జాక: ఆగండి శాంతాదేవీ! ఎక్కడకు మీ ప్రయాణం?

శాం: (భయం భయంగా) ఇంటికి.

జాక: ఏ ఇంటికి?

శాం: అదేమిటి జాకబ్ అలా మాట్లాడుతున్నావు? ఎన్ని ఇళ్ళున్నాయి గనుక వెళ్ళడానికి? మాయింటికే వెళ్తున్నాను.

జాక: మీ ఇల్లా? అదెక్కడ?

శాం: మా ఇల్లే! అంతా క్రొత్తగా మాట్లాడుతున్నావు?

జాక: అవును అర్థం చేసుకోకపోతే అంతా క్రొత్తగానే ఉంటుంది. ఇదివరలో చెప్పాను నేను నీకు దాసున్నాని. ఇప్పుడు మళ్ళీ చెబుతున్నాను

నీ, నా అన్న భేదం లేదు. గతమూ లేదు; భవిష్యత్తూ లేదు. ఉన్నదల్లా వర్తమానమే. అందులో ఉన్న చుక్కల లెక్క పెడదాం.

శాం: జాకబ్! జాకబ్! ఏమిటీ మాటలు?

జాక: ఏమీ లేదు. యథార్థం వచ్చినిజం. మర్యాద నిల్పుకోవాలని ఉంటే మౌనంగా నావెంటరా. ఎదురునిలిస్తే అన్యాయంగా నీ నూరేళ్ల తాన్ని ఆర్పుకుంటావు.

శాం: జాకబ్!

జాక: లాభం లేదు శాంతాదేవీ! నువ్వు అరచి గీపెట్టినా లాభం లేదు. ఇక్కడ నీకు సహాయం చెసేవాడూ చేయగలిగినవాడూ ఎవ్వడూ లేడు.

శాం: ఏమిటది జాకబ్! ఎందుకింత పిచ్చివాడ వౌతున్నావు?

జాక (ఆమె మీదకు వెళ్తూ) కావలసింది. ఇదివరలో నే పిచ్చివాడిని కావలసింది. కానీ అదృష్టవశాత్తూ కాలేదు. ఈ సుముహూర్తం కోసం ఎదురు చూస్తూ కాలేదు.

శాం: జాకబ్! జాకబ్! నారాయణా! నారాయణా!

జాక నారాయణ నీ కేవిధంగానూ సహాయం చేయ లేడు శాంతాదేవీ! పాపం భ్రమపడుతున్నావు.

శాం: నారాయణా! దణ్ణం పెడతాను నాచర్మం వొలిచి నీకు చెప్పులు కుట్టించి యిస్తాను. వీడి బారినుండి నన్ను తప్పించు—

జాక: లాభం లేదు శాంతా:

శాం: నారాయణా! నారాయణా! నీ చిన్ననాటి శాంత!

[నారాయణ మహా ఉద్రేకపడిపోతున్నాడు కర్తవ్యం తెలీక కొట్టుమిట్టాడుతున్నాడు]

శాం నీ శాంత... ఆదుకోలేవా నారాయణా! చూస్తూ చూస్తూ ఈ కిరాతకుడికి అప్పగిస్తావా? నారాయణా! ఆలోచించు ఆలోచించు నారాయణా!

నారా: (ఏదో నిర్ణయానికి వచ్చినట్లుగా పెద్దగా) జాకబ్!

జాక: ఏం? ముసలమ్మకు కాళ్ళు మొలుస్తున్నాయా?

నారా: షటప్! మర్యాదగా శాంతను వదిలి పెట్టు

జాక: వదిలి పెట్టకపోతే!

నారా: (ఏం చెప్పటానికి తోచదు)

జాక: ఊఁ; చెప్పు! ఏం చేస్తావో చెప్పు ధీరులు బయల్దేరారు!

నారా: జాకబ్!

జాక: నీ ప్రాణాలు నాచేతుల్లో వున్నాయి. ఒక్క మాట, ఒక్క మాటచాలు. నీ ఆశా సౌధాలు మొత్తమూ కూలిపోతాయి.

నారా: అయినా సరే వీల్లేదు. నువ్వనుకున్నట్లుగా జరగడానికి వీల్లేదు. నే నెలాగూ సర్వనాశనమయ్యాను. శాంతకూడా నాశనం కావడం నాకిష్టం లేదు. అవును కానివ్వను. శాంతను నాశనం కానివ్వను.

[బయటనుంచి మార్షల్ స్వరం—కర్కశంగా "డాక్టర్!"

[నారాయణకు ఏం చేయాలో తోచదు. శాంత వణికి పోతుంటుంది]

జాక: ఇప్పటికైనా—నే చెప్పిందానికి ఒప్పుకో శాంతా! అంతా సవ్యంగా ఉంటుంది లేదా సర్వ నాశనమౌతావు.

శాం: ఛీ! ఛీ!

జాక: సరే అయితే. కర్మ మంచిని సూచిస్తుంటే— బుద్ధి పెడదారి తొక్కుతున్నది.

[తెలుపు తీయడానికి వెళ్తాడు]

శాం: అయ్యో! అయ్యో!!

[బయటనుండి మార్షల్ మరింత బిగ్గరగా—
"డాక్టర్!"

నారా : జాకబ్! ఇది కాదు సమయం...కత్తులు తీర్చుకోవడానికి ఆలోచించు—

జాక : ఏమిటి శాంతా! ఏమిటి నీ జవాబు?

[నారాయణ హఠాత్తుగా లోపలి గదిలోకి వెళతాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం; శ్మశాన ప్రశాంతత.]

జాక : చెప్పు శాంతా! ఏం నిర్ణయించుకున్నావు?

మార్ష : డాక్టర్! డాక్టర్! (ఉరుమురిమిన చప్పుడు)

జాక : త్వరగా చెప్పు—అదిగో మార్షల్ స్వరం విన్నావా? ఆలస్యం చేయకు. ఏమిటి? తీయనా తలుపు?

శాం : వద్దు. వద్దు.

జాక : అయితే చెప్పు! అంగీకారమేనా?

శాం : భగవాన్! భగవాన్! ఏమిటిది?

[లోపలినుంచి డాక్టర్ రివాల్వరుతో ప్రవేశిస్తూ]

నారా : ఆగు జాకబ్! నువ్వాడిందల్లా ఆటకాదు. తలుపు తీశావా నీ ప్రాణాలు నీవికావు. జాగ్రత్త.

[జాకబ్ చూస్తాడు. పరిస్థితుల నర్థం చేసుకుంటాడు. మెల్లగా]

జాక : డామిట్! కథ అడ్డం తిరుగుతున్నది.

నారా : ఇటు శాంతా! దొడ్డిదారిగుండా ఇల్లు చేరుకుందువుగాని.

శాం : (నిట్టూర్చి) పద నారాయణా!

(వీరిద్దరూ వెనుకకు తిరుగుతారు. ఇదే అవకాశంగా తీసుకుని జాకబ్ తలుపు తీయబోతాడు. కొద్ది శబ్దం హఠాత్తుగా నారాయణ వెనుకకు తిరిగి]

నారా : ఫూల్! [పేలుస్తాడు. జాకబ్ ఎంతగా తప్పించుకుందామన్నా గుండు బుజాన్ని దూసుకుపోతుంది. అట్లాగే పట్టుకుని అతడు తలుపు తీస్తాడు. మార్షల్ లోపలికి ప్రవేశిస్తాడు అతనికి అంతా అయోమయంగా ఉంది.)

మార్ష : ఏమిటిది? ఏమిటిదంతా? ఓహ్! నువ్వా జాకబ్ ఏమిటీ రక్తం?

[మార్షల్‌ను చూచి నారాయణా, శాంతా సెం. I గదిలోనుంచి పారిపోబోతారు.]

జాక : (బాధతో నే) అటు. అటు చూడండి, అదిగో—పోతున్నారు. పోతున్నారు. వాళ్ళు...వాళ్ళను పట్టుకోండి. పట్టుకోండి మార్షల్!

మా : (తన పిస్టల్ తీసి వాళ్ల వెంటపడి) ఆగండి! ఎవరక్కడ? (నారాయణా, శాంతా లాభంలేదని ఆగిపోతారు)

మా : (వారిద్దరినీ చూచి ఆశ్చర్యపడి) ఓహ్! మీరు! శాంతా! అనుకున్నట్లుగానే నువ్విక్కడకు వచ్చావన్నమాట!

శాం : ఏమండీ!

మా : దుర్మార్గురాలా! ఇంకా ఎందుకు ఈ కల్లబొల్లి కన్నీళ్ళు? పారిపోదామనుకున్నారు. జాకబ్ అసుతిగిలాడుతుంది. అతన్ని చంపటానికి ప్రయత్నించారు దుర్మార్గులు! ఏం డాక్టర్! నీకూ ఈ పిదపబుద్ధి పుట్టింది! మర్యాదహీనుడివి. ఛీ! ఛీ! అదిగో అటుచూడండి. మీ పాపానికి (జాకబ్ బాధగా గట్టిగా మూలుగుతున్నాడు) ఎవరు ఫలితం అనుభవించవలసివస్తున్నదో?

శాం : ఏమండీ! ఏమండీ! ఒక్కమాట. ఒక్కమాట వినండి. నే చెప్పేది వినండి.

మా : ఇంకా ఎందుకు వినడం ప్రత్యక్షంగా కనిపిస్తున్నదానికి? ఎక్కడకు వెళ్ళావని డ్రైవర్నడిగాను. బెంబేలుపడ్డాడు. చెమటలు పోశాయి. పాపం! చివరకు చెప్పాడు. నమ్మలేకపోయాను. ఈ భ్రష్టుడితో ఒంటరిగా, రాత్రిపూట మాట్లాడవలసిన విషయాలు ఏముంటాయిగనుక! అందుకనే వచ్చాను అసలు సంగతి చూద్దామని. చూశాను. ఏది నమ్మలేకపోయానో అదే చూశాను. చాలు...ఇంకా ఎందుకు నీ మాటలు వినడం? ఇంతవరకూ నన్ను మోసగిస్తూవచ్చావు. ఆ మోసం చాలు.

శాం : ఏమండీ...

మా : అవును. ఆ మోసం చాలు. ఆడుతున్న కపట నాటకం అంత్యఘట్టంలో పడింది. పాపానికి ప్రాయశ్చిత్తం లభించబోతున్నది.

శాం : (ఏడుస్తుంటుంది)

నారా: ప్రాయశ్చిత్తమా?

మా : ఆఁ! ఎవరెవరు కావాలని ఈపాపానికి దోహదం చేశారో, వారినందరినీ——

శాం : వద్దు ... వద్దు ... అంతటి శిక్ష విధించకండి. నేనేమీ పాపం చేయలేదు. పాపం చెయ్యలేను కూడా!

జాక : (బాధపడుతూ, మూలుగుతూ) మార్షల్ ఆడదాని మాటలు నమ్మబోకు. చేతలు విషపూరితాలు.

నారా: మార్షల్! నేను చెడ్డవాణ్ణే కావచ్చు. నా జీవితంలో నీతిఅనేది లోపించవచ్చు కానీ ఒక్క మాట చెబుతాను. నమ్ముతావా?

జాక: (మెల్లగా లేస్తూ) మార్షల్! నమ్మబోకు. ఆ డాక్టర్‌ను నమ్మబోకు. నిలువెల్లా విషమే అతనికి.

నారా: ఐనా కోరలుడిగిన నన్ను చూసి భయపడవలసిన అగత్యం లేదు మార్షల్, నీకు ఉదారహృదయముడవై నే చెప్పేది వింటావా మంచిది. లేదూ నువు పట్టినకుందేటికి మూడే కాళ్ళంటావా మరీమంచిది నవ్వుతూ మరణించడానికి ఒప్పుకుంటాను.

మార్ష: ఏమిటి నువు చెప్పదలచుకున్నది?

నారా: ఏమీ లేదు. చాలా చిన్నవిషయం. ప్రతి మానవుడిలోనూ రెండు విరుద్ధశక్తులు పనిచేస్తుంటాయి. అందరికీ అవి తెలిసినవే. మంచీ-చెడూ. పగటిపూట మంచికి యౌవనంవస్తే, రాత్రిపూట చెడు రెక్కలు తగిలించుకుంటుంది.

మార్ష: ఇంతకూ అసలుసంగతి ఏమిటి?

నారా: తొందరపడకు మార్షల్! చెప్పేది జాగ్రత్తగా విను. మంచీ——చెడూ అనే యీ రెండు విరుద్ధశక్తులూ ఆత్మ చేత కాదు నిగ్రహింపబడేది. బుద్ధికి కాదు వాటిమీద అధికారంవున్నది. దేహంలో పంచేంద్రియాలని అంటుంటామే ... వాటి మూలంగానే తటస్థించేది మంచిగానీ చెడుగానీ. నీవొక మల్లెపొదదగ్గరకు వెళ్తావు యాదృచ్ఛికంగా. మల్లెవాసన తటాలున నిను అలుముకుంటుంది. అక్కడ ఘ్రాణేంద్రియం నీ సర్వస్వాన్నీ తనఅదుపులో పెట్టుకుంటుంది. మిగిలిన వాటి విషయంకూడా అంతే!

మార్ష: (విసుగ్గా) ఏమిటీ అర్థంలేని తత్వం?

నారా: వస్తున్నాను. అసలు విషయంలోకి వస్తున్నాను, స్త్రీ పురుష సంబంధంకూడా అంతే! ప్రేమ. అభిమానమూ ఇవి పూర్వజన్మ సంస్కారం మూలంగా ఉద్భవిస్తాయి. ఇక పశుప్రవృత్తి అంటావా? దానికి కారణం అశాశ్వతమైన ఈ దేహమే!

మార్ష: ఏమిటయ్యా ఇది?

నారా: ఏమిటా? మేము కామంతో కాదు దగ్గరకు చేరింది. ప్రేమతో అని... చెప్పటానికి. ఇక్కడ ఇంద్రియాలు కాదు ప్రాధాన్యం వహిస్తున్నది ఆత్మానాత్మ వివేకమనేది.

మార్ష: నారాయణా! ఇదంతా నాకనవసరం. బాహ్యానికి కనిపిస్తున్నదీ, నలుగురి దృష్టిలో తప్పుగా పరిగణింపబడేది-మీరుచేసేపని. అయినా నాకూ నావంశగౌరవానికీ సంబంధించిన విషయమిది. అయినప్పుడు వేదాంతం కాదు నాక్కావలసింది. మీరు తప్పుచేశారని ఒప్పుకుంటారా లేదా అన్నవిషయం.

జాక : దీనికి వాళ్ళనడగాలా మార్షల్! ప్రేమట ప్రేమ! ఒక స్త్రీ ఎంతమందిని ప్రేమిస్తుంది? పదిమందినా? జీవితంలో వేదాంతమనేది దొరికింది మనకందరికీ, అవసరం ఉన్నా లేకపోయినా వల్లించడానికి, అసలు ప్రేమంటే ఏమిటి? ఓ నీళ్ళమూట! ఓ కుందేటికొమ్ము! పశుచర్యలో ప్రేమకోసం వెతుక్కోవడం ఇసుకలోనుండి నూనెను పిండుకోవడమే! వీళ్ళను నమ్మకండి మార్షల్!——పచ్చి అబద్ధాలను మాట్లాడుతున్నారు. మిమ్మల్ని మాటలతో మోసం చేయాలని చూస్తున్నారు. మీ కనుగప్పి పారిపోవడానికి దారి వెతుక్కుంటున్నారు.

మార్ష : ఏం శాంతా! నువ్వేం చెప్తావు దీనికి సమాధానం? చేసింది తప్పని ఒప్పుకుంటావా?

శాం : నన్ను మీరు నమ్మగలరా!

మార్ష : నువ్వు నిజం చెపితే!

శాం : నిజమే చెబుతాను, సర్వం సమాప్తమైపోతూ, జీవితమే నాశనం కాబోతున్న తరుణంలో కూడా అబద్ధం చెబుతానా? అబద్ధం చెబుతానని ఎలా వూహించుకుంటున్నారు! దశాబ్దంగా సాగిన మన సంసారం, చివరకు అనుమానాన్నన్నమాట పండించింది! అవును మరి ఆడదాని బ్రతుకే

అంత! కూపస్థమండూకం మాకన్న ఎంతో సుఖం అనుభవిస్తుంది.

మార్ష: ఏమిటి; తప్పుచేశావా—లేదా? అదీ నేనడుగుతున్నది—ఉపన్యాసం కాదు.

శాం: (ఏడుస్తూ) అసలు నేను తప్పుచేశానని ఎలా ఊహించుకోగలుగుతున్నారు? జ్ఞానంలోనూ, అనుభవంలోనూ, మనతోడి వారలను అర్థం చేసుకోవడంలోనూ, ఇంతగా మనం పరిణతి చెందాం! ఇది మన సంస్కారం! కష్టసుఖాలను రెండింటినీ సమానంగా పంచుకుంటానని మీతో కలిసి ప్రమాణం చేసినతర్వాత, మళ్లా నేను మాట తప్పుతానని, కాలు జారుతానని ఎందుకు వూహించుకుంటున్నారు? ఆ మాత్రం నా మీద నమ్మకం వుంచలేరూ? ప్రొద్దున లేచింది మొదలు, పదిమంది మధ్య నవ్వుతూ, నవ్విస్తూ మీరు కాలం గడపాలి. నేనేమైనా అనుమానిస్తున్నానా? అనుమానం తప్ప మనకిక చేయవలసిన బాధ్యత, కర్తవ్యం ఏమీ లేవా? చెప్పండి. ఏ మనసుకు సమాధానం చెప్పుకుని ఆ తరువాత నాకు చెప్పండి. చెప్పండి...

జాక: నమ్మకండి మార్షల్! ఈ ఆడవాళ్ల మాటలు నమ్మకండి, మగవాడికి ఈ ప్రకృతిమీదవున్న అధికారమూ, హక్కూ ఆడదానికి లేవు సమానత్వమనేది సిద్ధించని ఓ ఆదర్శం. మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి! జీవితంలో అందరూ అందలం ఎక్కాలనుకునేవారే! మరి మోసేవారు? ఈ బాధ్యతా నిర్వహణకే స్త్రీ సృష్టింపబడింది. ఈ బాధ్యతనే మీ శాంత నెఱవేర్చ లేకపోయింది. అందుచేతనే ఆమెను మీరు శిక్షించాలి. అప్పుడే మీరు ధర్మభ్రష్టులు కాకుండా ఉంటారు.

శాం: నమ్మకండి. ఆ నీచుడి మాటలు నమ్మకండి. ఒక దుష్టప్రభావాన్ని ప్రసరింప జేస్తాడువాడు!

మార్ష: ఎందుకని? నువుచెప్పేదే నిజంఎందుకు కావాలి? నమ్ముతున్నాను. అతనుచెప్పిన ప్రతిఅక్షరాన్ని నమ్ముతున్నాను.

శాం: (భయంగా) నమ్ముతున్నారా? అయ్యో!

మార్ష: అవును. అతని మాటలు నిజం. మీరు వంచకులు మోసం చేయడమే మీ వృత్తి. అటువంటి... అటువంటి మీరు ...మీరు ఎందుకు బ్రతకాలి? బ్రతికి ఎవరిని ఉద్ధరిస్తారు?

శాం: అయ్యో! అయ్యో! భగవాన్! వద్దు...వద్దు. అంతటి ఘోరకార్యం—

మార్ష: చేస్తాను. నిన్ను...నిన్ను...శాంతా!

[పెద్దగా అరుపు. ఆమెను సమీపించి, రాక్షస ప్రవృత్తి కలవాడిలాగా ఆమె గొంతు పట్టి నొక్కుతుంటాడు. ఆమె గిలాగిలా పక్షిలా తన్నుకుంటుంది. నారాయణ అది చూచి క్షణంసేపు ప్రాన్పడిపోయినా తిరిగి కర్తవ్యాన్ని పుంజుకుని మార్షల్‌ను పట్టుకుని ఇవతలకు లాగుతూ—]

నారా: మార్షల్! మార్షల్! నా మాట విను. నామాట విను మార్షల్! దీని కంతటికీ కారణం ఆమె కాదు. ఆమె కాదు మార్షల్! నేను—నన్ను చంపు. నీ యిష్ట మొచ్చినట్లు హింసించి నన్ను చంపు—

మార్ష: చంపుతాను. నిన్నూ చంపుతాను. ముందు దీన్ని చంపి..

నారా: (పిచ్చి కోపంతో) చంపుతావా? నా శాంతను చంపుతావా? దుర్మార్గుడా!

[అమానుషమైన శక్తితో మార్షల్ మీదకలియబడి అతన్ని ఓమూలకు నెట్టి వేస్తాడు. జాకబ్ మార్షల్‌కు సహాయం చేద్దామన్నా చేయలేక, మరో మూల మూలుగుతుంటాడు. శాంత వణికి పోతుంటుంది. నారాయణ మార్షల్ వేపు చూస్తూ:]

నారా: దుర్మార్గుడా! అన్నీ సవ్యంగా ఉన్నంతవరకే అధికారాలూ, గౌరవాలూ! అది గుర్తించక పోయావు. హీనుడివయ్యావు. వెళ్లిపో. ఇక్కడి నుంచి వెళ్ళిపో మర్యాదగా. నీ శాంతను తీసుకొని తిరిగిచూడకుండా వెళ్ళిపో!

జాక: పిరికివాడిలాగా భయపడి పారిపోతావామార్షల్!

మార్ష: (పిస్టల్ గురిపెట్టూ) పారిపోతానా? ఈ కుంకేళ్ళకు భయపడి.

[ఇదిచూచి నారాయణ శాంతకు అడ్డుగా నిలుస్తాడు] నారాయణా! శాంతకు అడ్డు తొలుగు నిన్ను నేచంపను అడ్డుతొలుగు.

నారా: పిచ్చివాడా! నువ్వు నన్ను చంపగలంతటి శక్తి

మంతుడవా? తల్చుకుంటే నిన్ను క్షణాలమీద నేను పరలోకానికి పంపగలను. అది ఆలోచించుకుని సాహసం చెయ్!

మార్ష: అట్లాగా? చూస్తాను అది ఎంతవరకు నిజమో చూస్తాను.

[ప్రేల్చబోతాడు. ఇంతలో ప్రెసిడెంట్ ప్రవేశం. బయట కారువెళ్ళిపోయినశబ్దం. అతన్ని చూడగానే అందరూ సర్దుకోవడానికి ప్రయత్నిస్తారు. కాని ముఖకవళికలు మారలేదు. జాకబ్ అతి కష్టంమీద, మెల్లగానడుస్తూ, ఒక కుర్చీని ఆసరా చేసుకుని, నిలబడి చేతికి ఓ రుమాలు బిగించుకుంటాడు]

ప్రెసి: అబ్బబ్బ! ఏమిచలి! ఏమిగాలి! ప్రాణాలు గడ్డకట్టుకుపోతుంటేను! పాడువర్షం. సముద్రంలో సుడిగుండం లేచిందట—ప్రకృతి మనమీద పగదీర్చుకుంటున్నది (అందరినీ చూచి, విస్మయంతో) అరె! ఇదేమిటి? కావలసినవాళ్ళూ, రావలసినవాళ్ళూ అందరూ ఒకచోటే సమావేశమయ్యారే! ఏమిటి మార్షల్ నువ్వెందుకు వచ్చినట్లు? నాతో చెప్పనైనా చెప్పలేదు.

మార్ష: అబ్బే! ఏమీలేదండి చెప్పడానికి అంతముఖ్య విషయం కాదు కదా అని. డాక్టరు నారాయణ గారితో కాస్త మాట్లాడవలసి వచ్చింది. వాతావరణమంత బాగలేకపోయిన రాకతప్పింది కాదు.

ప్రెసి: ఓహ్హో! అల్లాగా?

నారా: (ప్రెసిడెంట్‌ను సమీపించి, విష్‌చేసి) అనుకున్నట్లుగా వచ్చారు.

ప్రెసి: అవును మరి. అవసరం మానవుణ్ని బానిసగా చేసుకుంటుంది.

జాక: క్షమించండి—కల్పించుకుంటున్నందుకు; అంత అవసరమేమిటో!

ప్రెసి: ఇది నీ విషయం కాదు.

జాక: క్షమించండి నా విషయమే!

ప్రెసి: ఏమిటే?

జాక: అవును మీరేం మాట్లాడగలరు నావిషయం తప్ప? మీకు ఈ ప్రపంచంలో కావలసిందేది? నేను అహోరాత్రులు కష్టించి కనిపెట్టిన ఈ అపూర్వయంత్రం తప్ప? నాకు తెలుసు ప్రెసిడెంట్—మీరు చెప్పకపోయినా ఆమాత్రం నేనూహించుకోగలను.

నారా: ఏమిటే? ఏమిటి నువ్వంటున్నది? ఆ యంత్రం నువు కనిపెట్టావా? ఫూల్! తిన్నయింటి వాసాలు లెక్కపెట్టదలుస్తున్నావు? ప్రెసిడెంట్! నమ్మకండి వీడిమాటలు. ఈ కృతఘ్నుడి మాటలు నమ్మకండి.

జాక: మాటలు అనవసరంగా పారేసుకోకు డాక్టర్! – మళ్ళీ అవసరం రావచ్చు.

నారా: స్కౌండ్రల్! పరాయివాళ్ళ బిడ్డను నీ బిడ్డే అని చెప్పుకోడానికి అసలు నీకు నోరెల్లా వస్తున్నదీ అని. పాముకు పాలుపోసి పెంచాను.

ప్రెసి: నువ్వు కనిపెట్టిన యంత్రమా? మిష్టర్ జాకబ్! చాలా ఆశ్చర్యకరంగా మట్లాడుతున్నావు! నేను విన్నదీ, స్వయంగా డాక్టర్ నారాయణ చెప్పింది కూడా తనే యీ యంత్రాన్ని కనిపెట్టారని.

మార్ష: కాదు ప్రెసిడెంట్ – డాక్టరు చెప్పేదంతా శుద్ధ అబద్ధం.

ప్రెసి: ఎందుకనో?

మార్ష: నేను నిన్న సాయంకాలం వచ్చి అడిగాను. పరిశోధనా ఫలితం ఏమైందని. ఎంతో ప్రేమపూర్వకంగా అడిగాను. కనిపెట్టింది ప్రభుత్వాధీనం చేసి, తద్వారా వచ్చిన ప్రతిఫలంతో జీవితమంతా హాయిగాగడపమని, సలహాయిస్తూ; ఎంతో అభిమానంతో అడిగాను. ససేమిరా తను కనిపెట్ట లేదన్నాడు. తాను కనిపెట్టనే కనిపెట్ట లేదన్నాడు. అటువంటివాడు – పది సంవత్సరాలుగా చేయలేని పని – ఒక్క రాత్రిలో చేయగలిగాడంటే నమ్మడం శక్యమేనా ఆలోచించండి ప్రెసిడెంట్.

ప్రెసి: కావచ్చు. శాస్త్రజ్ఞుల పరిశోధన లన్నీ విజయం పొందింది యాదృచ్ఛికంగానే.

జాక: (శాంతను సమీపించి, అతిరహస్యం చెప్తున్నట్లు) ఇంకొక్క అవకాశం ఇస్తున్నాను శాంతాదేవి – ఆలోచించుకుని చెప్పు. "ఈ యంత్రాన్ని కనిపెట్టింది డాక్టరు నారాయణ కాదు. జాకబ్–" అని ప్రెసిడెంటుతో చెప్పగలవా? ఇహ యీ జీవితంలో నీ జోలికిరాను

నా మాటనమ్ము.

శాంత: నేను జీవించి ఉండగా అటువంటి కిరాతానికి ఒడిగట్టను.

జాక: ఆలోచించుకుని చెప్పు. (ప్రకాశంగా) నేను చెబుతున్నది అబద్ధమనే అనుకుంటున్నారా ?- మిష్టర్ ప్రెసిడెంట్! అదుగో శ్రీమతి శాంతా దేవిగారున్నారు. మార్షల్ తివారీగారున్నారు. పేలవమైన వాదనచేస్తూన్న డాక్టర్ వున్నారు. అడగండి - అడగండి. ప్రెసిడెంట్!

ప్ర శాంతాదేవిగారికీ విషయాలెలా తెలుసు? ఏం శాం

నారా: నువ్వూ నాకు వ్యతిరేకమైనావా శాంతా దేవి!

మార్ష: (శాంతను సమీపించి మెల్లగా) చూడుశాంతా! పూర్వపు కలతలు మర్చిపోయి మళ్ళీ మనం ఈ జీవితాన్ని అనుభవిద్దాం. ఇది నీకూ ఇష్టమే కదూ ?

శాం: నిజంగానా ?

మార్ష: ఆ! కానీ ఒక్క షరతుమీద.

శాం: ఏమిటది ?

మార్ష: ఏమీ లేదు. చాలా చిన్న విషయం. జాకబ్ అది కనిపెట్టాడని చెప్పు. అంతే !

శాం: (ఆశ్చర్యంగా) ఆఁ!

మార్ష: నారాయణ అది కనిపెట్టలేదని చెప్పు. చాలా చిన్న సంగతి.

శాం: అసంభవం.

మార్ష: ఆలోచించుకుని చెప్పు.

శాం: అబద్ధాన్ని నిజమని నిరూపించలేను.

మార్ష: నీ కర్మ.

జాక: చూడండి ప్రెసిడెంట్! నిజాన్ని బయటకు చెప్పడానికి బిడియపడి తనభర్తతో రహస్యంగా చెబుతున్నది. వినండి.

ప్రెసి: నిజమేనా మార్షల్ ?

నారా: శాంతా!

మార్ష: నిజమే.

శాం: (ఉద్విగ్నురాలై) అబద్ధం!

మార్ష: మూర్ఖురాలా! పిచ్చిదానివై పట్టున్నావు.

నారా: శాంతా! నాపాలిటి దేవతలాగా నన్ను కాపాడావు.

జాక: నాటకం ఇంతటితో ముగియలేదు డాక్టర్! నిరూపించండి. ఈ యంత్రాన్ని మీరే నిర్మించారని నిరూపించుకోండి.

ప్రెసి: నిజమే. అది సమంజసంగా ఉంటుంది.

నారా: మంచిది. ఎవరిబిడ్డను వారే గుర్తుపట్టలేరా ప్రెసిడెంట్! కానీ ఒక్క మనవి. జాకబ్‌ను నేను కొన్ని ప్రశ్నలు వేస్తాను. సమాధానం చెప్పమనండి.

జాక: నేనే ఎందుకు వేయకూడదు మిమ్మల్ని ?

నారా: కాదు. నేను ముందు వేయదలుచుకున్నాను. నువ్వు సమాధానం చెప్పాలి. చెప్పితీరాలి.

ప్రెసి: డాక్టర్ ప్రశ్నలకు సమాధానం చెప్పు జాకబ్!

జాక (అయిష్టంగానే) సరే. చెబుతాను. అడగండి డాక్టర్.

నారా: ఈ యంత్రాన్ని కనిపెట్టడంలో అసలు ఉద్దేశ్యమేమిటి?

జాక: దేముడు మానవుణ్ణి ఎందుకు సృష్టించాడో, అందుకే దీన్ని నేను సృష్టించాను.

నారా: ఈయంత్రం ఏమేం చేయగలుగుతుంది?

జాక: ఇది చేయలేనిదంటూమాత్రం ఏమీ లేదు.

నారా: దానినిర్మాణం చెప్పగలవా?

జాక: అది చెప్పినందువల్ల ప్రస్తుతానికి ఒరిగే ప్రయోజనమేమీ లేదు.

నారా: ఏమిటిమిష్టర్ ప్రెసిడెంట్ ఈ సమాధానాలు?

ప్రెసి: ఇంకా అడగండి డాక్టర్ !

నారా: ఇదెలా పనిచేస్తుందో చేసి చూపించగలవా?

ప్రెసి: చక్కటిప్రశ్న. వెళ్లిచూపించు. మిష్టర్ జాకబ్! [జాకబ్ వాళ్ళవేపు ఒక్కసారి చూసి, ఆయంత్రందగ్గరకు వెళ్తాడు. నీలం బల్బు, ఎఱ్ఱ బల్బు ఆరిపోయి వుంటాయి. తెల్లబల్బుమాత్రం వెలుగుతుంటుంది. జాకబ్ క్షణంసేపు వాటికేసి చూసి, ఏంచేయాలో తోచక, ఎఱ్ఱబల్బు వెలిగే స్విచ్ వేయబోతాడు. అది డాక్టర్ చూసి కంగారుగా]

నారా: ఆగు! ఆగు! జాకబ్! ప్రమాదం. ప్రమాదమది వేస్తే. సర్వనాశనం. సర్వనాశన మాతుంది అది వేసే.

శాం:
ప్రెసి: } ఆఁ!
మార:

నారా : అవును. ఆ స్విచ్ వేస్తే లోపల 'చెయిన్ రియాక్షన్' జరుగుతుంది. యంత్రం పేలుతుంది. ఫలితంగా ఈ ప్రదేశమంతా ఓ శ్మశానంగా తయారౌతుంది. (జాకబ్ అది వింటాడు. ఓ చిన్న మందహాసం కొద్దిపాటి ఆలోచన. అతని వదనం క్రమంగా ఎఱ్ఱనౌతుంటుంది. మృత్యు దేవత అతని కళ్లనుండి ప్రపంచాన్ని సూచిస్తుంటుంది. జాకబ్ మెల్లమెల్లగా యంత్రాన్ని, ఆ ఎఱ్ఱబల్బును సమీపిస్తుంటాడు. డాక్టర్ నారాయణ అదిచూచి, అతని ఇంగితాన్ని గ్రహించి, అతనిదగ్గఱకు పరుగెత్తుకు వెళ్ళబోయాడు; ఇంతలో అది మార్షల్ చూచి:)

మార్ష : (పిస్టల్ తీసి) ఆగు డాక్టర్! మరణానికి ఎదురు నడవబోకు. ఆగిపో!

నారా : జాకబ్! జాకబ్! వద్దు వద్దు—ఆసాహసంవద్దు. (పరుగెత్తబోతాడు. మార్షల్ పిస్టల్ ప్రేలుస్తాడు. డాక్టర్ క్రిందపడిపోతూ)

నారా: అబ్బ! దుర్మార్గుడా! తప్పదు. తప్పదు. పాప ఫలం అనుభవించి తీర్తావు. అబ్బ! శాంతా!

ప్రెసి : (ఒక్కసారిగా) మార్షల్! ఏమిటిది? ఏమిటీ ఘోరం? పడేయ్! నీ పిస్టల్ కింద పడేయ్!

మార్ష : జాకబ్! జాకబ్! త్వరగా కానీ. త్వరగా ఊ! త్వరగా!

ప్రెసి : మార్షల్! డౌన్ యువర్ పిస్టల్!

మార్ష : జాకబ్! ఊఁ! త్వరపడు జాకబ్!

[జాకబ్ పిచ్చిగా యంత్రం దగ్గరకు వెళ్తాడు. నారాయణ అది చూస్తాడు. అతని వదనంలో కోటి భావాలు! ఒక్కసారిగా లేని ఓపిక తెచ్చుకుని శాంతను సమీపించి, ఆమెను బలంగా మొఖటి ద్వారం గుండా బయటికి విసిరేస్తాడు. ఆమె అసహాయంగా కేక పెట్టుంది]

ప్రెసి : డౌన్ విత్ యువర్ పిస్టల్! మిస్టర్ మార్షల్! [పిసలు పేలుస్తాడు. అదేసమయంలో జాకబ్ కూడా ఎఱ్ఱ బల్బు వెలిగే స్విచ్ నొక్కుతాడు. ఎఱ్ఱ బల్బు వెలుగుతుంది. ఓ ఉరుము ఉరిమింది. వానజల్లు లోపలికొచ్చి పడింది. ప్రళయం కళ్ళు తెఱిచింది. యంత్రంలోని తీగాలు తెగిపోయినవి. రంగంమీద వున్న ఆ ముగ్గురూ ఏమాత్రం శబ్దం లేకుండా అలానే నేల కూలిపోయారు. కొద్ది నిశ్శబ్దం.]

శాం : (మెల్లగా, అడుగులో అడుగు వేసుకుంటూ ప్రవేశించి, గద్గదంగా) అయిపోయిందా? సర్వమూ సమాప్తమై పోయిందా? ఏమిటి మిగిలింది.? నైరాశ్యమా? కన్నీళ్ళా? భగవంతుడా! ఇందుకు ఎవరు కారణం? శాస్త్ర విజ్ఞానమా? మనో వికారమా? ఎవరు కారణం దీనికి? నా పాత్ర ఏమిటి ఇందులో?—నేనా కారణం దీనికి. భగవంతుడా! దారి చూపించు. పునః సృష్టి ప్రారంభించు.

[తెర]

# దైవపురుషకారములు

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

"వివాహములు స్వర్గములో సిద్ధమగునందురు. నరకములో సహా కొన్ని సిద్ధమగునేమో?"

తదేక ధ్యానములో జాతకదశల గుణించుచుండిన నేను తలయెత్తి నా యెదుట అల్లంతదూరమున ఆసీనురాలైయున్న తరుణీ మూర్తిని చూచితిని. బ్రహ్మతో విరసము కలిగి భూమికి దిగివచ్చిన సరస్వతి వలె ఆమె మాపట్టినది. ఆమె జాతకమునే నేనపుడు గుణించుచుండుట.

"జాతక గ్రహములు దశల ననుసరించి వివాహముల ఫలములు నడచునని అర్థము. ఇచట నరకమునకు ప్రసక్తిలేదు." అంటిని.

"నా జాతకములో గ్రహములు అన్నీ క్రూరముగానున్నవేమో?"

"దశలు మారుచుండును. శుభాశుభఫలములు శాశ్వతములు కావు."

"నా జాతకము మాట ఏమో కాని, మా నాయనగారి జాతకములో మాత్రము ఒక గ్రహము మహాక్రూరమైనది కలదని ఎరుగుదును."

ఆశ్చర్యముతో, "ఏ గ్రహము?" అని అడిగితిని.

"మీ నవగ్రహములు కాదు లెండి." అని తల వంచి, కొంత వక్రముగా పెదవి విరిచి, "ద-శ మ-గ్రహము" అని మెల్లగా ఆమె జారబలికినది.

నాకు నవ్వు వచ్చెను. కాని, ఆపుకొంటిని, ఆమె మనసు నొచ్చునేమో, అని.

"సదా క్రూరో, సదావక్రీ,
కన్యారాశి మపేక్షతే,
తృతీయైకావశే దృష్టిః
జామాతా, దశమగ్రహః"

సాధారణముగా అల్లుని తనపు ధార్ష్ట్యమును ఎగతాళిచేయు పైచాటు శ్లోకమును మనసులో నుంచుకొని, తన భర్త నిర్దయుడని ఆమె వ్యంగ్యముగా శూచించిన దనుకొని.

"ఆ గ్రహము చాలా మంచిదమ్మా." అంటిని, గంభీరముగా.

"అయితే, సుమతి శతకమును మరచినారు." అని వెంటనే మందస్మితముగా ఆమె ప్రతి ఇచ్చినది.

"మరచిపోలేదమ్మా!

'అల్లుని మంచి తనంబును,

గొల్లని సాహిత్య విద్య, కోమలి నిజమున్.' అను సంతలో, ఆమె తటాలున చిన్నగా నాలుక కరచి.

"నేను మహాకవినాత్మురాలను. కోమలిని కాను." అని సమన్వయము చేసి, మీ పనికి అభ్యంతరము చేయుచున్నానేమో?" అనెను.

ఆమె చాతుర్యమునకు సంతసించి, జాతకదశల గుణించితిని.

ఇదే ఆమె సాయనజాతకము.

| | | | |
|---|---|---|---|
| వరుణ 1.45 (వ) | | కే 5-37<br>మన్మథ 12-58 | I 9-41 |
| X 28-27 | (సాయనము) | | యమ 8-40 |
| కు 16-20 | కథా నాయకురాలి జాతక చక్రము | | ఇంద్ర 13-45 |
| శు 20-5<br>బు 0-50(వ) | చ 4-6<br>రా 5-47<br>ర 16-51-25 | | గు 14-28<br>శ 22-7 |

# దైవ పురుషకారములు

మిథున లగ్నపు ధనుర్నవాంశలో, కన్యాద్వాదశాంశలో, పుట్టిన మెరుపు తీగె జాతకురాలు. లగ్న, పంచమాధిపతులై, సప్తమకేంద్రములో నున్న శుభగ్రహములగు బుధశుక్రుల నిండు దృష్టి లగ్నముపై నున్నది. అందమైన ఆకార సౌష్ఠవము, సౌందర్యమునకు వన్నెదెచ్చు లావణ్యము, నవనవోన్మేషము గల ప్రతిభ, చక్కని సాహిత్య రసజ్ఞత, సరసాలాప చాతుర్యము, ఊహాపటుత్వము, భావతీవ్రత, ఆమెలో సమృద్ధిగా చూపట్టుట వింతకాదు. చంద్రునితో త్రికోణ మైత్రి కలిగి రాజ్యస్థానము నాశ్రయించి యున్న వరుణుని చూడుడు. స్వధర్మ నిర్వహణమందు శ్రద్ధ, సామాన్యముగా ఇతరులకు సులభముగా స్ఫురించని భావములు, ఆదర్శసాధనమునకై ఎంతటి త్యాగమునకైనా పూనుకొను మనస్తత్త్వము, ఇవి ఈ యోగపు ఫలములు. కాని, ఈ వరుణ మహాశయుని కేంద్రదృష్టి వేధ ప్రబలముగా లగ్నాధిపతి బుధునిపై నుండుట చింతాకరము. ఊహజ్ఞాయుతమైన నిశితబుద్ధి, ప్రబలమగు వ్యక్తి స్వాతంత్ర్యకాంక్ష, తీక్ష్ణమగు ఉద్రిక్త చిత్తవృత్తి, ఆవేశము కాని, దుఃఖము గాని, ఆపుకోజాలని కోమల హృదయము, చూపట్ట గలవు.

"వజ్రాదపి కఠోరాణి,
మృదూని కుసుమాదపి."

అను నిర్వచనమునకు తగినది మనస్తత్త్వము. లగ్నాధిపతి బుధుడు, పంచమాధిపతి శుక్రుడు, చేరియొకవైపున సప్తమ భావమునకు సమాంతరములో నిలిచి యున్నారు. ఇది చాలక, చతుర్థ సప్తమాధిపతులగు రవి, గురువుల శుభదృష్టిలో నున్న కుజుడు, ఉచ్ఛగ్రహమై, అష్టమ భావములో నుండుట! రసపరతంత్ర కోమల హృదయము, దాంపత్య జీవితముపై ప్రబల కాంక్ష, విలాస విహారప్రీతి, వియోగ క్లేశాసహిష్ణుత, అనుస్వభావములను ఈ యోగము తెలుపగలదు. భర్తృభావాధిపతియగు బృహస్పతినుండియు, లాభాధిపతియగు కుజుని నుండియు, శుభత్రికోణ దృష్టియే కాక, రవి చంద్రుల సమసప్తక దృష్టి, ఇంద్రుని కేంద్రదృష్టి సహా, కలిగియున్న మన్మథ సహమము జాతకురాలికి భర్తపై గల అనురాగమును, ఆనందపరవశత్వమును, చాటగలదు. కాని, ఏ మాత్రమైనా, వియోగమునో, విరహమునో, సహించలేని స్వభావము ఇంద్ర, రవి, చంద్రుల వేధవలన సిద్ధించును.

"హారో నారోపితః కంఠే,
మయా విశ్లేషభీరుణా,
ఇదానీ మంతరే జాతాః,
పర్వతాః, సరితో, ద్రుమాః."

అను సుభాషితమును జ్ఞప్తికితెచ్చు హృదయ మామెది.

కాని, దైవదుర్విలసితమును చూడుడు! లగ్నాధిపతి బుధుడు భర్తృభావములోనే యుండి వియోగకారియగు వరుణుని వేధపాలగుటయు, విషయ సుఖ (పంచమ) భావాధిపతియగు శుక్రుడు సహా ఆ భావమందే నిలిచి, చతుర్థభావమునందున్న అష్టమాధిపతి శనితో కేంద్ర వేధపాలగుటయు, విషాదకరములగు యోగములు. ఇంటిలో తొందరలు, పెద్దల అవివేకము, సుఖాభావము, వియోగ క్లేశానుభవము. సూచితములగుచున్నవి. పాపము! ఆశ ఎంతో, నిరాశ అంత!

దాంపత్య విషయమగు చర్చలో, భార్యాభర్తల జాతకములను శోధించి చూడనిదే, ఫలస్వరూపము బోధపడదు. జాతకురాలికి వియోగక్లేశము రావచ్చును. చతుర్థభావమునందు కారణమున్నది. భార్యాభర్తలకు అన్యోన్యానురాగమును సూచించు గ్రహయోగములు పరస్పరముగా లేనిచో, జాతకురాలి మనస్తత్త్వమో, ఆమె తలితండ్రుల అవిచార పరతయో, వియోగకారణమగును. అట్లు కాక, వారికి అన్యోన్య ప్రేమ విశ్వాసములనిచ్చు యోగము లున్నచో, భర్త ఇంటి పరిస్థితులలో అతని పెద్దల ధూర్తత్వమో, వియోగమును తెచ్చిపెట గలదు. భర్త జాతకమున అనారోగ్య సూచన లుండెనేని, అదే కారణము కావచ్చును. భర్త జాతకము శీలచ్యుతిని తెలుపునపుడు, కారణము వేరుగా ఏర్పడును. ఇట్లు, ఫలస్వభావ మొక్కటేఅయినా, సందర్భముల ననుసరించి దాని స్వరూపములో మార్పులుండగలవు. అగుటచే, భర్తజాతకము గమనింపవలసి యున్నది.

ఇదే అతని జాతకము :—

| | | | |
|---|---|---|---|
| చ 20-44<br>I 18-16<br>రా 9-37 | | | శ 21-59<br>ర 23-47-I |
| శు22-16(వ)<br>వరుణ 11-17<br>(వ) | (సాయనము)<br>—<br>కథానాయకురాలి భర్త జాతక చక్రము<br>— | | యమ 0-26<br>బు 18-18<br>కు 24-43<br>ఇంద్ర 26-40 |
| | | | గు 24-0 |
| X 21-14 | | | కే 9-37 |

లగ్నము మృదుస్వభావముగల మీనము. ఇంద్ర, శుక్ర, బుధుల కోణముల మిత్రదృష్టితో చల్లని చంద్రుడు లగ్నమునందే కలడు. ప్రశాంతమై, లలితమై, స్నిగ్ధ గంభీరమైన హృదయము నిది తెలుపజాలును. లగ్నాధిపతి గురువు. ఇతనికి రవి శనుల మిత్రదృష్టియున్నది. అందులో, కుంభ గురువు మంచి గుణవంతుడు. సాధుశీలము, పరోపకారపరాయణము, నిరాడంబర నిర్మల జీవనము, యోగ్యప్రవర్తనము, ధారాళ స్వభావము, దాక్షిణ్యశీలము, మున్నగు గుణములు రాగలవు. ఈ గురువునకు కుజుని సమసప్తక వేధయున్నది. అతి ధారాళము, అతి దాక్షిణ్యము, అసంప్రేక్ష్యకారిత్వము, దీనిఫలము. దశమ కేంద్రమందలి పుణ్యసహమము లగ్న దశమాధిపతియగు బృహస్పతియొక్క శుభదృష్టి నార్జించి జాతకుడు అదృష్టశాలియనియు, సత్ప్రవర్తనము కలవాడనియు, సూచించుచున్నది. కళత్ర స్థానాధిపతియగు బుధునితో పంచమాధిపతి చంద్రుడు పూర్ణమైత్రితో నుండుటచే, రమ్యమైన దాంపత్య జీవితము రావలసియున్నది. కాని, ఆ చంద్రునికి నిండు కేంద్రములో చతుర్థభావమందున్న రవి, శనుల కేంద్రవేధ క్లేశమును తెచ్చిపెట్టగలదు. గృహచ్ఛిద్రములో, పెద్దల అవినీతియో కారణమగును. దాంపత్యసహమము వరుణకేంద్రమం దుండుటవలన, విరసముపుట్టి వియోగమునకు దారితీయగలదు. అతి దాక్షిణ్యము, అనవసర సంశయము, అనులోపములు తప్ప, ఇతరలోపములేమియు జాతకములో చూపట్టకున్నవి. ఈ స్వభావమువలన, పరస్థితులను అదుపులో నుంచుకొనజాలక, జాతకుడు తాను క్లేశపడి భార్యను సహా క్లేశముపాలు చేయవచ్చును.

"అతిదాక్షిణ్యయుక్తానాం,
శంకితానాం పదే పదే,
పరాపవాద భీరూణాం,
దూరతోయాంతి సంపదః."

అని పెద్దలు చెప్పుదురుకదా ?

ఈ దంపతుల జాతకములను పోల్చిమాతము గాక.

అన్యోన్యముగా, వీరి రవి చంద్రులకు, కుజశుక్రులకుపహా, చక్కని మిత్రదృష్టియోగములున్నవి. భక్తిరక్తులకు కొదవయుండు కారణములేదు. భర్త కళత్రభావములో భార్య గురువు, భార్య రాజ్యభావములో భర్త గురువు! వీరి దాంపత్య జీవితము అభ్యుదయకరముగా సుఖసంధాయకముగా ఉండవలెను. భర్త మన్మథ సహమమునకు భార్య శుక్రునినుండి త్రికోణశుభదృష్టి సౌకర్యమున్నది. పరస్పర ప్రేమబంధమునకు ఈ యోగము లన్నియు తగినవే. ఇక, లోపమేమనగా, భార్య సప్తమభావమందలి శుక్రుడికి సమసప్తక వేధలో భర్తజాతకపు శని యుండుట శోచనీయము. ఆమె జాతకమందే శుక్రునికి శని వేధయుండగా, పులిమీద పుట్రవలె, భర్తజాతకమునుండిసహా ఆ శుక్రునికి శని వేధయే రావలయునా? ఆమె జాతకములో చతుర్థభావమునుండియే శని వేధయుండగా, భర్త జాతకములో సహా చతుర్థ భావమునుండియే శని దౌష్ట్యము వచ్చుచుండుట! ప్రాపంచికముగా, ఏమికారణము లేర్పడినా, వివాదానుభవమును ఈ యోగము కొంత అయినా రుచి చూపించకపోదు. వైవాహిక జీవితము రమ్యముగా సాగనీయక భర్త ఇంట విడో ప్రతిబంధకసామగ్రిని కల్పించగలడు శని.

ఇది అంతయు గమనించితిమేని,

"సా కిం న రమ్యా, స చ కిం న రంతా,
బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా."

అను సుభాషితము స్ఫురణకు రాగలదు.

చిన్నానాడే తల్లితండ్రులను కోలుపోయి, బంధువులచే పెంచబడినవాడు జాతకుడు. (చతుర్థములో రవి శనుల వేధ.) కొంతకాలము కలాశాలలో విద్యాభ్యాసము సాగించి చాలించుకొని ఇల్లుచేరి, పిత్రీయమైన భూస్థితివలన నిరుపాధికముగా జీవితమును నడుపుకొనుచున్న వాడితడు! పదునెనిమిది యేండ్ల వయస్సులోనే వివాహమైనది. (సప్తమాధిపతికి కల చంద్ర శుక్రుల మైత్రి ప్రభావము.) మరు సంవత్సరమే భార్య కాపురమునకు వచ్చినది. ఆమె కప్పటికి ముద్దా వయస్సే (పదు మూడేండ్లు). ఒక సంవత్సర కాలమైనా వారు సుఖముగా కడపగలిగిరో, లేదో, అంతలోనే ముసలము పుట్టినది. ఇంటిలో యాజమాన్యము వహించియుండిన పూర్వసువాసిని లిద్దరు కథానాయకురాలిని ద్వేషింప నారంభించినారు. తమ బాంధవ్యములోని కన్యను వలదని ఈమెను వరించుటచే, భర్తకు ఈ భార్యపై మనసు విరుచుటకు వారు ప్రయత్నములు జరిపినారట. మరలు మందు పెత్తికి రాచుటకై కథానాయకురాలు సన్నాహము

చేయుచున్నదని ఏవో సాక్ష్యములు చూపి, అట్లు జరుగనిచ్చినచో తల చెడి తిక్క ముదురునని ఆమె పరోక్షమున క్రమక్రమముగా భర్తకు బోధించుచు రాగా, ఆమాయకుడతడు భయపడి నానాటికి భార్యకు దూరమగుచు వచ్చెనట! (చతుర్థ భావపు వేధ). రెండు సంవత్సరములలో ఈ తంత్రమువలన భర్తలో గొప్ప మార్పు చూపట్టినది. క్రమముగా భార్య చేతి నీళ్ళ త్రావుట, ఆమెను స్పృశించుట, సమీపించుట, పలుకరించుట, చూచుట, అన్నియు తగ్గినవి. కారణమేమో, కథానాయకురాలికి తెలియదు. భర్తను అడుగుటకో, చూచుటకో, ఆమెకు అవకాశము లభించదు. తనలోపమేమో, తెలుసుకొను ఉపాయమే ఆమెకు కానరాదు. ఆమె మొర వినువారే లేరు. బంగారువంటిభర్త ఇంటిలో నుండగా, ఈ విషమ పరిస్థితుల పాలై, కథానాయకురాలు కంగారైనది. పదునారు సంవత్సరముల వయస్సు వచ్చు వేళకు చల్లగా ఆమెను పుట్టినింటికి పంపివేయునంతవరకు తంతు జరిగినది. కటికి రాళ్ళయినా కరగురీతి, ఎన్నియో విన్నపములామె భర్తకు వ్రాసుకొన్నది. ప్రతి రాలేదు. కూతురును పిల్చుకొని రావలదని మామగారి జాబులకు అల్లుని జబాబు. కడుపాత్రము పట్టలేక, కథానాయకురాలి తండ్రి తానే పోయి ప్రార్థించినా, ప్రాధేయపడినా, పంచాయతీలు చేసినా, ఫలము కానవచ్చినది కాదు. ఆరేడు నెలలుగా ఆమె పుట్టినింటిలో దుస్సహ వియోగ క్లేశమును అనుభవించుచుండినది.

అప్పటివరకు కథానాయకురాలు నాకు అపరిచిత. ఆమె భర్తతో మాత్రము దూరపు బంధుత్వము, కొంత పరిచయమును, కలవు. చేతనైనంత చేసి విసికి, జాతకఫలమునైనా కనుగొందమని తండ్రి నాకడకు రాగా, అతనివెంట ఆమె వచ్చినది. పరిచయమైనతరువాత, తనకథనంతయు చెప్పుకొని, కన్నీరు కాల్వలు పొంగునట్లు దుఃఖించినదామె. ఈ సందర్భమందే, నేనీజాతకములు గుణించుచుండగా, నా సమీపమందే ఆమె కూర్చుండి, అపుడపుడేదో మాటలాడుచుండినది.

పదునారుసంవత్సరముల బాలప్రాయ మామెది. అందము, వన్నె, వర్చస్సు, తెలివి, సంస్కృతి, ఆభిజాత్యము కలిగి అగ్నిజ్వాలవలె నున్న కథానాయకురాలిని చూచినవారికి, ఆమెను ధర్మపత్నిగా సంపాదించుకొన్న యువకుడెంత అదృష్టశాలియో, అనిపించక పోదు. ఆ సీమంతినియొక్క వినయ విధేయతలతోటి గంభీరప్రవర్తనము, సరససాహిత్యవాసనల జూపు సంభాషణ చాతుర్యము, సద్యస్స్ఫూర్తికల తేట తెలివి, మెచ్చుకొననివారుండరు. కాని, ఆమెకు కల్గిన వియోగకేశము ఎట్టి రాతిగుండెనైనా కరిగింపజాలినది. పాపము!

వీరి వివాహము 25-4-1932 వ తేదిన జరిగినది. భర్త జాతకపు శనిమీద శుక్రుడుండిన దినమది. అతనికి శుక్రుడు అష్టమాధిపతి. ఆ శుక్రుడుదయించు వేళలోనే శుభలగ్నము! శనికి మంచి అవకాశము నిచ్చినట్లయినది కదా? తగినట్లేయున్నది పరిణామము!

చలిత లగ్నము భర్త జాతకపు శనిపైనున్న కాలములో ఆమె కాపుర మారంభించుట, ఆసమయమందే చతుర్థ (గృహ) భావాధిపతి రవి చలనవశమున బుధ సంయోగమునందుటయు, వరుణుని కేంద్రవేధ నందుకొనుటయు, ఒక్కమారే సంభవించినది. విప్రలంభ శృంగారమును ఆమె అనుభవించుట వింతకాదు. కాని, ఇపుడు లగ్నాధిపతి బుధుడు ఋజుగతి నవలంబించి (తుల 16°) జన్మరవిని చేరుకొని, సప్తమాధిపతియగు చలితగురువుతో (కన్యారాశిలో $16\frac{1}{2}$°), లాభాధిపతి కుజునితో, ఈ శుభదృష్టిని సంపాదించుకొనుటేకాక, భర్తచలితరవిలో (మకరము 16°) త్రికోణమైత్రి నార్జించినాడు. చలితభర్తృసహమము (సింహము 23°) భర్త జాతకపు రవిలో అర్ధకోణ గుప్త మిత్రదృష్టికి వచ్చినది. చలిత దశమకేంద్రమునకు (మీనము 16°) కుజ, గురు, రవి, చలిత బుధులనుండి అనుకూలదృష్టి ఏర్పడుచున్నది. చలితలగ్నము (మిథునము $25\frac{3}{4}$°) భర్తృజాతకపుశనివేధను ఇపుడిపుడే దాటి యుండుట.

ఇవి అన్నియు దైవము సమకూర్చిన సౌకర్యములు. వీని నుపయోగించుకొని పురుషకారము నెరపినచో, హితమేల కలుగరాదు? భర్త జాతకమునుండి వచ్చు సౌకర్యములు చాల తక్కువయనుట సత్యమే. కనుక, కథానాయకురాలే గట్టిప్రయత్నము చేయవలసియున్నది. కాని, అవకాశములేనిది ఆమె ఏమి చేయగలదు? అందులో ప్రౌఢయూ, కాదు.

జాతకచక్రములను గమనించుచుండిన నా ఆలోచనలోని సారాంశమిది. అంతలో ఆమె, మెల్లగా ఇట్లనెను.

"పరిశీలనము ముగిసినదని నా ఊహ. మా వారి జాతక మేమనుచున్నదో?"

"జాతకము ఉత్తమమైనది. నీ భర్త చాలా గుణవంతుడు. కొంత....."

నా అర్ధోక్తిలోనే ఆమె అందుకొని, కొంత తీవ్రముగా కంఠస్వరమును మార్చి,

"కాదని ఎవ్వరనిరి? నా మెడకు సహా వారు తమగుణము నొకదానిని తగిలించినారు. దాని మూలముగనే నా కింత మనోవ్యథ!" అని విసరి, చిన్నగా పెదవిని విరచినది.

ఆమె ధోరణికి మెచ్చుకొంటిని. నాకు నవ్వు వచ్చినది.

"ఏమమ్మా! శ్లేషాలంకారమా?" అంటిని.

"ఆ శ్లేషాలంకారము మరచిపోయి మూడేండ్లయినది. సాహిత్యప్రాప్తిలేని నా వంటి అభాగ్యురాలికి అలంకారములా?"

తడుముకొనకుండ ఆ ముగ్ధ ఇచ్చిన ప్రత్యుత్తరములో చూపట్టిన సమయస్ఫూర్తికి, ప్రౌఢిమకు, నా కత్యాశ్చర్యమైనది. ఇట్టి రసజ్ఞురాలికా ఈ అవస్థ? క్షణమాత్రము నా హృదయము చేయిపెట్టి కలచినట్లైనది. నిరుత్తరుడై ఊరకుంటిని. అర నిమిషములో మరల నామెయే ప్రారంభించెను.

"క్షమించండి.

'ఆరడి పోకయుఁగా, ఫలమునందుటయుఁగా కని పల్కనేరమిన్, మారటినోరిదానవయి' మాటలాడు దోషము నాలోనున్నది. ఏమనుకొంటిరో, ఏమో?" అని దీనముగా నన్ను చూడగా,

"అనుకొనుట కేమున్నది? నీ భర్త ఎంత పుణ్యము చేసినాడో, అనుకొంటిని." అంటిని.

"వాస్తవముగా వారు పుణ్యాత్ములే. వారి వారు సహా పుణ్యజనులు. నేనే పాపిష్ఠిని. మా వారి పుణ్యములో నా అర్ధభాగమైనా నాకు రాలేదు." అనుచు తలవంచి చేలచెరగుతో ఆ తన్వి కంటితడి ఒత్తుకొన్నది. ఆమె ప్రౌఢోక్తుల ఎత్తిపొడుపునకు నాకు నవ్వు వచ్చినా, ఆమె విషణ్ణవదనము చూచి అపుకొని, ఏదో సమాశ్వాసము చేయదలచి ఇట్లంటిని.

"గ్రహవైషమ్యమున్న కాలములో కష్టములు వచ్చును. కాని, దశలు మారుచుండును. అమావాస్య స్థిరము కాదు; పున్నమ రానేవచ్చును."

"ఏమో కాని, అమావాస్యపైన నాకున్నంత భక్తి పున్నమపైన లేదు. వాస్తవమును చెప్పదలచినచో, నా జీవితములో ఇప్పుడే నిండు పున్నమ." అని ఆమె వెంటనే విమర్శించెను.

ఆమె పూర్వపక్షమునకు నా కత్యాశ్చర్యమైనది. అభిప్రాయము బోధపడక ఆమెను ప్రశ్నార్థకముగా చూచుచు, "అనగా," అంటిని.

"మీకు తెలియక కాదు. నన్ను పరీక్షించుచున్నారు... పున్నమనాడే చంద్రునిలో గొప్ప అందము ఉండగలదనుట వాస్తవమే. కాని, భర్త అయిన సూర్యభగవానునికి అందరానంతదూరముపోయి అలంకరించుకొని చంద్రమ్మ కులుకుచూ కూర్చున్నచో, ఏమి రసము? నాకేమో, పున్నమ అంటే అసహ్యమే." అని, మరల, "నా అధికప్రసంగమును క్షమించండి." అని ముగించెను.

ఆమె యోగ్యతకు అత్యానందమైనది. "తెలివి ఒకరి సొమ్మా." అనుకొంటిని. ఆమె మాటలలో నాకు కావ్యరసాహ్లాదము లభించుచుండినది. విరహవేదనయే ఆమెకు విద్యాగురువు. క్షణకాలము ఎవరును మాటలాడలేదు. అంతలో, తటాలున నన్ను చూచి ఆమె,

"మా వారు నాకు మోక్షమార్గము చూపునట్లు చేయండి." అని, తలవంచి మరల,

"ఏ మోక్షమైనా, సరే." అని ఆమె జారబలుకగా, నా మనస్సు కరగి నీరై పారినది.

"అమ్మాయీ! ఆత్రపడకుము. దైవము సహాయపడినప్పుడు ప్రయత్నింతము."

"అంతా దైవాధీనమే కదా? మన ప్రయత్నమేమి పనికివచ్చును? ప్రయత్నము చేసి చాలించుకొన్నాడు మా తండ్రి."

"అట్లు కాదమ్మా. దైవము అనుకూలించినపుడు పురుషకారము ఫలించును. దైవ మనుకూలించినా, పురుషకారము తోడులేనిది ఏ ఫలమూ రాదు.

'సిధ్యంతి సర్వ ఆరంభాః,
సంయోగాత్ కర్మణోర్ద్వయోః,
దైవాత్ పురుషకారాచ్చ;
న త్వేకస్మాత్ కథంచన.'

అని పెద్దలు చెప్పిరి. ప్రయత్నము ఆవశ్యకము. కాని, అది సకాలములో చేయవలసియున్నది. అంతే." అని ఉపన్యసించి, మరల, "మరి, సమయము వచ్చినపుడు నేను చెప్పినట్లు చేయగలవా?" అని ప్రశ్నించితిని.

ఆమె తటాలున నమస్కరించి, లేచి నిలచి,

"పతిభిక్షు పెట్టండి ... అగ్నిప్రవేశము చేయుమనినా, చేయగలను" అని ప్రత్యుత్తరమిచ్చినపుడు, ఆమె స్వరములో చూపట్టిన సంకల్పశక్తి, ముఖములో ప్రతిబింబించిన ధీరత, దృష్టిలో వికసించిన తైక్ష్ణ్యము, చూచి నివ్వెరపడితిని. కొంతకాలము ఓపిక పట్టవలెనని, తగిన కాలమును చూచి కర్తవ్య ముపదేశింతునని, ఆశాజనకముగా, సాంత్వన వాక్యములతో ఆమె మనస్సును కొంత నెమ్మదిపరచితిని. ఆమె జనకునికి సహా తగిన సమాధానము చెప్పితిని.

తరువాత తండ్రితో ఆమె స్వగ్రామమునకు వెళ్లినది. వారిది దూరప్రాంతమందలి పట్టణము.

కథానాయకురాలికి ఇప్పుడు దశలో కొంత దైవబలము వచ్చినది. కాని, భర్త జాతకమునుండి ఆమెకు చాలినంత సౌకర్యము రాలేదు. వచ్చినదేదో, అతి స్వల్పము. అగుటచే, ఆమె చేతనే గట్టి ప్రయత్నము చేయించవలసియున్నది. వారికి అన్యోన్యముగా అనురాగబంధమో, వ్యామోహమో, కలిగించజాలిన గ్రహసౌకర్యము గల దిన మొక్కటి కావలయును. అట్టి దినమున వారికి ఆకస్మిక సమాగమము జరుగుట ఎంతో మేలు. కాని భర్త ఇంటిలో ఈతంత్రము పారదు. చతుర్థ భావ వేధ కలదంపతులకు ఇంటిపట్టున అనుకూలపరిస్థితు లెటు సిద్ధించగలవు? గ్రామాంతరమున వీరి సమావేశము జరుగుట ఫలకారి. కాని, ఈ ఉద్దేశము తెలిసినచో, భర్త వచ్చులేకల్ల. భార్యప్రస్తావము వచ్చెడు సందర్భములను తప్పించుకొని జారిపోవులే అతని వాడుకయట! ఇతర కార్యవశమున అతడు గ్రామాంతరములో నున్న కాలములో ఈ తంతు జరుగవలసియుండెను. అది ఎంత ఆకస్మికమైతే, అంత మేలు. కాని, ఇన్ని సమకూడుట ఎట్లు? ఇది చిక్కు సమస్య!

"అర్థార్జనే సహాయః,
పురుషాణా మాపదర్ణవే పోతః,
యాత్రా సమయే మంత్రీ,
జాతక మపహాయ నాస్త్యపరః."

అను వరాహమిహిరాచార్యుని వాక్యము స్ఫురణకు వచ్చినది. నా జాతకము నొకసారి చూచుకొంటిని. కథానాయకురాలి చలిత రవి నా జన్మగురువు పై నున్న కాలమది. నా మాటయందు గౌరవప్రతిపత్తులుంచి నా ఉపదేశానుసారము ఆమె ప్రయత్నించవచ్చును. నా దశమ భావమందలి చలిత కుజునినుండి మిత్రదృష్టిలో ఆమె భర్త జాతకపు గురు, శని, చలిత శుక్రులుండిరి. ప్రకృత విషయమున నా ప్రయత్నమునకు దైవానుకూల్యము కల దనుకొనవచ్చును. పరీక్ష చేయుటకు సంకల్పించితిని.

వెదకగా, వెదకగా, మూడు నెలలకు ఒక దినము కానవచ్చెను. సెప్టెంబరు 28వ తేదీ అది. ఆనాటి గ్రహస్థితి :

| | | | |
|---|---|---|---|
| | శ 1-27 | వ 13-4 | కే 9-13 |
| | (సాయనము) — దైవానుకూల్యము చూపుదినము — | | చ 21-16 |
| గు 17-49 | | | |
| కు 28-45<br>రా 9-13 | | ర 4-56 | శు 4-3<br>బు 17-45<br>ఇ 19-19 |

పాఠకమహాశయు లొక్కసారి ఇంద్ర బుధ స్థానములను తిలకింతురుగాక. కథానాయకురాలి భర్త జాతకములోని సప్తమ (కళత్ర) భావబిందువునకు (కన్యారాశి (18°-14') చెరియొకవైపున, ఒకభాగ అంతరములో, ఇంద్ర బుధులు ఆనాడు నిలిచియుండురని కనుగొన్నంతనే, నాఉత్సాహము ఉప్పొంగినది. ఆమె లగ్నాధిపతి బుధుడు. భర్తజాతకములో కళత్రాధిపతి సహా బుధుడేకదా? ఇంద్ర, శుక్రులతో చేరి అతని పంచమ (విషయసుఖ) భావమందే బుధుడుండుట. లగ్నాధిపతియగు బృహస్పతి దృష్టి యీబుధునిపై వచ్చియుండినచో, 'భార్యయే పరదైవము' అనుభావన వచ్చియుండెడిదేమో? ప్రశంసాదినమున ఇంద్ర బుధులకు, కళత్రభావమునకుసహా, బృహస్పతియొక్క పరిపూర్ణకటాక్ష వీక్షణము (కోణదృష్టి) అబ్బగలదు. ఇంతేకాదు. ఆమె లగ్నాధిపతి బుధునికి నేరుగా అభిముఖుడై యుండగల డా బృహస్పతి. ఈ దంపతులా నాడు ఒకరినొకరు సమీపించగల్గినచో, వారికి

ఆనందబ్రహ్మ సాక్షాత్కారము లభించుటేమియగుదు?

మరియొక్కటి. భర్త జాతకమందలి చలిత మన్మథ వివాహసహమములు (వృషభము 18°) ఆనాటి ఇంద్ర బుధులతో, బృహస్పతితో. ఎంత హృదయంగమముగా శుభదృష్టిని సంపాదించుకోగలవో, చిత్తగింపుడు. అవకాశము నెదిగించి చూడవలయుగదా వీని ప్రభావము?

పోతే, భార్య దైనిక దశమకేంద్రములో గురువు నిలుచు దినమది. భార్య చలితశుక్రస్థానమందే (మకరము 11°) భర్త దైనిక సప్తమకేంద్రము ఆనాడు నిలువగలదు. అతని దైనిక చతుర్థకేంద్రములో నే (తుల 4°) చలిత భార్యాసహమము ఆనాడు స్థానము ఏర్పరచుకొనుట.

ఇన్ని సౌకర్యములుగలదినము మరి ఎన్నడు లభించగలుగు? దైవము అనుకూలపరిస్థితులను చూపుచున్నది. దినికి పురుషకారము తోడుపడవలయునంతే.

"...ఇక్షుశరాసన సాయక వ్యథా,
ఖిన్నత వాడి వత్తిలయి, కేల కపోలములూది.
మోహమునన్,
విన్నదనంబు దోప, కను వేదురునన్ పయి గాలి
సోకినన్,
వెన్న వలెన్ కరంగు"

స్థితిలోనున్న కథానాయకురాలికి ఇట్టి దైవానుకూల్యము సూచించుదినమున భర్తృసాన్నిధ్యము చేకూరెనేని నిస్సంశయముగా విజయలక్ష్మి ఆమెదే.

సరేకాని, నా ప్రయత్నమునకు దైవము సహాయకారి కావలయునుకదా? నా దైనికలగ్న మానాడు కన్యారాశిలో 5°లో నుండగలదని గుణించుకొంటిని. అనగా, ఆనాటిశుక్రుని పైననే. సంకల్పించిన కార్యమా శుక్రుని యాజమాన్యములోనిది. పైగా, 'పంచమరాజ్యాధిపతి' యగుటచే, నాకు యోగకారకుడు శుక్రుడు! మరియు, ఆనాటి బృహస్పతి నికరముగా నాజన్మలగ్నమందే. ఇది అంతయు శుభసూచనగా భావించి, దైవమును నమ్మి, పురుషకారమును సాగించుటకు నిశ్చయించితిని.

కథానాయకురాలి భర్తకు జ్యోతిషముపై ఆసక్తి కలదు. కొన్నాళ్ళకు పూర్వము నాతో కొన్ని విషయము లభ్యసించియుండెనుకూడ వ్యాసంగ మెటున్నదని విచారించి, కొన్ని గ్రంథములను చూడుమని అతనికొక లేఖ వ్రాసితిని. తగిన ప్రత్యుత్తరము వచ్చినది. కొన్ని నూతన గ్రంథములను తెప్పించితిని. వానిని గూర్చి మాకు జాబు, జవాబులు జరుగసాగినవి. రెండు నెలలు కడచెను. వీలు కలుగచేసుకొని కొన్నాళ్ళు నా ఇంట నిలువగలిగినచో, నూతన గ్రంథములు వ్యాసంగము చేయవచ్చునని సూచించగా, సెప్టెంబరు 15 వ తేదీ నాటికి అతడు వచ్చెను. కార్యాలయములో ఉండవలసిన కాలముతప్ప ఇతర సమయములలో అతని వ్యాసంగముతోనే కడపుచు వచ్చినాను. ముఖ్యముగా చారగ్రహములవలన వ్యక్తి జీవితములకు కలుగు ఉత్తేజనము, దైనిక జాతక ప్రక్రియ అను వానినిగూర్చి విపులముగా చర్చ సాగినది. వాస్తవ జీవితమునుండి అనేకోదాహరణములనెత్తి విమర్శించితిమి.

ఈ వ్యాసంగము పది దినములు జరిగినది. అయినా ఈ మధ్యకాలములో అతని సంసార పరిస్థితులను గూర్చి కాని, అతని భార్యనుగూర్చి కాని, ఏ విధముగనైనా ప్రస్తావమురాకుండునట్లుగా, జాగరూకతతో కాలము కడిపితిని.

సెప్టెంబరు నెల 25 వ తేదీ వచ్చెను. గడవుదినము సమీపించుకొలది నాకేమో లోలోపల ఆందోళనము అధికముగుచుండినది. దైవ పరిపాకమును నిరీక్షించుచుంటిని.

ఆనాటి సాయంకాలమున ఆ తరుణుడొక కుండలిని తదేకదీక్షతో పరిశీలించుచుండుట గమనించితిని. అతడి ముఖమున వికాసముతగ్గి విషాదరేఖలు అలముకొనియుండినవి. ఆనాటికి అతని దైనికదశమ కేంద్రము మేషరాశి 1 వ భాగములో నుండినది. అచటనే ఆనాడు శనియుండుట. దైనిక చతుర్థములోనున్న తాత్కాలిక రవికి ఆ శనినుండి సమసప్తక వేధ. తన గృహచ్ఛిద్రములనుగూర్చిన మనోవైకల్యము, నిరాశాభావము, కారణము గానోపునని భావించితిని. కాని, ఆ గ్రహద్వయమునకు మిత్రదృష్టిలో నా లగ్నాధిపతి యుండుటచే నా సాన్నిధ్యము అతనికి హితకరము కావలయును కదా? మాతము గాక.

మరుదినము భానువార మగుటచే, పగలంతయు దైనిక జాతకచర్చలతోనె కడచినది. కాని అపుడపుడు ఆ యువకుడు ఏవో ఆలోచనచేయుచు, నడుమనడుమ తాను వేసిఉంచుకొనియుండిన కుండలిని గమనించుచుండినాడు. ఆ కుండలి 28 వ తేదినాటి గ్రహస్థితికి సంబంధించినదని కనుగొనుటకు కష్టము కాలేదు. కనుక,

అతని ఆలోచనమునకు కారణము నేనడుగలేదు. ఆ రాత్రి అతడు ప్రశ్నించెను.

"దైనిక జాతకములో గ్రహకేంద్రయోగములు సూచించు ఫలములు జరుగని సందర్భములు కలవా?"

"సాధారణముగా ఆ ఫలములు వచ్చును."

"అపవాదమే లేదా?"

"గ్రహఫలము జరిగి తీరును. గ్రహగతులకు అపవాదము లేనప్పుడు, వాని ఫలములకు అపవాదము ఎట్లువచ్చును? కాని, వయస్సు, కాలము, ప్రకృతి, సంస్కారము మొదలగు వైయక్తిక పరిస్థితుల ననుసరించి ఆ ఫల స్వరూపము మార్పు చెందును. అంతే కాని, ఫల స్వభావములో భేదముండదు. ఉదాహరణముగా, శుక్రుని తీసికొందము. పసిబాలునికి, తరుణ వయస్కునికి, వృద్ధునికి, శుక్రుని ఉత్తేజనము వచ్చెనేని వారికి సమానఫలము వచ్చుననుకొనుట నగుబాటుకదా? ఇంతేకాదు. యవ్వనములోనున్న వారికైనా, అందరికి సమానఫలము రాదు. స్వాధీన పతికయగు భార్యకలవాడు ఆమెతో ఆనంద మనుభవించును. విరహావస్థలో నున్న దంపతులు అన్యోన్యసాన్నిధ్యము చేరుకోగలరు. అవివాహితుడు విషయ సుఖ సంపాదనుకై ప్రయత్నించును. శీలభంగమునకు అలవాటుపడినవాడు సానివాడలలో సంచరించును. రసికులు సంగీత సాహిత్య కళావినోదములతో కాలముగడుపుదురు. సామాన్యులకు సాంఘికముగా సుఖకరమగు పరిస్థితి యబ్బును. ఇట్లు ఆయా వ్యక్తియొక్క ఆదర్శములు, అవకాశములు, ప్రాపంచిక పరిస్థితులు, మున్నగువాని కనుగుణముగా శుక్రుని ఫలము భిన్న రూపములతో వ్యక్తమగును. అప్పటి దశలు దాని కొక స్వభావము నీయగలవు. గ్రహములు సూచించునది దైవశక్తి. పురుషకారము దాని కెంతమాత్రము తోడగునో, అంతే ఫలము లభించును.

"దైవే పురుషకారే చ,
కర్మసిద్ధి ర్వ్యవస్థితా"

అని ప్రాచీనులు స్పష్టముగా చెప్పిరి. పురుషకారము లేక, దైవము ఫలించదు. యుద్ధము చేయ నొల్లని వానికి, ఆయుధము లేమి పనికివచ్చును!?"

సావధానముగా విని ఆ తరుణుడు నిమిష కాలము ఆకాశమువంక చూచుచుండి తరువాత తన సందేహమును వెలిపుచ్చెను.

"నా జాతకమునకు ఈ పద్ధతి అన్వయించదేమో?"

"కారణము?" అంటిని.

"నా వివాహము నాడు దైనికలగ్నము మకరములో 21½° లో నుండినది. ఏ గ్రహ సంబంధము కాని అగుపడదు."

"నీవు గమనించలేదు. బుధుని తెలివి తేటలు, శుక్రుని సాహిత్య కళ, ఈ రెండును ఆ గ్రహద్వయము యొక్క మధ్య బిందువందు కేంద్రీకృతమై యుండును. నీ జాతకములో అట్టి బిందువునందే ఆనాడు నీ దైనిక సప్తమము (భార్య) నిలచుట నీ భాగ్యము. ఆధర్మముల రెండింటిని మేళవించుకొన్న ఉత్తమురాలను భార్యను సంపాదించుకొన్నావు."

అనగా, ఆ తరుణుడు క్షణము ఆ చక్రమును గమనించి చూచి మరల పూర్వపక్షము నెత్తెను.

"పోనియ్యండి. ఎల్లుండికి దైనిక చక్రము వేసితిని. ఇది నాకేమీ బోధపడలేదు."

అతడు నాకు అందిచ్చిన కుండలిని క్షణము గమనించిన శాస్త్రము చేసి, సందేహమేమి యని అడిగితిని.

"దైనిక సప్తమములో నా చలిత పుణ్యసహమము జన్మసప్తమములో ఇంద్ర బుధ సంయోగము; పైగా గురువునుండి శుభదృష్టి! ఏమి అర్థము?"

"ఏమున్నది? దాంపత్య జీవితములో అదృష్టము ఫలించునని."

"అది నా జీవితములో అసంభవము." అని ఆ తరుణుడు కొంత వెడనవ్వు నవ్వి ఆ కుండలిని అవల త్రోసెను.

"నా దృష్టిలో అసంభవము కానరాదు. ఆనాడు నీ దైనిక సప్తమ కేంద్రములోనే నీ భార్య చలిత శుక్రుడు, పంచమభావాధిపతి."

"మీకు తెలియదేమో? మాకు వైమనస్యములు పుట్టి దాదాపు మూడేండ్లు అయినది. మాకు మాటలు లేవు. తొమ్మిది నెలలుగా నా భార్య పుట్టినింటిలోనే యున్నది."

"అయితే మాత్రము మనుస్సులు మారకూడదా? నీ జాతకములో లోపము చతుర్థ భావములో నున్నది కాని, కళత్రభావములో లేదు" అని, మరల "పోనిమ్ము

నీ స్వంత విషయములో నీ ఇష్టము. ఏమైనా వేరు విషయము చర్చించుట మేలు." అనుచు, ప్రక్కనున్న పరుపుపై మేను వాల్చితిని.

ఏమేమో లెక్కలు వేసుకొనుచు అతడట్లే కూర్చుండియుండెను. ఆ రాత్రి అతని కంటికి నిద్ర అంటలేదు. గ్రహయోగములు తమపని తామారంభించినవని ఊహించితిని. తన దశలను గురించి అతడేమేమో ప్రశ్నించుచు రాగా, తోచిన సమాధానములు చెప్పుచు ఆ రాత్రి నేను సైతము నిద్రాదేవికి స్వస్తి చెప్పవలసి వచ్చెను. మా చర్చ రాత్రి అంతా సాగినది. కాని, ఇట్లు ప్రవర్తించమని మాత్రము నేనతనికి చెప్పలేదు.

ఆనాడు శుక్రుడు కన్యారాశిలో $1\frac{1}{2}°$లో నుండినాడు. అనగా, కథానాయకురాలి జన్మ వరుణునికి నేరుగా సమసప్తకమనుట. ఆమె భర్తజాతకమున చలిత రవికి అర్ధకేంద్ర వేధలోనే ఈ శుక్రుడుండుట. వియోగ క్లేశమును అనుభవింపజేయు యోగమిది. ఆమె చలిత శుక్రుడు (మకరము 10°) మాత్రము భర్త దైనిక లగ్నమును ప్రబలముగా ఆకర్షించు చున్నాడు. కాని, అతని దైనికదశముపైన నాటి శని ప్రయత్నమునకు సంకల్పము రానీయడు. ఏమో సందేహము, ఏదో దీర్ఘాలోచన. అతని అవస్థ చూచుటకే కష్టముగనుండెను. క్షణము లెక్కలు వేయుట, క్షణ మాలోచించుట, క్షణము శూన్యదృష్టితో ఆకాశమును చూచుట, క్షణము ఉస్సురనుట! ఏదో స్ఫురణకువచ్చి ప్రశ్నించును. మరల ఏదో గుణించును. క్షణములో ఆశ, మరల నిరుత్సాహము. అతని హృదయాంతరాళమున గొప్ప రామరావణయుద్ధము జరుగుచుండినట్లు చూపట్టినది. ఆశ గెల్చునో, ఆత్మాభిమానము గెల్చునో చూడవలసియుండెను.

ప్రశాంత శీతలవాయువులు రాత్రి గత ప్రాయమగుట సూచించెను. గడియారమువంక చూడగా, నాల్గుగంటలు కావచ్చుచుండినది. అంతలో సమీపములోనున్న రైలుస్టేషనులో ఘంటారావము వినవచ్చెను. ఆ తరుణుని కేదో అనిర్వచనీయమగు ఆవేదనము వచ్చినది. కారణము నాకు బోధపడలేదు. అతడేమో ఆలోచించుచుండెను. అంతలో దూరమున రైలుబండి ఈల వినవచ్చినది. దానితో అతనిలో గొప్ప సంచలనము చూపట్టెను. చుట్టునుజూచి ఏదో మాటలాడనుంకించి, అంతలో ఆగి, గదినుండి బైటికివెడలి ఆకాశమును చూచుచు క్షణకాలము నిలిచెను. రైలుబండి సమీపించు సవ్వడి వినరాగా లోనికివచ్చి నన్ను చూచినాడు. ఏదో, అనిర్వచనీయమగు హృదయాందోళనము. శుక్రోదయమగు కాలమది. ఈ నాటకమంతా అతనిదే కాబోలు ?

తటాలున "మీకొక శ్రమ ఇచ్చుచున్నాను." అని ఆ తరుణుడనగా, నా కత్యాశ్చర్యమైనది "ఏమి" అంటిని.

"నేను పోలేను. నా భార్య ఒంటరిగా రాలేను, ఆమె తల్లితండ్రులు వచ్చుట నాకు రుచించదు. మీరు వెళ్ళి నా భార్యను పిల్చుకొని రావలెనని నా ఆశ. ఈ రైలులో వెళ్ళితే, ఎల్లుండి ఉదయము పదిగంటలకు రాగలరు. రేపు ఒకనాటికి సెలవుచీటి వ్రాసియిచ్చి వెళ్లివచ్చు."

ఇది విన్నపుడు నాకు .కలిగినది ఆశ్చర్యమో, ఆనందమో చెప్పలేను. దైవమహిమ!

"నీవు వెళ్లుటబాగు. నా వెంటవారు ఆమెను పంపుదురా? ఆమె రాగలదా?" అంటిని.

అంతలో రైలు ప్లాటుఫారము చేరవచ్చుచుండినది.

"నాకొరకై మీరు వెళ్ళండి. నా భార్యతో చెప్పండి. వచ్చినాసరే, రాకపోయినాసరే. బండి వచ్చినది. అవకాశము లేదు. నేను ముందుగా పోయి టిక్కెట్టు కొనివత్తును. త్వరగా రాండి."

అనుచు ఆ తరుణుడు పరుగెత్తెను. నవ్వుకొనుచు నేనుసహా వెళ్లితిని. స్టేషన్ చేరి బండిలో కాలు పెట్టుసరికి రైలు కదలినది. టిక్కెట్టుసహా వచ్చినది. తలవని తలంపుగా, నాకీ ప్రయాణమువచ్చుట

ఆలోచించినకొలది ఆ తరుణుని చిత్తవృత్తి విచిత్రముగా తోచినది. అనురూపురాలు, శీలవతి భార్య. ఆమెపైన ద్వేషమో, ఈర్ష్యయో, కానరాదు. వైమనస్యమునకు బాహ్యప్రతిబంధకసామగ్రియే కారణమనుట స్పష్టము. తానో శీలవంతుడు. విరక్తుడు కాడు. భార్యపైన అభిమానమున్నది. వియోగక్లేశము నోర్వలేని తహతహకలదు. తానే వెళ్లియుండినచో, అత్తవారింటివారు ఎంతో ఆనందించియుందురు. భార్య ఇతనిని పూలతో కనకాభిషేకము చేసియుండును. కడకు రమ్మని తంతివార్త పంపియున్నచో, వారందరు తలతో నడచివచ్చియుందురు. కాని, ప్రయత్నమేమీ చేయనొల్లడు, ఏమి విచిత్ర స్వభావమో?

మనస్సులో ఏమున్నదో, అగమ్యగోచరము. మీనరాశి మహాసముద్రమువలె శాంత గంభీరమైనది. దాని లోతుపాతులు తెలియవు. మణులో, మహాతిమింగిలములో, అన్నియు లోపలనే. బైటికి కానరావు. ఇట్టిది ఇతని లగ్నము. దానిలో శీతకిరణుడు చంద్రుడు. మృదు గ్రహములగు ఇంద్ర శుక్ర బుధులు మరియొక జల రాశిలో నిలిచి లగ్నమును కటాక్షించుచున్నారు. పురుష గ్రహములగు కుజ గురు వరుణులు శనిదృష్టికి లోనైరి. సంకల్పకారకుడగు రవికో, శని సంయోగము! స్వభావము అతిమృదువు, పైగా శశి యోజనూన్యము పురుషకారము మట్టమగుటకు ఇదే కారణము కాబోలు. కథా నాయకురాలు సంకల్ప శక్తికలది. విషయము విన్నచో, ఆమె రెక్కలు కట్టుకొని వ్రాలగలదు. కాని అప్పుడు ఆమెను మాటలాడించు మాత్రమైనా ఇతని పురుషకారము అవసరము కదా? పలుకరించనిచో పాపము ఆముగ్ధ ఏమి చేయగలదు? ఆమెకా సహనశక్తి తక్కువ. మొత్తముమీద ఇది విషమపరీక్షా సమయము. ఆమెకు మాత్రమే కాదు, ఒక విధముగా నాకు సహా.

రైలు ప్రయాణములో నా ఆలోచనలలోని సారాంశమిది. సాయంకాలమునకు గమ్యస్థానము చేరితిని. అతిథిసత్కారముల అనంతరము కథా నాయకురాలు నాకడకువచ్చి కూర్చుండి కుశల ప్రశ్నల తరువాత తన భర్తనుగూర్చి ఏమేమో ప్రశ్నించినది. నా సందేశము చెప్పగా ఆమె కనుపరచిన ఉత్సాహమునకు పారములేదు. తల్లి తండ్రులతో సంప్రతించి ప్రయాణమునకు సిద్ధపడినది. ఆరాత్రి రైలులోనే ప్రయాణముచేసి మరుదినము పగలు 11 గంటలకు స్వగ్రామముచేరి కథా నాయకురాలిని మా ఇంటిలో శ్రీమతికి ఒప్పగించి, ఆత్రమున కార్యస్థానమునకు బోతిని. ఆమెభర్త ఇంట నుండలేదు. ఉద్దేశపూర్వకముగా ముఖము తప్పించుకొనెనో, ఏదైనా కార్యార్థము వెడలియుండెనో, తెలియదు.

ఆ సాయంతనమున ఇంటికివచ్చి విచారించగా, ఆ తరుణుడు ఇంటిలోనికే రాలేదనియు, ఎదుట నున్న నాగదిలో కూర్చుండి ఏవో చదువుకొనుచుండెననియు తెలిసి నవ్వుకొంటిని. కథానాయకురాలు మౌనముగా ఒకమూలలో కూర్చుండి యుండెను. ధైర్యము చెప్ప దలచి, ఆమెతో ఏవో లోకాభి రామాయణము నారంభించితిని.

"జ్యోతిష్యమున కేమో శాప మున్నదట కదా?" నాకిది కథానాయకురాలి ఎత్తిపొడుపు.

"ఏ శాపమూ లేదు. గ్రహములు తమ తమ ధర్మములను తప్పక నెరవేర్పగలవు." అంటిని.

"గ్రహముల మాట ఏమో కాని, అనుగ్రహము మాత్రము తన ధర్మమును మరచినట్లున్నది."

"ఆత్రమువలదు. క్రమముగా అంతా జరుగగలదు."

"ఉపక్రమమే లేదు. క్రమమెప్పుడో?" కథా నాయకురాలి ధోరణికి నాకు నవ్వు ఆగినది కాదు. కళాపూర్ణోదయములోని సుగాత్రి శాలీనుల కథ స్ఫురణకువచ్చెను.

"కాంతుడు సిబ్బితికాడై,
కాంతయు నట్లయిన నెట్లు కాపురమింకన్."

అని చెప్పి నాగది చేరుకొంటిని.

ఆమె భర్త ఏవో చదువుకొనుచుండెను. భార్య వచ్చినదా అని కాని, అత్తవారింటిలో ఏమి జరిగినని కాని, అతడు ప్రస్తావించనే లేదు. ఎంత నిబ్బరమో, అతనిది? భోజనావసరమున ఇంటిలోనికి వెళ్ళినపుడు సైతము భార్యవైపు అతడు కన్నెత్తి చూడలేదు; కంకిమ్మనక మరల గదిచేరుకొన్నాడు. ఏమి శనిమహాశయుని ప్రభావము!

ఆరాత్రి కథానాయకురాలు తానే ఆగది ప్రవేశించి ఆప్యాయముగా కుశల ప్రశ్న కావించినది. ఇంద్రబుధులు గెల్చినారు. శనిపట్టు కొంత వదలినది.

మరుదినము ఉదయము కాఫీ కషాయమును సిద్ధపరచుచుండిన కథానాయకురాలిని చూచి,

"జ్యోతిష్యమునకు శాపమున్నదేమమ్మా?" అని యడిగితిని. ఆమె తిటాలున నమస్కరించి నిలిచి ముకుళిత హాసములతో,

"ధన్యురాలను. మీ అనుగ్రహమువలన 'రామా, కృష్ణా' అనుకొనుచు కాలక్షేపము చేతును." అని సవినయముగా ప్రతి ఇచ్చినది. (ఆమె భర్త నామాక్షరములవి.) నాకేలనో కన్నులు చెమ్మగిల్లినవి. ఆశీర్వదించితిని. నా పరీక్ష ముగిసినది.

మూడు నాల్గుదినములు ఆ తరుణ దంపతులు అత్యానందముతో కడపిరి. తరువాత త్వరగానె వారు స్వస్థానము చేరుకొన్నారు. పదినెలలకు చక్కని చుక్కవంటి పుత్రికను భర్తకు ఉపాయన మిచ్చినది కథానాయకురాలు.

దైవబలమెంత యుండినా, ఫలసిద్ధి కావలె నన్నచో, దానికి పురుషకారపు సాహాయ్య మవసరమని మనకీ వాస్తవచరిత్ర బోధించుచున్నది.

"న దేశకాల వ్యవసాయవర్జ్యం,
భవేత్ ఫలాప్తిః, సతి చాపిదైవే."

# కోరికల సత్యం

శ్రీ బలివాడ కాంతారావు

చివరిదశలో గత జీవితంలోని ఘట్టాలు తలుచుకుంటుంటే యివన్నీ నిన్నా మొన్నా జరిగినట్లే వున్నాయ్ రామయ్యకు.

సరిగ్గా ముప్పయియేళ్ళ క్రితం చిన్న చిరిగిన పంచె, మాసిన లాల్చీతో పొట్ట చేతపట్టుకొని యీ పట్నంలో అడుగుపెట్టాడు. వారంరోజులు పాదాలు అరిగిపోయినట్లు తిరగాతిరగ్గా ఒక కంట్రాక్టరు దగ్గర రోజుకి అరణాలమీద పనికుదిరింది. ఇదే చాలని సంతోషించాడు. అంతా స్వంతం అనుకొని పట్టుదలతో పనిచేసేవాడు.

ఒకనాడు వూరిబయట యెండప్పుడు మర్రిచెట్టు క్రింద మిగతా వాళ్ళతో మేనువాల్చి ఎండనక, వాననక యిలా నలిగిపోయే యీ మేస్త్రీ ఉద్యోగం కంటె మేనేజరు ఆఫీసులో గుమస్తా వుద్యోగం లభిస్తే యెంత బాగుండేదని కోరుకున్నాడు. ఈయన పనితనానికి మెచ్చుకున్న మేనేజరు ఆ కోరిక కొనసాగించాడు.

తన తెలివితేటలు వినయ విధేయతలు, కంపెనీకి లాభం చూపించే క్రొత్త విధానాలు — అసలు కంట్రాక్టరుకే చూపించే అవకాశం కలిగింది. తను మేనేజరుకంటే తెలివైనవాడినే తనెందుకు మేనేజరు కాకూడదనుకున్నాడు. ఆ కోరిక ఫలించడానికి నాలుగేళ్లయినా అవసరం లేకపోయింది. ఈలోగా ఆ పదవికోసం తనెంత ఆరాటపడి పోయాడు!

అది వచ్చాక లాభాలు కుప్పలుగా కురుస్తుంటే తనే కంట్రాక్టరు అయితే యెంత బాగుండేది అనిపించింది. కారు—మేడలు మిద్దెలు—పిల్లలకు పెద్ద చదువులు అమ్మాయిలకు పెద్ద సంబంధాలు!

ఆ కోరిక ఫలించడానికి యెన్నో సంవత్సరాలు పట్టలేదు. యజమాని తనకంపెనీలో చిన్నవాటా యిచ్చాడు. ఆవాటా రానురాను పెంచి కొన్నాళ్ళకు పటుతరమైన విశ్వాసంతో కంపెనీ వ్యవహారాలన్నీ తనమీద విడిచిపెట్టి దూరదేశాలకు సంచారం వెళ్లిపోయాడు. రామయ్యా తనవంతుకు వచ్చే లాభంతో మేడకట్టించాడు—కారు కొన్నాడు. పిల్లలు కాలేజీకి కారుమీద వెళ్తారు. తనకు యిప్పుడు దొరికే మిత్రుల బంధువుల అంతస్థులే వేరు.

భాషన్నూ, తిండి అన్నీ మారిపోజొచ్చినయ్. యిప్పుడు భోజనం టేబిలుమీద చెయ్యవలసివస్తోంది. కారుంటేగాని కాలుకదలకుండావుంది. కంట్రాక్టరు తిరిగివచ్చేసరికి తనే ఆకంపెనీ అంతటికీ అధినాయకుడు అయిపోయాడు. పెద్దకంట్రాక్టరు తనను యేవో మీటింగులకు పిలిచి సభామర్యాద చేస్తున్నారు. పనేమిరా పైకికాదన్నా తనేదో మహాదాత అని పొగిడి పొగిడి పుస్తకాల్లో యెక్కిస్తున్నారు. తన పేరుమీద వూళ్లో గ్రంథాలయం లేచింది. హైస్కూలుభవనం కూడా తనపేరుమీదే కట్టేసున్నారు. తను పెద్దనాయకుడై పోయాడు. కౌన్సిలరునుంచి మ్యునిసిపల్ చైర్మన్ అయికూర్చున్నాడు.

అందివచ్చిన పెద్దకొడుకు అంతా చూసుకుంటున్నాడు. ఎక్కడ సంతకం పెట్టమంటే అక్కడ తను పెట్టడమే. చూస్తూండగానే బటలమిల్లు, రెండుధాన్యం మరలు, ఉప్పుగల్లీ...అన్నీ తనపేరనే లేచిపోయాయి. ఇవన్నీ వృద్ధిఅవుతున్నకొద్దీ తనలో దయాధర్మగుణాలు పెరిగిపోయాయి. యెప్పుడూ యెవరికి యేమి యిద్దామా అనే వుబలాటమే!

జ్వరంతో పడుకున్న తనకు ఈనాడు యింకో కోరిక కలిగింది. కానీ ఆకోరిక కొనసాగదన్న నగ్న సత్యం యింకోకోరికకు దారితీసింది! తనమీద రోజులన్నీకూడి, సంవత్సరాలై వేగంగా ముసలితనాన్ని ప్రసాదించాయ్! ఆరోగ్యం క్షీణించింది. ఈ గడ్డంలో నీరసించిన తనను కొద్దినెలలుక్రితంవున్న రామయ్యాఅని

పోల్చుకోలేరే! అంలాటిది తన్ను చాలా కాలం బ్రతకాలంటే ఆకోరిక కొనసాగుతుందా!

కాదు కాబట్టే తనకింకో కోరిక కలిగింది. తన చేతులతో దానధర్మాలు చేసాడు. తను చచ్చిపోయినా కలకాలం నిలిచిచే కీర్తి గౌరవం ప్రజల్లో విడిచి పోతున్నానని గుండెమీద చెయ్యి వేసుకొని ధీమాగా, తృప్తిగా చెప్పగలడు. తను దాతఅని, తనను కర్ణునితో పోల్చినకవులు లేకపోలేదు. ఎందరు కీర్తించలేదు. ఉవ్విళ్ళూరిపోతున్న రామయ్యగారి తను ప్రజల్లో మారువేషంలోతిరిగి తనపైనున్న గౌరవప్రతిష్ఠలను కళ్ళారాచూసి, చెవులారావిని, మనసారా సంతోషించి కళ్ళుమూద్దామనే కోరిక నిమిషనిమిషానికి బలీయమై మనస్సులో గాఢంగా పాతుకుపోయింది.

కొద్ది రోజుల్లో యెవరికీ తెలియకుండా దానికి కావలసిన సరంజామా సంపాదించుకున్నాడు. ఒంట్లో నాలుగు ఫర్లాంగులు నడవగలిగే శక్తి చేకూరింది. ఎవరూ తన దగ్గరకు వచ్చి అట్టే విసిగెత్తించ వద్దని ఆవేళనుంచీ చెప్పేసాడు. ఇల్లు ఎల్లప్పుడూ పిల్లలూ వాళ్ళ స్నేహితులు, బంధువులతో కళకళ్ళాడుతూ నిత్యకళ్యాణం పచ్చతోరణంలా వుంటుంది. కానీ యేరోజైతే అంతాయేదో విషయంలో నిమగ్నులై వుంటారో ఆరోజే పెరటి త్రోవగుండా యెవరికీ తెలియకుండా వెళ్లి తిరిగి వచ్చాక అందరినీ ఆశ్చర్యం పొందేటట్లు చేద్దామనుకున్నాడు. తను ఆనందంతో తిరిగి వచ్చేసరికి అందరూ తను అనుకున్నట్టే వాడని యెంత గాబరగుతారో అప్పుడు జరిగే గమ్మత్తునవ్వు అంతా వూహించి ఆనంద పడ్డాడు!

ఆరోజు వచ్చింది. చీకటిపడింది. ఇంట్లో వాళ్లంతా మూడో అంతస్థుమీదకు పోయారు. తన చిన్నకూతురి సంబంధం కోసం కాబోయే వియ్యాలవారొచ్చారు. వాళ్ళ గౌరవార్థం పెద్దపార్టీ, పార్టీ అయ్యాక భరతనాట్య ప్రదర్శనం జరుగబోతుంది. తను యెలాగో కష్టపడి దిగువనుంచి, చివరి అంతస్తుకి ప్రాకగలడు. కానీ తను నీరసంగా వున్నానని రాలేనని అందరినీ పంపించివేసాడు. పరిస్థితులన్నీ అనుకూలంగానే వున్నాయ్. కానీ ఆకాశం అంతా కారుమబ్బుల మయమై వుంది. అయినా యింత వేగిరం వర్షంవచ్చే చిహ్నాలేమీ కనపడలేదు. "ఇంతకంటె మరి అవకాశం దొరకదు. వీళ్ళెవరైనా చూస్తే నన్ను కదలనివ్వగు. వర్షంవచ్చేలోగా తిరిగి రాలేనా?" అన్న ధీమాతో గబగ"-బట్టలు మార్చాడు. ఎదురుగా వున్న నిలువుటద్దంలో తన వేషం చూసి తనే ఆశ్చర్యపోయాడు. అచ్చంగా ఓగతిలేని ముదుసలి బిచ్చగాడు! గాలేస్తే పడిపోయేట్లున్నాడు!

ఇటూ అటూ యెవరూ లేకపోవటం చూచి ఒక్కసారి చాటుగా పెరటితలుపు తీసి రోడ్డుమీద పడ్డాడు. చేతికర్రతో నడ్డివంచినడుస్తూ అలా గబగబ వెళ్లిపోతున్న ఒక వ్యక్తితో.

"బాబూ!"

వెంటనే ఆవ్యక్తి "యేంలేదుపోరా!" అన్నాడు. రామయ్యకు ఒక్కసారి ఒళ్ళు మండింది. కాని వెనువెంటనే శాంతించి వెంటబడి:

"బాబూ! ఈ వూరు రావటం యిదే తొలిసారి, ఆ మేడమీద సందడిగా..."

తనమాటలు పూర్తికాకుండానే "ఉంటుందిలే! వాడి మేడమీదలేక యింకెవరి మేడమీద ఉంటుంది?"

"ఏం బాబూ?"

"ఎందరో తిండిలేక చస్తుంటే వాడింట్లోవున్న పిల్లికి కూడా పుట్టినరోజు పండుగచేసి డబ్బు తగలేస్తారు!"

"ఎవరుబాబూ ఆయన!"

"రామయ్య అంటారులే..."

"ఆ బాబా? మా వూరివేపు ఆ బాబంటే దర్మదాతంటారు?" ఆవ్యక్తినవ్వి "వాడి పేరుపెట్టకుండా అచ్చుగుద్దకుండా యెవరికైనా ఒకగుడ్డ దానంచేసాడా ఒక స్కూలు కట్టించాడా? నీకేం తెలుసు వాడి సంగతి?—ఒంటిగా వుండేటపుడు చెయ్యిచాపు ఒక దమ్మిడీ విసుర్తాడేమో? పదిమందిలో వుండగా చెయ్యిచాపు పది రూపాయల కాగితం విసుర్తాడు! దోస్తున్నాడు. ఆ పాపం కప్పుకొనడానికీ దానాలు. మనం పిచ్చివాళ్లం కానీ వాడు పిచ్చివాడుకాడు ముసలోడా?"

అంటుంటే రామయ్యకు నోరు పెగల్లేదు. అలా రోడ్డుప్రక్కన కూర్చుండిపోయాడు. ఆ వ్యక్తి ముందుకు వెళ్లిపోతుంటే వీధిదీపం వెలుతురులో చూసాడు. ఇంకెవరూ కాదు, తన దయాధర్మగుణాన్ని నిండుసభలో పొగిడినవ్యక్తే యితను!

కొంతసేపయ్యాక లేచాడు. అలా నడిచిపోతున్న

వాళ్ళెందరినో చూసాడు. ఎవరినడిగితేయేం చెడ్డచెప్పి పోతారోనని గుండె బితుకు బితుకుమంటోంది. ఈ వూర్లో అడుగుపెట్టిన దగ్గరనుంచీ పరిచయంవున్న వాని యిల్లు చూడగానే నడుస్తూ యెంతోదూరం వచ్చేసానని గుర్తుకు వచ్చేసింది.

ఆ వ్యక్తి భోజనం అయ్యాక వాకిట వాలుకుర్చీ వేసుకుని కూర్చొని పద్యాలు వల్లించుకుంటున్నాడు. ఎన్నిసార్లు యితను తనను సన్మాన పత్రాలలో ఇంద్రుడూ, చంద్రుడు అని పొగిడాడు. ఈయనకవి—ప్రజాహృదయానికి ప్రతినిధి—యీ గాన శోభనా కీర్తికాంతను వర్ణించగా విని హాయిగా తిరిగిపోతాను. అట్టేదూరం నడవలేనేమో? ఏబండివాడు యీ బిచ్చగాడికి బండికట్టడానికి ఒప్పుకుంటాడు? అయ్యో! ఈ చింకిజేబులో ఒక రూపాయైనా వేసుకోచ్చాను కాదే?"

తన కంఠస్వరం యెంత మాత్రం పోల్చుకో కూడదని వణుకుతూ "బాబూ!" అన్నాడు.

తన వేపు చూడకుండానే "భోజనాలయిపోయాయ్. పోవోయ్!" అన్నాడు.

"బాబూ! ఈ వూరిలో కాలుపెట్టడం యిదే... ఎవరో రామయ్య బాబట! అడగని వాడిదే పాపమట! ఆ మారాజు పేరు దేశమంతా మ్రోగతిన్నాది—ఆ యిల్లెక్కడో సెప్పరా?"

ఈ మాటలతో ఆయన తలొకసారి త్రిప్పి పక్కన నవ్వాడు. కొద్దిగా ఆయాసంగా వుండటం వలన రామయ్య అక్కడ కూర్చుండ బడిపోయాడు.

ఆకాశాన నల్లని మేఘాలు ముద్దుగా పేరుకు పోతున్నాయ్. ఉండి వుండి చల్లని గాలి వీస్తోంది. ఆ వ్యక్తి ఒక్క ఆవులింత తీసి "ఆ రామయ్య సంగతా? వినాలని వుందా?"

"సిత్తం!"

"వాడు యిప్పుడు దేవేంద్ర భోగం అనుభవిస్తున్నాడని అంతా అనుకుంటాగాగానీ యీ వూరు చింకి బట్టలతో వచ్చిన క్రొత్త రోజుల్లోవున్న సుఖం వాడికేది? నిజం చెప్తాను తాతా నీలాంటి సుఖమైన మనిషి లోకంలో యెక్కడా వుండడు, ఎందుచేతనంటావ్—నీకు కోరికల్లేవు. కావలసిన బట్టా తిండీ అడుక్కొని ఆ అవసరాలు తీర్చుకుంటావ్? వింటున్నావా? అర్థం అయిందా?"

"అఁ..." మూలిగాడు.

"ఆ రామయ్యే యెండనక వాననక కష్టపడి అదిగో చూసావా ఆ కనుపించే మర్రిచెట్టు క్రింద హాయిగా పడుకొనేవాడు. ఆ రోజుల్లోనూ నేను వాడిని యెరుగుదును. ఎంత మంచి మనిషంటావ్? తను యేకీర్తీ కోరకుండానే ఒకరికి సహాయం చేసేవాడు తను బాధపడి కూడానూ...మరి యిప్పుడో...వాడికి యేపని చేసినా, చివరికి నీకో కానీ ధర్మంచేసినా కీర్తి కోరే చేస్తున్నాడు. అంచేత మనిషిగా ఒక విలువను సంపాదించినవాడు, ఆనాటిరామయ్యకానీ యీ నాటి రామయ్య యెంతమాత్రం కాదు! నే నేదో పెద్దమాటలు అనేస్తున్నాను—అర్థమౌతోందా?"

కళ్ళపర్యంతరం నీరు తెచ్చుకున్న రామయ్య "ఊఁ" అని విధిలేక గొణిగాడు.

అతను హృదయాహ్లాదానిచ్చే గాలి వీస్తుంటే వునికి మరచిపోయి తను మరుగుపరచుకున్న వ్యక్తిత్వాన్ని వెల్లగ్రక్కుతున్నాడు.

"ఈలోకంలో బాగా మోసపోయేవాడెవడంటే రామయ్య అంటాను!ఒకమాటంటాను;లోకం చూసావు; న్యాయం చెప్పు! ఆకలని వచ్చావ్. కడుపునిండా తిండేకాదు మంచి బట్టలిచ్చాను. మాయింట్లోమనిషిగా చూసుకున్నాను. నమ్మి యింటిపెత్తనంయిచ్చి పనిమీద వూరికి వెళ్ళాను. నేను తిరిగి వచ్చేసరికి దొంగలెక్కలతో యీ యిల్లూ ఆస్తీ అంతా నాదేనన్నావు. చూసావా? ఇంత చేసినందుకు పదునైన కత్తితో వెనుక నుంచివచ్చి పొడిచి చంపినట్లు లేదూ? ఆశతో రాక్షసుడైపోయాడు రామయ్య! రాక్షసుడు కంపెనీ కబళించుకున్నాడు? ఎన్నికార్లు, ఎన్నిమేడలు, ఎన్నిలక్షలున్నా, ఎన్నిదానాలుచేసినా రాక్షసుడు సత్యం న్యాయంకి చిహ్నమైన మనిషెలా అయిపోతాడు చెప్పు? ఇలాంటిహీనుడు ప్రజల్లో గొప్పవానిగా యెలా చెలామణిఅయిపోతాడు? ముఖస్తుతికి పొంగి వుబ్బిపోయేవాడు, వుత్తి నీచుడన్నమాట! తన నీచత్వం తను తెలుసుకుంటాడని తనని యింద్రుడు చంద్రుడని నేనే పొగిడిననాడు వుబ్బి తబ్బిబ్బయిపోయాడు! తనలాంటి రాక్షసుడు, యింద్రుడు, చంద్రుడెలాగౌతాడనైనా ఒక్షణమైనా ఆలోచిస్తే యీ భాగ్యభోగాలు విడిచి తనతప్పులకుపశ్చాత్తాపం చెంది యే అడవుల్లోనో కష్టాలు పడి తాపసిగా వుండిపోను. చూసావా! కోరికలతో

యెన్నో నోములు నోస్తేగానీ దొరకని నరజన్మని ఎలా నాశనం చేసుకున్నాడో? చేసినపాపానికి ఫలితం అనుభవిస్తాడులే!"

ఈ మాటలు ములుకుల్లా గుండెకు నాటడంవల్ల బాధతో బేజారెత్తి ముందుకు పరిగెత్తాడు. నడుస్తుంటే కాళ్లు వణికిపోతున్నయ్. కళ్ళు చీకట్లు కమ్మతున్నయ్. మనసు గురితప్పి గమ్యంలేక రోడ్డుదిగి నడుస్తున్నాడు. చీకటి...దారీ తెన్నూ అగపడలేదు. భూతంలా మర్రిచెట్టు అగుపిస్తోంది.

ఉరుములు మీదే పడ్తున్నట్లున్నయ్. భయం-భయంకరంగా వుంది—ఎవరో తనవెంట నీడలా నడుస్తూ నవుస్తూవున్నట్లు...తిరిగి చూడడానికి భయం వేసింది. వికటాట్టహాసం! ఆ భయంకరమైన కోరలు! చేతులలో తన్ను కౌగలించుకోడానికి వస్తున్న... పిశాచా?... యమకింకరుడా?

అదిగో తనలోనికి చొచ్చుకుపోయినట్లున్నాడే లోపల నవ్వుతూ కడుపు చెక్కలు చేస్తున్నాడు... "హా హా..." ఏదో అంటున్నాడు...ఏమిటది? వినకూడదని చెవులు మూసుకున్నా గట్టిగా వినిపిస్తోంది....

"అమాయకుడా! దేముడు కోరినదానితోపాటు కోరనిది కూడా యిస్తాడు. కీర్తి కోరితే అపకీర్తికూడా మేళవిస్తాడు—సుఖాలు కోరితే కష్టాలు కూడా జతపరుస్తాడు — ఈ మాత్రం సత్యం తెలుసుకోలేక పోయావ్..."

ఒక్క మెరుపు మెరిసింది! త్రోవలో రాళ్ల కుప్పలు చెల్లాచెదురుగా అగుపించాయ్...తరవాత ఆ ప్రదేశమంతా నిశిలో శ్మశానంలా వుంది. ఈనిర్జన ప్రదేశానికి యీ భీభత్సమైన వాతావరణంలో యెందుకు యెలా వచ్చానని ఆశ్చర్యపోయాడు. బహుశః ఆ మర్రిచెట్టుకీ తన జీవితానికీ వుండే బంధం తననిలా లాగుకొని వచ్చిందేమో! పట్టపగలు వచ్చి వుంటే యెంత బాగుండేదని విసుక్కున్నాడు. పెనుగాలితో పెద్ద వర్షం దబదబ వచ్చిపడింది. ఉరుములు మెరుపులతో భూమి దద్దరిల్లిపోతోంది. ఆతృతతో కర్ర పట్టుకొని వంగుతూ రక్షణకోసం మర్రిచెట్టువేపు నడవబోయాడు. గాలికి చెట్టుకొమ్మలన్నీ వూగుతూ పెద్దశబ్దం చేస్తున్నయ్. తను ఆ చెట్టు క్రిందకు పోతే యే కొమ్మ విరిగిపడ్తే తను చచ్చిపోడూ? ఏ పాము చేరి కరిస్తే తను గిజగిజ గింజుకొని ప్రాణం విడిచిపెట్టడూ?

"అయ్యో! నా మేడలో హాయిగా వుండక యిలా యెందుకొచ్చాను? పరుగెత్తి వెనక్కిపోతాను-రోడ్డుమీదకువెళ్తే...ఈ సరికి నాకోసం కార్లమీద వూరంతా గాలిస్తుంటారు. నన్నీ వేషంతో చూసి నేను రామయ్యనంటే నమ్ముతారా? నా కారు నన్ను యెక్కనిస్తారా? అసలు నేను రోడ్డువరకైనా వెళ్లలేనే...నా గుండె ఆగిపోతున్నట్లుంది! దేముడా నన్నిక్కడ చంపకు...."

కాళ్లు ముందుకు పడటంలేదు తడిసి ముద్దయి వణుకుతూ ఆశతో "అదిగో నా మేడలూ మిద్దెలూ... నా పెళ్లాం, పిల్లలూ...వాళ్లంతా కళ్లకు కనిపిస్తుంటే చూస్తూ చచ్చిపోతాను...ఈ భీభత్సంలో నేను చేసిన దానధర్మాలూ పుణ్యమైనా నాకు తోడు రావా? ఇంటికి చేర్చు-అక్కడ చచ్చిపోతే నా శవం వెంట వూరంతా వస్తారు—బ్యాండుమేళం మోగుతుంది..... దేశం అంతా కన్నీరు విడుస్తుంది..... నాకిక్కడ గతిలేనిచావు యీ వేషంలో తీసుకురాకు తండ్రీ!" వలవల యేడుస్తూ తల బాదుకున్నాడు. కాలు ముందుకుపడలేదు. చలికి గజగజ వణికిపోతున్నాడు. ఆకాశం దద్దరిల్లిపోతోంది. వర్షం కుండలతో కురుస్తోంది. గాలి ఘీంకారం! ఫెటేల్‌మని మర్రిచెట్టు కొమ్మ కూలిపోయింది. రామయ్య త్రుళ్ళిపడి ఒక్క యెగురు యెగిరాడు! ఆయెగురుతో నే ముందువున్న రాళ్లమీద పడ్డాడు. నుదురు టఫీమంది. ముక్కు బ్రద్దలైపోయింది. ముఖం పచ్చడైంది. రక్తం కారుతూంది. "చచ్చిపోయాను బాబో..."—ఉన్న చివరిశక్తితో గట్టిగా కేక వేసాడు. ఆ కేకను ఉరుములు మ్రింగేశాయి. ఆ కన్నీటిని వర్షం కలుపుకుంది.

ఉదయం... "ఎవడో గతిలేని ముదుసలి బిచ్చగాని శవం" గా ప్రభుత్వపు ఖర్చుమీద దహనక్రియలు పోలీసువాళ్లచే జరుపబడ్డాయి.

# ఫ్రాయిడ్ చివరి రోజులు

సుమారు 67 సంవత్సరాల వయస్సుగల వృద్ధుడు; తెల్లని గడ్డం; బాగా చదువుకున్నవాడులా కనుపిస్తున్నాడు. వ్యాధిగ్రస్తుడై, వియన్నాలోని, మార్క్స్ హాజక్ అనే వైద్యుని హాస్పిటల్‌కు వచ్చాడు. ఆ వైద్యుడు నాసికావ్యాధుల చికిత్సలో ప్రత్యేక ప్రతిభగలవాడు. ఈ వృద్ధుని, గవద, లోపలి భాగంలో ఒకచోట ఒక చిన్ని కూటమిగా, తెల్లటి, గట్టి, అణువులు కనుపించినాయి. ఇదేదో చిన్న శస్త్ర చికిత్సతో తెమిలిపోతుందన్న దిలాసాతో, ఆ వృద్ధుడు ఈ హాస్పిటలుకు తాను వెడుతున్న సంగతే తన కుటుంబంలోని వారికి తెలియపర్చలేదు. కాని శస్త్ర చికిత్స చాలా ప్రమాదకరంగా తయారైంది. ఆ అణువుల కూటమి పుట్టవ్రణమన్నారు (Cancer) ఫోనులో ఈ వార్త విని ఆయన భార్య, కుమార్తె కంగారుగా హాస్పిటలుకు పరుగెత్తుకు వచ్చారు. వాళ్లు వచ్చి చూసే సరికి, గుడ్డలనిండా నెత్తురుమరకలతో ఆయన ఒక ఓటి కుర్చీలో కూర్చునున్నారు.

ఇంటికి తీసుకుపోవటానికి తగిన స్థితిలో లేరు. ఆ హాస్పిటల్‌లో ప్రత్యేకం ఒక గదిగాని, కనీసం ఒక మంచంగాని లేదు. తక్షణావసరంగా ఎక్కడినుంచో ఒక పరుపూ మంచం తెచ్చి, అదివరకే మరొక రోగి ఆక్రమణచేసి వున్న ఒక గదిలో వేశారు. (ఆరోగి, 'థైరాయిడ్' అభావంవల్ల శరీరమే గాక మనస్సు కూడా వికలమైపోయిన ఒక మరుగుజ్జువాడు) ఆ గదిలో ఆయన్ను పడుకోబెట్టి ఆయన కుమార్తె, భార్య భోజనం చేసి రావటానికి వెళ్లారు.

ఇంతలో, ఆయన నోటివెంట రక్తం పుక్కిలింతలుగా బైటికి పొర్లుకు రావటం ప్రారంభించింది. కాని ఆయన గొంతెత్తి పిలువగల స్థితిలో లేరు. ఆ గదిలో వున్న ఆ మరుగుజ్జు ఆయన వున్న అపాయస్థితిని అర్థం చేసుకుని, దబదబా లేచివచ్చి, తనకు అప్పటికి తోచిన ప్రయత్నమేదో చేసి నానా తంటాలూ పడి, అలా రక్తం స్రవించకుండా ఆపు చేయగలిగాడు. సిగ్మండ్ ప్రాయిడ్ ప్రాణాన్ని అలా ఆనాడు రక్షించిన పుణ్యపురుషుడైన ఆయన్ను గౌరవించే అవకాశం గాని, కనీసం ఆయన నామధేయమేమో తెలుసుకునే ఆస్కారంగాని ఈనాటికీ మనకి లేకపోయినా, బ్రిటిషు మానసికశాస్త్రవేత్త డాక్టర్ ఎరెనెస్ట్ జోన్సు, హైవినంగా, మహోమహుడైన ఆ మరుగుజ్జు కారుణిక చర్యను ఉగ్గడించారు.

## వ్యాధి పరిణామం

ప్రాయిడ్ ప్రధాన శిష్యులలో ఒకరైన మానసిక చికిత్సావేత్త డాక్టర్ జోన్సు తన గురువు జీవిత చరిత్రను వ్రాస్తూ, దాల్లో, మూడో సంపుటంలో, ఫ్రాయిడ్ వ్యాధిగ్రస్తుడు కావటం, ఆ వ్యాధివల్ల ఆయన తుదిరోజుల్లో వచ్చిన పరిణామాలూ ఈ చరిత్రనంతా విపులంగా అత్యంత సానుభూతితో వివరించారు. ఈ చరిత్ర కరుణావిలమై హృదయార్ద్రతను కలిగించేదిగా వుండటమే గాక ఊహించటానికి వీల్లేని పరిణామాలకు ఆస్పదమై విభ్రాంతికరంగా వుంది.

తొలి శస్త్రచికిత్స జరిగిన ఆ రాత్రి, ఫ్రాయిడ్ కుమార్తె ఎన్నా (Anna) హాస్పిటల్ నియమాలన్నిటినీ త్రోసిరాజని, తండ్రి వున్న గదిలోనే తాను కూడా పడుకుని ఆయన్ను కంటిరెప్పలా కనిపెట్టింది. ఎన్నా 16 సంవత్సరములు, పితృపాదుల నిరంతర సేవలో నిమగ్నకావటానికి ఆనాడే మొదలు. ఒకొక్కతూరి నెలలతరబడి ఆయన మంచాన్ని కనిపెట్టుకుని, నిద్రకాయవలసివచ్చేది.

శస్త్రచికిత్సచేసి కోసి తీసిన కండరభాగాలను పరీక్షచేసి ఇది పుట్టకురుపని తేల్చుకున్నా, వైద్యులు ఈ విషయాన్ని ప్రాయిడ్‌కుమాత్రం తెలియనివ్వలేదు. కాని,అంగిలి పైభాగాన ప్రారంభమై ఈ వ్రణం పైగవద యావత్తూ వ్యాపించి వుండటమే గాక, బుగ్గతో సహా క్రింది గవద పైభాగంవరకూకూడా వ్యాపించివున్నదని తెలుసుకున్నారు. అందుచేత వెంటనే మరొక శస్త్రచికిత్స చేయవలసివచ్చింది. మెదడుకు రక్తాన్ని చేరవేసే ప్రధాన రక్తవాహికలు (Carotid artery)

రెంటిలో ఒకదాన్ని (కుడివైపుది) మూసివేశారు; పై గవద క్రిందవున్న లాలాజలగ్రంథుల నన్నిటినీ కోసి తీసివేశారు. (ఇవి కుళ్ళి అప్పటికే వాచివున్నాయి). ఈ దశకు శస్త్రచికిత్స జరిగేసరికి, ఇంతటితో ఆగి లాభంలేదని వైద్యులకు తోచింది. పెదవిని, బుగ్గనూ కత్తిరించి నోటిని రెండుగా విచ్చదీశారు; పైగవదను మొత్తంగా తీసివేశారు. అంగిలి పైభాగంలో కుడి పార్శ్వమంతా సంహరించివేశారు; దీనితో ముక్కూ నోరూ ఏకమై ఒకే సొరంగమైంది. భీభత్సమైన ఈ శస్త్రచికిత్సనంతా, మత్తుమందు యివ్వకుండా, శిరః ప్రదేశాన్ని మాత్రం బండబారజేసి (local anesthesia) నిర్వహించారు. భోజనం చెయ్యాలన్నా మాట్లాడాలన్నా, నాసారంధ్రం అన్నవాహిక ఏకమై వుంటే సాధ్యం కాదు. అందుచేత నాసారంధ్రాన్ని మూసివేయటానికి పెట్టుడుపళ్ళు మొదలైనవివున్న ఒక పరికరాన్ని ఫ్రాయిడ్ నోట్లో ధరించవుండవలసివచ్చేది దీన్ని నోట్లోనుంచి బయటికి లాగవలసివచ్చినా, మళ్లీ తిరిగి తగిలించవలసి వచ్చినా చెప్పరాని బాధ పడవలసి వచ్చేది. ఆ బాధను చూచి ఆయన కుటుంబం, ఆ పరికరానికి 'బ్రహ్మరాక్షసి' అని పేరుబెట్టారు. ఒకనాడు ఆ బ్రహ్మరాక్షసిని నోట్లోకి చొప్పించటానికి ఫ్రాయిడ్‌కు గాని, ఎన్నాకు గాని, అక్కడున్న మామూలు డాక్టరుకు గాని సాధ్యం కాకపోయింది. అందుచేత ఆ 'బ్రహ్మరాక్షసి'ని సృష్టించిన అసలు పెద్దడాక్టర్‌ను పిలిపించవలసి వచ్చింది. ఆయనవచ్చి దాన్ని బలవంతాన లోపలికి తోశాడు. నాటినుంచీ అది రోజు రోజూ ఎక్కడో వత్తుకుని పుండౌతూ వుండేది. అదికొంచెం వదులుగా వున్నప్పుడు ఫ్రాయిడ్ ముఖంమీద బొటనవ్రేలుఆని దాన్ని పడిపోకుండా పట్టుకు కూర్చునుండేవారు.

ఆయనవాక్కు, బొకనాసివాడి మాటలాగా ముద్ద మాటగా తయారైంది. గొంతుమధ్యనుంచి చెవి కేంద్రంలోకివుండే శ్రోత్రనాళిక దెబ్బతిని పోవటంచేత కుడి చెవి వినిపించకుండా పోయింది. మనోనిదానం (Psychoanalysis) చేసేటప్పుడు, ఫ్రాయిడ్, మామూలుగా వ్యాధిగ్రస్తుని పక్కకు ఎడమవైపున కుర్చీ వేసుకుని కూర్చుని కుడిచెవితో అతనిసంభాషణ వినేవాడు. ఇప్పుడు రోగి పడకునేమంచానికి కుడి ప్రక్కగా కుర్చీ వేసుకుని ఎడమ చెవితో వినవలసివచ్చింది.

ఈదశలో, తన మాతృభాషలో (జర్మన్) మాట్లాడుతుంటేనే, ఫ్రాయిడ్‌మాట అంతంత మాత్రంగా బోధపడేది. ఇక విదేశభాషలలో మాట్లాడుతున్నప్పుడు ఎంతో అగమ్యగోచరంగావుండి తన అభిప్రాయాన్ని అవతలివాడికి బోధపరచటానికి నానా తంటాలూ పడేవాడు; (అతఃపూర్వం ఫ్రాయిడ్ ఆంగ్ల, ఫ్రెంచిభాషలు అనర్గళంగా మాట్లాడేవాడు). ఒక తూరి ప్రసిద్ధగాయకుడు నైవెట్ గిల్బర్ట్‌తో చలోక్తిగా ఇలా అన్నాడు: "Meine prothese spricht nicht franzos sch!"— ("నా పెట్టుడునోరు ఫ్రెంచిభాష మాట్లాడదు!").

తరువాతి 16 సంవత్సరాలలోనూ, 33 పర్యాయములు శస్త్రచికిత్స చేయించుకున్నట్లు జోన్సు తన గ్రంథంలో ఆ ఘట్టాలనన్నిటి సవివరంగా వర్ణించారు. (ఇవిగాక ఎక్స్-రే, రేడియో వగైరా చికిత్సలు అనంతం). వీటి అన్నిటిలో ఫ్రాయిడ్ స్వయంగా చేసుకున్న శస్త్రచికిత్స ఒకటి విచిత్రమైంది. శుక్ల నాళాలను బంధించి, శుక్లవాహినులను ఊర్ధ్వముఖం చేస్తే, అవి పుట్ట వ్రణక్రిములను ఎదుర్కోగలవని ఆయనకు ఒకవిశ్వాసం కలిగింది. ఈ శస్త్రచికిత్సను తనకుతాను స్వయంగా నిర్వహించుకున్నారు. ఈ ప్రయోగంవల్ల అలాంటి ఫలితమేదీ కలిగినట్టు నిదర్శనం లేదు.

## ఆర్థిక దుస్థితి

మొదటి ప్రపంచయుద్ధం ముగిసిన తొలిరోజుల్లో ఆయనకు సంపాదనేమీ లేకుండాపోయింది ద్రవ్యోల్బణ స్థితివల్ల ఆయన కూడబెట్టిన 30,000 డాలర్లూ కర్పూరంలా హరించిపోయినాయి. ఆస్థితిలో జోన్స్, మానసిక చికిత్సకోసం ఆయన దగ్గరకు ఇద్దరు రోగులను పంపాడు, అమెరికా దేశీయుడొకడు, బ్రిటిష్‌వాడొకడూ. మనోనిదానం జరిగిన ప్రతి దఫా వారు 5 డాలర్లు చొప్పున చెల్లిస్తూ వుండేవారు. ఇంత స్వల్పంగా ఫ్రాయిడ్ ఎప్పుడూ పుచ్చుకోలేదు. ఈ రెండు కేసులు పంపినందుకే ఫ్రాయిడ్ జోన్సుకు ఎంతో కృతజ్ఞత తెలియజేశాడు. 'వీళ్లు రాకపోతే అసలు సంసారం గడిచేదేకాదు' అన్నారు ఫ్రాయిడ్. ఫ్రాయిడ్ జీవితంలో, ఒకప్పుడు, ఎంతడబ్బు కావాలనుకుంటే అంత డబ్బు సంపాదించటానికి అవకాశాలు అనేకం వచ్చాయి. 1920 లో 'కాస్మాపాలిటన్'

పత్రిక, వ్యాసానికి వెయ్యిడాలర్ల చొప్పున యిస్తాను వ్రాయమని కబురు చేసింది. కాని ఫ్రాయిడ్ దీనికి అంగీకరించలేదు. ఎందుచేతనంటే, ఫ్రాయిడ్ వ్రాయవలసిందేవిటో ఆ పత్రిక సంపాదకులే నిర్ణయించారు. "మానసిక బలంరీత్యా 'భార్య'కు గృహంలో వుండవలసిన స్థానమేట్టిది?"— అనే శీర్షికతో వ్రాయమన్నారు. 1940 లో 'ట్రిబ్యూన్' పత్రిక సంపాదకవర్గంలోని జార్జ్ సెల్‌డెస్ ఒక కేబుల్ వార్త పంపాడు— "చికాగో వచ్చి లియొపాల్డ్, లోయెబ్‌లకు, మనోనిదాన చికిత్స (Psychoanalysis) చెయ్యండి; 25000 డాలర్లు లేదా మీరు కోరిన మొత్తం ఇస్తారు"— ఇదే కార్యం నిమిత్తం కోరిన మొత్తం యిప్పిస్తాను రమ్మని 'హెర్‌స్ట్'కూడా వార్త పంపాడు. ఇదిగాక ఇతర ప్రయాణీకుల బాదరబందీ లేకుండా ఏకాంతంగా ప్రయాణం చేయటానికి ప్రత్యేకంగా ఓడను కూడా పంపుతామన్నారు. ఫ్రాయిడ్ అతి నిర్లక్ష్యంగా ఈ ఆహ్వానాన్ని నిరాకరించారు.

దారిద్ర్యబాధ ఇలా వుండగా, ఆ యుద్ధానంతర దశలో, తనకు జీవితావసరాలనుకుంటున్న వస్తువులుకూడా దొరక్క ఫ్రాయిడ్ చాలా కించపడేవారు. ముఖ్యంగా చుట్టలు దొరికేవి కావు వియన్నాలో; ఆస్ట్రియా ఇంచుమించు దివాలా స్థితికి వచ్చేసింది. విదేశాలనుంచి చుట్టలు ఎవడు దిగుమతి చెయ్యనిస్తాడు? అందుచేత ఆయన్ను చూడవచ్చే మానసిక శాస్త్రవేత్తలు దొంగతనంగా చుట్టలు జేర వేస్తూ వుండేవారు. గవదలో పుట్టవ్రణం లేవటానికి కారణం చుట్టలే కావచ్చునని ఆయనకు తెలిసివున్నా, వాటిని వదులుకోలేదు. ముడుచుకుపోయిన దవడలు, పైగా నోట్లో ఆ రాక్షసి — చుట్టకాల్చుటమెలా? దేంతోనన్నా నోరు బలవంతాన విచ్చదీసుకుని, ఎట్లాగొట్లా చుట్టను పళ్ళసందుకు దోపేవారు. అంత బాధపడవలసివున్నా రోజుకు నాలుగుసార్లయినా చుట్ట కాల్చేవారు. ఒకసారి ఆయనకు గుండెజబ్బు వచ్చింది. దాని కారణంగా గొంతునొప్పికూడా వచ్చేది. అప్పుడు కొన్నాళ్లు చుట్టమానేశారు. ఇది 'ఆటోటోమీ' అని గొప్పగా చెప్పేవారు. (కీటకాదులు, పాడయిపోయిన కాళ్లు మొదలైన అవయవభాగాలను విసర్జించి వేయటాన్ని 'అటోటోమీ' అంటారు.) కాని ఈ విసర్జన ఎన్నో రోజులు సాగలేదు. 23 వ రోజు మళ్లీ చుట్ట ముట్టించారు. ఆ దశలోనే, ఆయన హంగేరియన్ శిష్యుడు శాండర్ ఫెరెన్స్‌జీ, గురువుగారి గొంతునొప్పికి కారణం మానసికావేశం తప్ప మరొక శారీరకస్థితి యేమీ కాదనీ, తాను వియన్నా వచ్చి మనోనిదాన చికిత్సచేసి నయం చేస్తాననీ వ్రాశాడు. అప్పుడు శాండర్ తను స్వయంగా మతి కోల్పోతున్న స్థితిలో వున్నాడు. ఫ్రాయిడ్ అతని ఉత్తరంచూసి చాలా సంతోషించారుగాని—అక్కర్లేదు పొమ్మన్నారు.

## మనస్పర్థలు

ఫ్రాయిడ్‌కీర్తి విస్తరించింది. ఆయన నిర్వచించిన ప్రాథమికసూత్రాలను పలువురు అంగీకరించి ప్రచారానికి వచ్చాయి. దాంతో కొద్దీ, గొప్పా, గౌరవాలు పొందుతూ వచ్చారు. కాని ఆయనకు 'నోబెల్' బహుమతిరాలేదు. పలుకుబడిగల మిత్రులెందరో ఆయనకు ఆ బహుమతి యిప్పించాలని యెన్నో పర్యాయములు ఎంతో తంటాలు పడ్డారు. ఇదంతా చూచి ఫ్రాయిడ్‌కు చిరాకెత్తింది: 'ఆ నోబెల్ భూతాన్ని వెన్నాడటం ఇక మానండి' అని ఆయన అమిత్రులను హెచ్చరించారు. తాను తిరుగులేని సత్యాలను కనుగొన్నానని ఆయనకు మూఢవిశ్వాసంలాంటి ఆత్మాభినివేశం కలిగిపోయింది. కాస్త, వాటిలో దోషలేశాలున్నాయని యెవడు వేలెత్తిచూపప్రయత్నించినా, వాణ్ణి చేరా చెంతలా చేరనియ్యకుండా కుక్కను తరిమినట్టు తరిమేవారు.

అలాంటి స్వల్ప మతభేదాలే వచ్చి, ఆడ్లర్, యూంగ్, స్టెకెల్ మొదలైనవాళ్లు అప్పటికే దూరస్థులయారు. 1920 అనంతరం, ఆటో రాంక్, విల్‌హెల్మ్ రెయిచ్, అవతలకు తప్పుకున్నారు. వీరిలో ఆటో రాంక్ అకారణావేశనైరాశ్యాలతో బాధపడుతూ (Manic-depressive Psychosis) వుండేవాడు. అతను ఈ వ్యాధితో బాధపడుతున్నట్టు మొదట్లో అతని సన్నిహితులు ఎవ్వరికీ తెలిసిందిగాదు. చివరికి ఫ్రాయిడ్ అంటే పడి ప్రాకులాడే ఫెరెంజీ కూడా తప్పుకున్నాడు. ఇతను జీవితంపొడుగునా అనుభవించిన మనోవ్యథలు కారణంగా చివరకు రక్తపాండువకు లోనైనాడు; మెదడు భాగాలు కూడా చెడిపోయినాయి. మిత్రులంతా దూరస్థులౌతున్నాకూడా ఫ్రాయిడ్ తన సిద్ధాంతాన్ని

వదులుకోలేదు. "మన ఆశయం—మన పరమ ప్రయోజనం ఒక్కటే — మనోనిదానవిధానం" (Psychoanalysis) అన్నాడు. విల్ హెల్మ్ స్టెకెల్, ఎంతో ఉదారహృదయంతో వ్యవహరించి, తన గురువుతో వచ్చిన పొరపొచ్చలను తిరిగి సర్దుకోవటానికి ప్రయత్నించాడు. కాని ఫ్రాయిడ్ ససేమిరా అతన్ని తిరిగి దగ్గరకు రానియ్యలేదు. ఆడ్లర్ మరణవార్త విన్నప్పుడు కూడా ఫ్రాయిడ్ హృదయం కరగలేదు. "మనోనిదాన విధానాన్ని వ్యతిరేకించినందుకు మంచిపని జరిగింది" నే ధోరణిలో మాట్లాడారు.

ఈ చివరిదశలో, మనోనిదానంలో గాని, తచ్చికిత్సా విధానంలో గాని ఫ్రాయిడ్ క్రొత్తగా చేసిన మార్పు కూర్పులేమీ లేవు. ఆ దశలో చాలా గ్రంథాలు వ్రాసినా అవన్నీ పెద్ద ప్రయోజనకరమైనవి కావు. మానసికశాస్త్రాన్ని వేదాంత విషయాలతో కలగాపులగం చేయటానికి ఆయన మొదటనుంచీ వ్యతిరేకి అయి వుండికూడా, ఈ గ్రంథాలలో చాలా వేదాంతధోరణి కనుపించుతుంది.

ఈ రెండు దశాబ్దాలలో ఫ్రాయిడ్ వ్రాసిన గ్రంథాలలో ప్రధానమైనవి—(1) 'నాగరకత—దానివల్ల కలిగిన అసంతృప్తులు' (Civilization and its discontents) (2) 'ఏకేశ్వర వాదము—మోసెస్' (Moses and Monotheism). మొదటి గ్రంథంలో ఒక దారీ డొంకా లేకుండా, 'సృష్టిలో మానవుని స్థానం' దగ్గరనుంచీ, విరహాభయందాకా యిదీ అదీ అని లేకుండా, సమస్త విషయాలూ చర్చించారు. ఇక రెండో పుస్తకం సంగతి: మోసెస్ యూదు జాతీయుడు కాడని, అతను ఈజిప్షియన్ జాతిలో నే ఏదో అగ్రవర్గంలో పుట్టివుంటాడనీ ఫ్రాయిడ్ విశ్వాసం. తన సిద్ధాంతాన్ని ప్రబోధించటానికి యూదులను ఎన్నిక చేసుకున్నాడట. అందుకనే "ఎన్నిక చేయబడిన ప్రజలు" ("Chosen people") అనే ప్రశస్తి వచ్చిందట. ఈజిప్టులో వచ్చిన మత విప్లవంతో, అఖ్ నాటన్ ప్రబోధించిన ఏకేశ్వరవాదం ఈజిప్టులో తుడిచి వేయబడగా, దాన్ని పునరుద్ధరించటానికి మోసెస్ ప్రయత్నించాడట. మతమనేది అదోకరకమైన "మానసిక వ్యాధి" Universal obsessional neurosis) ఈ అభిప్రాయాన్ని బలపరచటానికి ఫ్రాయిడ్ ఈ గ్రంథంలో చాలా ప్రయత్నం చేశాడు. మోసెస్ 'ఏకేశ్వరు' డన్నది, అతని అజ్ఞాత మనోవీధిలో (Subconscious) ద్యోతమానమైన "పైతృకమూర్తి" యొక్క స్ఫురణయే నన్నాడు. జోన్సు దీనిమీద వ్యాఖ్యానించుతూ ఇలా అన్నారు. "మతమనేది అజ్ఞాతమనోవీధిలో వున్న భావ సంఘర్షణల స్వరూపమని ఫ్రాయిడ్ సర్వదా వక్కాణించుతూవుండేవారు. ఈ గ్రంథంలో మతమనేది జరిగిపోయిన సంఘటనల అనుభూతి స్వరూపమనే అభిప్రాయానికి విశేష ప్రాధాన్యత నిచ్చారు." ఫ్రాయిడ్ స్థాపించిన ఈసిద్ధాంతంలో—జోన్సు వగైరా 'మనోనిదాన'సిద్ధాంతానుయాయులు గుర్తించటానికి నిరాకరించినా-యూంగ్ స్థాపించిన 'ఆదిమ రూపాలస్మృతి' (Reminisience of the "arc‑etypes) సిద్ధాంతానికి బీజాలు కనుపించుతున్నాయి.

## కాందిశీక జీవితం

జర్మనీలో నాజీలు అధికారంలోకివచ్చి చిరకాలమైనా, ఫ్రాయిడ్ వియన్నానుంచి కదలటానికి నిరాకరించి మొండిచరిచి అలాగే కూర్చున్నారు. ఆస్ట్రియా-జర్మనీల ఏకీకరణజరిగి(1938),నల్లచొక్కాల నాజీలు తనగదిలో ప్రవేశించి జాతరచేసేవరకూ, ఆయన ఆ మొండితనం వదల్లేదు. అదృష్టవశాత్తూ జోన్సు ఎలాగోఓలాగు నానాతంటాలుపడి ప్రేగ్ నుంచి ఒక విమానం కుదుర్చుకొచ్చి, పట్టుబలవంతాన లాక్కుపోయేదాకా ఆయన ఇంగ్లండుకు బయలుదేరటానికి అంగీకరించలేదు. ఈ ప్రయాణాన్ని సమకూర్చటానికి జోన్సు, మూడు మాసములు యమయాతనలు పడ్డాడు. తనకున్న పలుకుబడినేకాక, బ్రిటన్లో వున్న అనేకమంది పెద్దలపలుకుబడిని వినియోగించాడు. ఫ్రాన్సులో వున్న అమెరికా రాయబారి సి. బుల్లిట్ను పట్టుకున్నాడు. ఫ్రాంక్లిన్ రూజ్ వెల్ట్, ముసులోనీల మాట సాయంకూడా పొందవలసివచ్చింది. అప్పుడు ఫ్రాయిడ్ గుండెజబ్బు చాలా అధికంగావుంది. కాని 'నైట్రోగ్లిసరిన్' చికిత్సల సహాయంతో, ఈ ప్రయాణాయాసాన్ని తట్టుకోగలిగాడు. లండన్లో ఆయనకు అఖండమైన స్వాగతం లభించింది. అనంతరం ఫ్రాయిడ్ తనకు యేర్పాటుచేసిన నివాసం, తోటా, దొడ్డీచూచి చాలా ఆనందపడ్డాడు. ఇదంతా హిట్లరు చలవవల్లనే జరిగింది

గనుక ఈ ఆనందంలో "హాయిల్ హిట్లర్!" అని అరవాలనివుందని చలోక్తి విసిరారు.

ఈ ప్రవాసానికి పూర్వం, రెండు సంవత్సరాలలోనూ ఫ్రాయిడ్ మరి రెండు శస్త్రచికిత్సలు చేయించుకున్నారు. కాని లండన్ వచ్చినతరువాత బాగా కోలుకున్నారు 82 సంవత్సరాల వయస్సులో, రోజుకు దాదాపు నలుగురు మానసిక వ్యాధిగ్రస్థులను పరీక్షించగల స్థితికి వచ్చారు. కాని, 1939 లో మళ్ళీ కాన్సర్ బయటబడ్డది. ఈతూరి డాక్టర్లు శస్త్రచికిత్సకు అవకాశం లేదని, నయంకాదని చెప్పేశారు.

ఫ్రాయిడ్‌కు మత్తుమందులు లాంటివి వాడటం ఇష్టంలేదు. ఇన్ని సంవత్సరాలుగా బాధలు పడుతున్నా అల్లాంటివి ఎప్పుడూ వాడలేదు. ఈతూరి అప్పుడప్పుడు ఆస్పరిన్ వేసుకోవటానికి అంగీకరించారు. సెప్టెంబర్ 21 తేదీన, డాక్టర్ మాక్స్ స్కూర్ ను పిలిచి ఈ బాధ ఇక భరించేదిగా లేదు యేదైనా మత్తుమందు యివ్వండి— ఇక యీ మడిగట్టుకు కూర్చోవటంవల్ల ప్రయోజనం కూడా కనుపించదు" అన్నాడు అనంతరం రెండురోజులకు చనిపోయారు—అప్పటికి ఆయన వయస్సు 83 సంవత్సరాలు.

## ఇంద్రజాలం : మరణేచ్ఛ

జోన్సు ఫ్రాయిడ్ అంటే ఎంత బ్రహ్మరథం పట్టేవాడైనా ఆయనలోవున్న వ్యగ్రతలను కొన్నింటిని వివరించక పోలేదు.

(1) నేను కచ్చితమైన శాస్త్ర విజ్ఞానవేత్తనని పదే పదే చెబుతూవుండి కూడా, ఫ్రాయిడ్, లామార్క్ సిద్ధాంతాన్ని పట్టుకు ప్రాకులాడేవారు. (ఈతరంలో చేసుకున్న అలవాట్లు వచ్చేతరానికి సంక్రమించుతాయనేది లామార్క్ సిద్ధాంతం)—ఇప్పుడు శాస్త్ర విజ్ఞాన ప్రపంచంలో భూమి బల్లపరుపుగా వున్నదనే సిద్ధాంతానికి ఎంత ప్రామాణ్యత వుందో దానికి కూడా అంతే ప్రామాణ్యత వుంది.

(2) మంత్ర తంత్రాలపట్ల అతిమానుషశక్తుల పట్ల ఫ్రాయిడ్‌కు కొంత విశ్వాస ముండేది. అడ్డదిడ్డంగా ఆ విషయమై అతుకులబొంత అభిప్రాయాలతో ఏదో ఒక గ్రంథాన్ని ప్రకటించలేదన్న మాటే గాని, "వాటిలో పరిశీలన చెయ్యవలసిన విషయం చాలా వున్నదని" తన అనుయాయులతో పదే పదే అంటూ వుండేవాడు.

(3) ఫ్రాయిడ్‌కు సంఖ్యా జ్యోతిషంలో కూడా నమ్మక ముండేది. ఆయన స్నేహితుడు విల్ హెల్మ్ ఫ్లయిస్‌కు ఈ పిచ్చి బాగావుండేది. మహాపురుషుల జీవితాలలో, 23, 28 వరుసక్రమదినాలలో చాలా గొప్ప సంఘటనలు జరిగాయని, ఆసంఖ్యలకు చాలా ప్రాధాన్యత వున్నదనీ ఆయన వాదం. అనంతరదశలో ఫ్రాయిడ్ ఈ మిత్రుని పిచ్చికి అంగీకరించక పోయినా, తాను వేరే మరిరెండు సంఖ్యలు చేపట్టారు. 61, 62 సంవత్సరాల వయస్సులో చచ్చిపోతానని అంటూ వుండేవారు. ఆగడువుదాటిన తర్వాత ఆసంఖ్యను 85½ కు మార్చారు ఆవయస్సులోనే తన తండ్రీ అన్నగారూ చనిపోయారట. అందుచేత తానుకూడా ఆ వయస్సులో చావవలసి వుందని నిర్ధారణ చేసుకున్నారు.

మృత్యువునుగురించి ఆయన నిరంతరం ఆలోచిస్తూనే వుండేవారు. మృత్యుభయం, అజ్ఞాత మనస్సులోని మరణ వాంఛ ఇవి ఆయన్ను నిరంతరం వెన్నాడుతూనే వున్నాయి. ఫ్రాయిడ్ తల్లి 95 ఏండ్ల వయస్సులో మరణించారు. ఆవిడమరణంపట్ల ఫ్రాయిడ్ ప్రదర్శించిన మనస్థితి విచిత్రమైంది. చనిపోయేముందు ఆవిడ చాలా బాధపడ్డది. ఆబాధ నుంచి విముక్తి పొందినందుకు ఫ్రాయిడ్ చాలా సంతోషించారు. అంతేకాదు ఆవిడకు దుఃఖంకలిగించకుండా తానిక స్వేచ్ఛగా చచ్చిపోవచ్చునన్నారు. తానుముందు చచ్చిపోతాననీ అందువల్ల తన తల్లి భరించరానిదుఃఖం అనుభవించవలసివస్తుందనీ ఆయన నిరంతరం భయపడుతూ వుండేవారు. జోన్సు ఈవిషయమై వ్యాఖ్యానించుతూ, "మృత్యువుద్వారా తన తల్లిని చేరుకోవటానికి అవకాశం వుంటే తప్ప మృత్యు బాధను భరించటం దుర్లభమని ఫ్రాయిడ్ అజ్ఞాత మనస్సులో (Unconscious) అవ్యక్తమైన బాధవుండేది. ఇది ఫ్రాయిడ్ నిర్వచించిన మాతృప్రియత్వ భావము యొక్క (Oedipous Complex) పరిణామమే.

## ఫ్రాయిడ్ ప్రభావం

ఫ్రాయిడ్ సిద్ధాంతాల పేర చెత్తచెదారం అనేకం చెలామణీ అవుతుంటాయి. వాటిపట్ల ఎవరికి వారు వాచావాత్సల్యం ప్రకటించటం తప్ప వాటిని మనస్ఫూర్తిగా అంగీకరించి ఆచరణలో పెడుతున్నారన్న నిదర్శనం లేదు. నిరాకరించటానికి ఇషం లేక కేవలం వాచావాత్సల్యం చూపి ఉపేక్షించి అవతలకు త్రోసివేయటంగా వుంది.

కాని మానసిక శాస్త్రానికి ఫ్రాయిడ్ చేసినసేవ అమోఘమైంది. శారీరక వ్యాధులుగా చెలామణీ అవుతూ అర్థం గాకుండా వున్న అనేక వ్యాధులను మానసిక వ్యాధులుగా గుర్తించి వాటికి ఒక ప్రత్యేకమైన చికిత్సావిధానాన్ని స్థాపించాడు. మహత్తర దశను అందుకున్న మానసిక చికిత్సావిధానానికి ఆయన స్రష్ట. మామూలు ప్రజానీకంలో కూడా, మానసిక వ్యాధిగ్రస్తులపట్ల పూర్వం చూపబడే దారుణమైన దృక్పథంపోయి సానుభూతితో చూడటం, వాళ్ళను అర్థంచేసుకుని ఆదరణతో చూడటం అధికమైంది. ఇందుకు ప్రపంచం ఫ్రాయిడ్‌కు ఎంతైనా ఋణపడి వుంది. విజ్ఞానశాస్త్రంలో మైక్రోస్కోపు అవతరణ ఏలాంటిదో మానసికశాస్త్ర విజ్ఞానంలో ఫ్రాయిడ్ మనోనిదానవిధానం అలాంటిది — ఈ రెండూ అతః పూర్వం ఊహకు కూడా అందని నూత్న ప్రపంచాలను మానవుని దృక్పథానికి తెచ్చినాయి.

శాస్త్రవిజ్ఞానరంగం మాట అటుంచి సాంఘిక రంగంలో ఫ్రాయిడ్ ప్రభావం అనంతం. కేవలం తనకు వ్యక్తమౌతున్న కారణాలవల్లనే కాక అవ్యక్తములైన అనేక ఆంతర శక్తులవల్ల తాను చోదితుడౌతున్నానని మానవుడు తెలుసుకోగలిగాడు. యోజనగల ప్రతి ఒక్కరూ, తన్ను తాను సంపూర్ణంగా అర్థంచేసుకోగలగటమే దుర్లభమనీ, అల్లాటప్పాడు ఇతరులను సంపూర్ణంగా అర్థం చేసుకోగలగటం మరింత దుర్లభమనీ గ్రహించగలుగుతున్నారు. అందుచేత ప్రపంచంలో పరస్పర సానుభూతి పెంపొందటానికి ఎంతో అస్కారం యేర్పడ్డది. మానవునిలో అవ్యక్తంగా అణగివున్న భీభత్స స్వభావాలకంటే మానవజాతికి భయంకర శత్రువు మరొకటి లేదు. ఈ విషయం సర్వులకు నేడు అవగత మౌతున్నదంటే — అందుకు ప్రపంచం ఫ్రాయిడ్‌కు ఎంతో కృతజ్ఞమై వుంది. అజ్ఞానం కారణంగా ప్రస్తుతం జగత్తులో చెలరేగుతున్న రాగద్వేషాలు నశించి మానవజాతి మరో వెయ్యిసంవత్సరాలు మని వుండటానికి ఆస్కారం కలిగితే, ఆంతరములైన భీభత్స స్వభావముల ఉనికిని పసికటి వాటిని అదుపులో వుంచటానికి తగిన విధానాన్ని కనుగొన్న మహాపురుషుడుగా లోకం చేతులెత్తి ఫ్రాయిడ్‌కు జోహార్లు చేస్తుంది. [ 'టైమ్' పత్రిక సౌజన్యంతో ]

# లోయలు

శ్రీ ఆర్. యం. చిదంబరం

ఆ మాటలు విని చటుక్కున ఆగిపోయాను.

విశ్రాంతి సమయంలో ఉపాధ్యాయులు ఏంచేస్తున్నారని పరిశీలించటం నా ఉద్దేశం కాకపోయినా ఏదో పనివుండి స్టాఫ్‌రూం వైపు వెళ్లటం జరిగింది.

'భాస్కరానికి వచ్చేవారం పెళ్లటండి—ఇంకా ఏడు రోజులుంది. మీకందరికి శుభలేఖలు అందే ఉంటాయి. మనం ఎలాగూ వెళ్లలేంకనక, కనీసం కంగ్రాచ్యులేషన్స్ తెలుపుతూ, టెలిగ్రాం యివ్వాలి. అందుకు మీవంతు నాలుగణాలు ఇలా పడేయండి.'

అది హిందీమేష్టారి కంఠం—మంచికీ, చెడ్డకూ ఆయన ముందంజ వేస్తాడు.

'ఇంతకూ పెళ్ళికూతు రెవరు?' అని సైన్సు మేష్టారు ప్రశ్నించారు.

'ఇంకెవరు?'

సమాధానం కోసం చెవులు నిక్క బొడుచుకున్నాయి.

ఏదో పేరు చెప్పారు కాని అది పకపకల అడుగున మరుగుపడిపోయింది. 'భాస్కరం' అన్న పేరు అయస్కాంతంలా ఆకర్షించింది. లోపల ఎలాంటి సంఘర్షణలు ఉన్నా పైకి గంభీరంగా వున్నట్లు నటించడం నా హోదాకి అత్యావసరమైనా మానవ హృదయంలో సహజంగా చెలరేగే చాంచల్యాన్ని అణచి ఉంచలేకపోయాను. ఆకాశంలో మెరుపు మెరిసినంత మాత్రాన నేను జడుసుకోను. ఆ వెలుగును భరించటం శక్తి కతీతమైతే ఒక్కక్షణం కళ్ళు మూసుకుని చీకటిలో నా భయాన్ని దాచుకుంటాను. కాని ఒక్కసారి అనంతమైన వెలుతురు నన్ను చుట్టుముట్టితే?...

నెమ్మదిగా గదిలో అడుగు పెట్టాను.

అందరి కళ్ళూ రెండుసార్లు బద్ధకంగా కళ్ళు విరుచుకున్నట్టు పైకీ కిందికీ ఆశ్చర్యంగా కదిలాయి. అందరూ లేచి నిలబడి నన్ను గౌరవించారు.

'భాస్కరం పేరు సంభాషణలో దొర్లితే...' అంటూ అర్థపూరితంగా హిందీ మేష్టారివంక చూశా.

'మరేనండి. అతనికి వారంగోజుల్లో వివాహం జరగనున్నది. తమ కీపాటికి శుభలేఖ అందే వుంటుంది.' అంటూ వినయంగా సమాధాన మిచ్చాడు. ఆ చివరి వాక్యంలో ఎత్తిపొడుపు ధ్వనించినా నాకు శుభలేఖ అందినదీ లేనిదీ ఆయనకు తెలియదు కనక అది కేవలం నా భావనని నిర్ణయించాను. బల్లమీద వున్న కాగితం చూశాను.

అవును...ఆ అమ్మాయే పెళ్లికూతురు. నాచుట్టు అగ్నిజ్వాలలు కల్పించి తను నవ్వుతూ అంతర్థానమైంది. అల్లావుద్దీన్‌కు మల్లే శ్మశాన సమానమైన సామ్రాజ్యం కోసం—అందుకోసం పోరాటం సాగించి ఓడిపోయాను. ఒక్కసారిగా వణుకూ జ్వరం వచ్చినట్టయింది. అనుభూతుల్ని త్రొక్కివుంచి బయటికొచ్చాను. భాస్కరం అనేవ్యక్తి ఓ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే నాకు బాధ లేకపోను. కాని అది కొన్ని మనస్తత్వాల్ని బాధించి బంధించిన ఉరిత్రాడులాంటిది. అర్థరాత్రి శ్మశానంలో నక్క కూతల్లా ఉపాధ్యాయుల వికవికలు నా చెవుల్లో విషసర్పాలకు మల్లే బుసలు కొట్టాయి. ఈ విషయంలో అందరికీ నేను చులకనై పోయాను—ప్రపంచంలోని వీరులందరినీ ఓడించిన వస్తాదు చిన్నపిల్లాడికి వంగి నమస్కరించినట్టు—చెట్టుకూ తనకూ బంధుత్వం అస్తమించగా నేలజారిన ఆకులా చిరునవ్వు పెదవులమీద కనిపించి అదృ

నాకు కలిగిన మొదటి సందేహం. భాస్కరం తన వివాహంగురించి నాకెందుకు తెలియపరచ లేదు? బహుశా మర్చిపోయి వుంటాడు. ఈ దీర్ఘకాలములో అతనికి చాలామంది వ్యక్తులతో పరిచయం ఏర్పడివుంటుంది. కొంతమందితో ప్రాణస్నేహం ఏర్పడి వుండవచ్చు. సంధ్యాకాశంలో వివిధవర్ణాలు క్రమంగా మరుగు

పడినట్లు అతని స్మృతిపథంలో నీడగానైనా లేకపోవచ్చు... కాని... కాని—తర్కం ద్వారా యీ విధంగా కలిగేతృప్తి అతి స్వల్పం—క్షణికం కూడా—తార్కశాస్త్రం అరవయి నాలుగు లక్షణాలూ వున్న మానవుణ్ణి సృష్టించి తీర్చి దిద్దుతుంది. కాని అందులో జీవంమాత్రం వుండదు—ఏమిటి ప్రయోజనం? భాస్కరం ఫిలాసఫీతో నాకు ప్రమేయంలేదు. జీవితంలో క్రమంగా స్థిరపడిపోయిన అభిప్రాయాలు నాకూ వున్నాయి. 'తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం' అంటాను నేను. దీన్ని ఖండించేవారు చాలామంది—కాని వారి వాద ప్రతివాదాలతో నాకు సంబంధంలేదు. చెట్టుమీద పక్వానికి వచ్చిన ఫలంవుంది. అది నాకు కావాలి. అందే వరకూ యత్నిస్తాను. ఎదుర్కున్న విపరీతశక్తుల్ని ఎదిరిస్తాను. అదీ నా తత్వం—కొందరు హితబోధ చేయవచ్చు:

'పోనిద్దూ!...ఎందుకంత శ్రమ! అదుగో నేల మీద రాలిన మరోఫలం వుంది. అంతమంచిది కాకపోయినా ఫరవాలేదు. తీసుకో—అడ్డంకులు లేవు.' అని.

నాగదికి వచ్చాను. ఆరోజు వచ్చిన టపా బల్లమీదవుంది. విద్యాశాఖాధికారి దగ్గర్నుంచి వచ్చిన రెండు మూడు వుత్తరాలు తప్పించి అందులో ఏఁవీ లేదు. ఇంటి విలాసానికి వచ్చిన టపా తీసుకుని ప్యూను మరో అయిదునిమిషాల్లో వచ్చాడు. అందులోనైనా భాస్కరం రాసిన వుత్తరం వుంటుందని ఆశించాను. ఏఁవీ లేదు—బంధువుల దగ్గర్నుంచి వచ్చిన రెండుత్తరాలు—మాడరన్ రెవ్యూ—గదికి తాళం వేయమని ఇల్లుచేరుకున్నాను. స్నానంచేసి కుర్చీలో కూర్చున్నా—అద్దంలో ప్రతిబింబం కనిపించింది.

అప్పటికీ, ఇప్పటికీ ఎంత వ్యత్యాసం! ఆలోచనలు అడ్డదిడ్డంగా సాగిపోయాయి.

* * *

'మేష్టారూ! మిమ్మల్ని ఓమాట అడగాలనుకుంటున్నానండి' అన్నాడు భాస్కరం.

అతనిముఖంలో అశాంతివుంది. కొద్దిగా సిగ్గుకూడా మిళితమైవుంది. భాస్కరం కొత్తగా చేరిన వుపాధ్యాయుడు. అతనికి జీవితానుభవంలేదు. అప్పుడే కాలేజీనుండి విడుదలైవచ్చినా ఆ కొంటెతనం లేదు. ఏదో వస్తువు పారేసుకుని దాన్ని వెతుక్కుంటూవచ్చి యీ స్కూల్లో దొరుకుతుందన్న ఆశతో యిక్కడ చేరాడనుకుంటాను.

'ఏమిటి భాస్కరం?' అనడిగాను.

'మరి...మరి...మీరేమీ అనుకోకుండా వుంటే—అసలు అడగటానికే సంకోచంగావుంది. అయినా మీదగ్గర అడగటానికి భయం ఎందుకు' అని తనలో తనే మాట్లాడుకున్నట్టు అన్నాడు.

నాకు తెలుసు—భాస్కరానికి నేనంటే చాలా గౌరవం వుంది. ఆ స్కూల్లో పదిసంవత్సరాలుగా పనిచేస్తున్నాను. కనక అనేక విషయాలు అడిగేవాడు. అతనికే కాదు. తోటి ఉపాధ్యాయు లందరికీ ఓ విధమైన ఆప్యాయత—అనురాగం వున్నాయి.

'విమలను మీకు బాగా తెలిసే వుంటుంది—ఆ అమ్మాయి ఎలాంటిది?'

అతని కళ్ళల్లోకి చూశాను. ఏదో క్షమించరాని అపరాధం చేసిన వాడిలా కనిపించాడు. నిజానికి ప్రతి మానవుడూ మనసులో ఎన్నో వూహించుకుంటాడు. అందులో కొన్ని సంఘం ఆమోదించినవీ వుంటాయి. తిరస్కరించినవీ వుంటాయి. అందుకని ఆమోద ముద్ర పొందని భావాలు ఎక్కడా బయటికి పొంచి చూడకుండా మాటలోనూ చేతల్లోనూ అతి జాగ్రత్తగా వుంటాడు. మానవహృదయంలోవుండే అభిప్రాయాన్ని విభజించి వ్యక్తం చేసే 'ఎక్స్‌రే' యంత్రం వుంటే ఎంత బాగుండును.

'స్కూలు ఫైనలు చదువుతోంది—ఆ అమ్మాయేనా?'

అవునన్నట్టు తల వూగించాడు.

'అంటే నీ అభిప్రాయం?...ఆ అమ్మాయి తెలివైంది. మర్యాదస్థుల కుటుంబం—'

'ముసుగులో గుద్దులాటఎందుకండి? ప్రతి క్లాసులోనూ ఆ అమ్మాయి నన్ను వేపుకు తింటోంది. ఏవో కొంటె ప్రశ్నలు వేస్తుంది. నేనన్న ప్రతి వాక్యానికీ తనూ తందానా పాడుతుంది. నవ్వుతుంది. అదిచూసి నన్నో వెర్రి వెంగళాయుడి కింద కట్టేసి తతిమా వాళ్ళు కూడా నవ్వుతారు.

ఆ అమ్మాయి ఎసెంబ్లీలో అపొజిషన్ లీడర్‌లా పని చేస్తోందంటే నమ్మండి. నేను క్లాసు కంట్రోలు చేయలేక పోతున్నా. నాలుగైదు సార్లు

కుందలించి చూశాను. కాని ప్రయోజనం లేదు. ఆఅమ్మాయి మెదడు సరైన స్థితిలో లేదనుకుంటా.'

కొన్ని క్షణాలు ఆశ్చర్యంలో మునిగిపోయి ఏవీ సమాధానం చెప్పలేక పోయాను. కాని మౌనం వహిస్తే ఎలా?

'చూడు భాస్కరం! ఇందులో కంగారు పడవలసింది ఏవీ లేదు. కొత్తగా వచ్చిన వుపాధ్యాయుల్ని విద్యార్థులు ఇలాగే ఏడిపిస్తారు. ఇది మన శక్తికి పరీక్ష. ఈ తుఫానుకు బయపడకుండా ఎదిరించి నిలబడాలి. ఒకటి రెండు సార్లు విమలను గెట్ ఔట్ చేస్తే సరిపోతుంది.' అని సలహా యిచ్చాను.

భాస్కరం వెళ్ళిపోయాడు.

కాని విమల ప్రవర్తన నాకో ప్రశ్న అయింది. ఈ పదేళ్ళలో నేనిలాంటి మనస్తత్వపు సమస్యను ఎదుర్కోలేదు. భాస్కరం అందంగా వుంటాడు. అతను స్టాఫ్ రూంలో అప్పుడప్పుడు పాటలు పాడుతూండగా విన్నాను. అతను చాలా పుస్తకాలు చదివి కొంత విజ్ఞానం ఆర్జించాడు. విమలకు పద్దెనిమిదేళ్ళు వుంటాయి. ఒకవేళ అతన్ని ప్రేమిస్తోందేమో! కాని వెంటనే మరో ప్రశ్న ఉదయించింది. ప్రేమ ప్రకటనకు ఇది మార్గం అవుతుందా అని. సమాధానం కూడా వెంటనే వచ్చింది. విమలకు జీవితమంటే ఏవిటో పూర్తిగా అవగాహనయ్యే అవకాశం లేదని.

నా నిర్ణయం తల్చుకుంటే నాకే నవ్వొచ్చింది. ఈ 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' అనే దాంట్లో నాకు బొత్తిగా నమ్మకం లేదు. అయినా నేతి బీరకాయకు మల్లే యీ ప్రేమేమిటి? అదంతా వూహాగానం. విమల నాకు బాగా తెలుసు. ఆమె కుటుంబంతో నాకు బాగా పరిచయం వుంది. అంతదాకా ఎందుకు? విమల తండ్రి కేశవరావు నేను అత్యంత స్నేహితులం. అతను తాలూకాఫీసులో గుమాస్తాగా వున్నాడు. విమల తల్లికి కడుపులో ఏదో రోగం—దాని తాలూకు బాధతో బాటు ప్రతిక్షణం విమల వివాహం గురించి బెంగ పెట్టుకునేది. విమల ప్రవర్తన నిజానికి నా అంతరాంతరాలకు నిప్పు పెట్టింది. అమాయకత్వమా అంటే చిన్న పిల్లకాదు. సగం వికసించిన పువ్వు—అనుమానం—ప్రశ్న—తీరంలేని సముద్రాలు అన్నీ నన్ను చుట్టుముట్టేసి వుక్కిరి బిక్కిరి చేశాయి.

నెమ్మదిగా స్కూలు ఫైనలు క్లాసు దగ్గరకు వచ్చాను. గోడవారగా ఎవరికీ కనపడకుండా నిలబడ్డాను. భాస్కరం క్లాసులో పాఠం బోధిస్తున్నాడు. 'మర్చెంట్ ఆఫ్ వెనీస్' షేక్స్‌పియర్ నాటకంలో ఒకచోట సంగీతం జంతువుల్ని సహితం నృత్యం చేయించగలదని వర్ణింపబడివుంది. ఆ ఘట్టాన్ని భాస్కరం విశదీకరించాడు.

'అయితే మేష్టారూ! సంగీతం అంటే నాకు ప్రాణం—మరిమీకో!'—అది విమల కంఠం. ఇంకొంచెం ముందుకునడిచి జాగ్రత్తగా విన్నాను. 'అదంతా నీకనవసరం!' అని భాస్కరం గద్దించాడు. నా సలహాను అతను పాటిస్తున్నందుకు లోలోన సంతోషించాను. వారిదరిమధ్యా వైరుధ్యాన్ని—అసహ్యతను సృష్టించటమే నా ం—అంటే ఇతరులబాధలు చూసి సంతోషించే మనస్తత్వం కాదు నాది. కారణం విశదీకరించలేను. అది హృదయాంతరాల అట్టడుగున వుండి పోతుంది...'అదేవిటండి!... మీరు చెప్పక పోయినా నాకు తెలియదా ఏవిటి? మీరు పాడుతుండగా నేను చాలాసార్లు విన్నాను—బాగా పాడతారు.'

అందరూ గొల్లుమన్నారు. విమల మాటలు నిజంగా అధికప్రసంగంలోకే వస్తాయి. అంతా, కొత్త మేష్టార్ని విమల బాగా ఏడిపిస్తోందనే అనుకున్నారు. కాని అందులో విస్పష్టమైన అర్థం ఏదో వుందని నేను మాత్రం వూహించుకోగలిగాను. ఇంక అక్కడ వుండలేక పోయాను.

మర్నాడు విశ్రాంతిసమయంలో విమలవచ్చింది.

'భాస్కరం మేష్టారు వున్నారాండి?' అనడిగింది.

కళ్ళల్లోనూ, కంఠంలోను బెదురు స్పష్టంగా కనుపించింది.

అయితే ఈ భయం నన్ను చూసేగాబోలు!

'ఏం కావాలి విమలా?' అనడిగాను.

'ఇంగ్లీషు పాఠం అర్థంకాలేదండి. అడుగుదామని వచ్చాను.' నిజానిజాలు తెలిసివుంటే ఆమె యింత స్వేచ్ఛగా మాట్లాడివుండేది కాదేమో! లేడిలా గెంతుతూ పారిపోయేది.

'ఏం? నీకు తెలియక పోతే నేను బోధపరుస్తాను అతనే కావాలా?'

‘అవునండి—’ అంటూ గదంతా షోమారు కలయ జూసి అతను లేడని నిర్ణయించుకుని వెళ్ళిపోయింది. అవమానంతో పళ్ళు పటపట కొరికాను—త్రాచులా అటూ యిటూ కదులుతున్న ఆమె పొడుగాటి జెడకేసి చూస్తుంటే నా మనస్సులో భయంకరసర్పాలు తలెత్తి బుసకొట్టి నన్ను ఉత్సాహపరిచాయి. గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిందట! సరే! ఎండాకాలం వస్తే చెరువు ఎండుతుంది. కాని తిరిగి వాన కురిస్తే నిండుతుందన్న సంగతి మర్చిపోయాను. షెల్లీ తన మనోవ్యథను బయట పెడుతూ ‘వెస్ట్‌విండ్’లో శీతాకాలం తరువాత ‘వసంతం’ రాకుండా వుంటుందా? అన్నాడు. కాని వసంతం తరువాత నైట్రోజన్ సర్కిల్‌లా శీతకాలం రాక తప్పదని అతను మర్చిపోయింటాడు.

ఆ సాయంత్రమంతా ఆలోచించాను. ఈ సమస్య నూటికి నూరుపాళ్ళు నా వ్యక్తిగత జీవితానికి సంబంధించినది. అందుచేత నే దాన్ని పరిష్కరించాలి. ముళ్లపొదల మీదికి పరుగెడుతున్న బండిని సరైన మార్గంలోకి మళ్ళించాలి. అదే నేను చేసుకున్న ఆఖరు నిర్ణయం.

వారం రోజులు గడిచాయి. విమల ఇదివరకటి మల్లే చిలిపి ప్రశ్నలు వేయటం తగ్గించిందని భాస్కరం అన్నాడు. కొంత తృప్తిపడ్డాను.

ఓనాడు సాయంత్రం పేపరు చదువుకుంటున్నాను. స్టాఫ్ రూంలో ఎవరూ లేరు. భాస్కరం నెమ్మదిగా వచ్చినా కెదురుగా కూర్చున్నాడు.

‘మేష్టారూ! మనకు వచ్చే జీతాలు చాలా తక్కువ. అందుచేత ప్రైవేట్లు వస్తే ఒప్పుకోటం మంచిదంటారా?’

‘అందులో తప్పేముంది? అసలు ప్రైవేట్లు రావాలని ఎంత మంది కాసుకూర్చుంటారో తెలుసా?’

‘కాని మరో ప్రశ్న ఎదురైందండి. విమల తమ్ముడొకడు సెకండు ఫారం చదువుతున్నాడటగా! ఇద్దరికీ కలిసి ప్రైవేటు చెప్పాలిట—సాయంత్రం ఇంటికి రమ్మంటూంది విమల—’

ఏం చెప్పాలో బోధపడింది కాదు. నిర్మాణం సగంపూర్తిఅయిన భవనం తాలూకు పునాది కూలినట్టైంది.

‘నువ్వేం చెప్పావు?’

‘ఆలోచించి రేపు చెబుతానన్నాను. నేను ఎంతడిగితే అంతా ఇవ్వటానికి సిద్ధమేనట! వాళ్ళ నాన్నే అడగమన్నాడుట.’

కొన్ని క్షణాలు ఆలోచించి అన్నాను.

‘చూడు భాస్కరం’ లోకం మంచిది కాదు. దానికి వెయ్యి తలలూ వెయ్యి నాలుకలూ వున్నాయి. నువ్వింకా జీవితంలో అడుగు పెడుతున్నావు. అంతే! అందుచేత నీ కన్నీ పంచవర్ణాలు పూసుకుని తళతళలాడుతూ అందంగా కనిపిస్తాయి. కాని వాటి వెనక ఎర్రగా కాలిన ఇనుపవూచలుంటాయి. నీపరువుప్రతిష్ఠలు ధ్వంసమయ్యాక నువ్వు బ్రతకలేవు. అది నాకెంతమాత్రం యిష్టం లేదు. విమల చిన్నపిల్లగాదు. పెళ్ళికెదిగి కూర్చుంది. ఇప్పటికే నీగురించి పుకారు బయలుదేరి వుంటాయి. వాటిని రుజువుచేసిన వాడవవుతావు. అంటే కొరివితో నెత్తి గోక్కోటమన్న మాట. అంతే—తరువాత నీ యిష్టం—.’

ఆ మాటలు అసహజంగా ధ్వనించాయి. వాటిని భాస్కరం ఎలా అర్థం చేసుకున్నాడో తెలియదు. అందులో ఎంతవరకూ నిర్మలత్వం వుందని అతను ఆలోచించలేదనుకుంటా. పెద్దగా నిట్టూర్చి కదలిపోయాడు.

ఇంటికి వెడదామని లేచాను.

‘నమస్కారం’ అంటూ విమల వచ్చింది. ఆమె నేవిధంగా పలకరించాలో తెలియక మాటలకోసం వెదుక్కుంటున్నాను.

‘మేష్టారూ! నాన్నగారు మిమ్మల్ని ఓమాట అడిగిరమ్మన్నారు.

మా తమ్ముడు బొత్తిగా చదువుకోటం లేదండి. వట్టిగడ్డుగాయిలా తయారై భయభక్తులు లేకుండా తిరుగుతున్నాడు. అందుకని భాస్కరం మేష్టార్ని ప్రైవేటుకు పిలవమన్నారు. మీ అభిప్రాయం ఏమిటి?’ అంటూ డొంక తిరుగుడుగా వయ్యారంగా ప్రశ్నించింది.

హఠాత్తుగా వుపమానం జనించింది. ఓ వ్యక్తి జేబులోంచి పర్సు దొంగిలించి అందులోంచి అయిదు రూపాయల కాగితం తీసి అతనికే యిచ్చి ‘అయ్యా! నాకు ఫలానా వస్తువు తెచ్చి పెట్టండి!’ అంటే ఎలా వుంటుంది?

‘అదేదో మీ నాన్నతోనే చెబుతాలే’ అన్నాను. విమల తిరిగి నమస్కరించి కదలిపోయింది. నేను బయటకొచ్చేసరికి భాస్కరం వాలీబాల్ కోర్టులో వున్నాడు.

తిన్నగా ఇంటికొచ్చాను. అమ్మ కాఫీయిచ్చింది. తాగేసి విమల యింటికెళ్ళాను. కేశవరావు అరుగు మీదే వున్నాడు. గౌరవించి కూర్చోమన్నాడు.

‘విమల ఇంట్లో లేదా?’

‘లేదండి! గుళ్ళోకెళ్ళింది. ఏవిటో ఇలా దయ చేశారు.’ అన్నాడు.

‘మరేం లేదు. భాస్కరాన్ని ప్రైవేటు చెప్పమన్నారట!’

అతను మొదట్లో తెల్లబోయి తరువాత సర్దుకుని ‘మరే...మరే...’ అన్నాడు అసందర్భంగా.

‘అతన్ని గురించి చెబుదామనే వచ్చాను. ఇదంతా మనిద్దరికి మధ్యవున్న స్నేహాన్ని పురస్కరించుకుని చెబుతున్నా. అతనిమీద నాకెలాంటి ద్వేషమూ లేదు. అతన్నిగురించి నాకు తెలిసిందికూడా తక్కువే. అయినా వయసువచ్చిన విమల అతన్తో అలా మాట్లాడటం—తిరగటం—మంచిది కాదు. కొంతమంది చెప్పగా విని అర్థం చేసుకున్నాను. అతను ఆడపిల్లల్ని వల్లో వేసుకోటంలో బాగా ఆరితేరినవాడని. అందుకని దుష్టులకు దూరంగా వుండటం మంచిది. అదలావుంచి అతన్ని ఇంటికి రమ్మనడం ఘోరాతిఘోరం. ముందుముందది ప్రమాదకరంగా పరిణమిస్తుంది. ప్రైవేటు కావాలంటే నేను చెప్పనా? అతనే కావాలని మీ అమ్మాయి పట్టుబట్టడం ఆశ్చర్యంగా వుంది. ఇదంతా చూస్తుంటే...’ అంటూ ఆగిపోయాను.

‘అచ్చే! అలాంటిదేవీ లేదు. మీరే అనుమానిస్తే ఇంక నాకు దిక్కేవిటి? మన మధ్యవున్న సంగతి ఆమెకు చెప్పకుండా దాచి వుంచాను. స్కూలు ఫైనలు పూర్తికానివ్వండి. విమలను నేను మందలిస్తాను.’ అన్నాడు భయంతో కేశవరావు.

మానవులకు అభిప్రాయాలూ, ఆదర్శాలూ వున్నప్పటికీ వాటిని చెలాయించేటందుకు కాలంగూడా కలిసి రావాలి. నావికుడు నావ నడపటంలో తనకున్న శక్తిని పెను తుఫానులమధ్య ప్రదర్శించి ప్రయోజనం లేదు. విజయాన్ని అందుకోలేడు. ఏదెలావున్నా, ప్రశాంతంగా పారుతున్న నదీ జలంలో మట్టిబెడ్డలు విసరబడ్డాయి. స్వచ్ఛంద జలం తన రంగును కోల్పోయింది. నా జీవితంకూడా అంతే అయింది. ఎన్నో నీతి గ్రంథాలు చదివాను. కాని ఇప్పుడు నేను చేసేపనిని నీతి దృక్పథంలోనుంచి చూడటం మానుకున్నాను. నాక్కావలసింది విజయం. భాస్కరం విమల యింటికి వెళ్ళకపోయినా ఆమె తమ్ముడుమాత్రం ప్రతి సాయంత్రం స్కూల్లోనే ప్రైవేటు చెప్పించుకుంటున్నాడు. పుండుమీద కారం జల్లినట్టు అప్పుడప్పుడు విమలకూడా అతనికి సాయం వుంటోంది. దీని పర్యవసానం ఏమవుతుందని వూహించేశక్తి నాకు లేదు.

పబ్లిక్ పరీక్షలు పూర్తయ్యాయి. నేను ఎదురుచూస్తున్న ముహూర్తం దగ్గర పడుతోంది. కాని అనుకున్నదానికి విరుద్ధంగా విమలతల్లి కడుపునొప్పితో చనిపోయింది. ఆమె శారీరకంగా ఎంత బాధపడినా కేశవరావుకు అండగానే వుండేది. సరిగ్గా వారం రోజుల తరువాత మరో పిడుగు. కేశవరావుకూడా గుండెపోటువలన చనిపోయాడు. విమల దిక్కులేని పక్షి అయిపోయింది. ఆమె తన్నుతాను పోషించుకోవాలి. తమ్ముడిజీవితాన్ని సరిదిద్ది అతన్నో వ్యక్తిగా మార్చాలి. ఇదంతా మోయలేని బరువు. కర్మకాండంతా పూర్తైంది.

ఓనాడు విమల ఇంటికెళ్ళాను. దిగులుగా కూర్చునివుంది. ‘విమలా! ఏవిటి నిర్ణయించుకున్నావు?’ అనడిగాను. ‘ఏ ముందండీ!...అంతా అయిపోయింది. ఇంక ట్రెయినింగు చదువుదామని ఆలోచిస్తున్నాను. ఇల్లన్నా నిలబడుతుందనుకున్నాను. కాని అప్పుల వాళ్ళు దాన్నికూడా ఎగేసుపోతారట. ఏం చేసేది?’ అంది.

నేను ఏదో చెబుదామని నోరెత్తాను. కాని ఎందుకో నా అభిప్రాయాలు నన్ను మూగవాణ్ణి చేశాయి. చెప్పలేకపోయాను.

మర్నాడు మా అమ్మను పంపించాను. ముఖ్యంగా విమల వివాహ విషయం తెలుసుకురమ్మని. ఆమెతండ్రి వుంటే నాకెలాంటి బాధ్యతా లేకపోను. కేశవరావుకూ నాకూ మధ్య కొన్ని రహస్యాలు వున్నాయి. అవి మాయిద్దరికీ తప్పించి మరెవరికీ తెలియవు. విమల ట్రెయినింగ్ చదవటం నా కెంతమాత్రం యిష్టం లేదు. విమలకు వరుడు సిద్ధంగా వున్నాడు. అతను భాస్కరానికి మల్లే నవయువకుడు కాకపోయినా అస్థిరత్వంతో వూగిసలాడేవాడు కాడు. అమ్మకోసం

ఎదురుచూస్తూ కూర్చున్నాను. విమల తప్పకుండా ఒప్పుకుంటుందని నాకు తెలుసు. ట్రెయినింగ్ చదవటమంటే ఎన్నో ఎడారులు-నదులు-లోయలు-దాటవలసి వుంటుంది. ఆమె ఏ ధైర్యంతో ఆ నిర్ణయానికి వచ్చిందో మాత్రం నాకర్థం కాలేదు.

'విమలకు తను ట్రెయినింగు చదవాలన్న ధ్యాసే కాని మరే విచారమూ లేదు. అసలామె పెళ్ళి చేసుకోదట-అన్ని ఏర్పాట్లూ చేస్తానని చెప్పి చూశాను. దాన్ని వంచటం ఎవరి తరమూ కాదు.'

అవి అమ్మ చెప్పిన మాటలు—

'పోనీ, విమల ట్రెయినింగ్ చదివితే తప్పేముంది? మనబంగారం మంచిదికావాలికాని వుద్యోగం చేయటంలో తప్పేముంది? ఆమెను ప్రోత్సహించటం నావిధి' అనుకున్నాను. విమలచేత ఎప్లికేషన్ పడేయించాను. నాకున్న పలుకుబడి వలన ఆమెకు సీటు వచ్చింది.

కాని విమల మాటలు మళ్ళీ నన్ను ఆలోచనలోకి విసిరేశాయి. 'మేస్టారూ! మామీదవుండే ఆదరంతో నాకోసం శ్రమపడ్డారు. మీ ఋణం ఎలా తీర్చుకుంటానో తెలియదు. అందుకు అవకాశం రావాలనే ప్రార్థిస్తున్నా. ఇంక మీరు నాగురించి శ్రద్ధ తీసుకోటం-మిమ్మల్ని బాధించినట్టే అవుతుంది. నేను కాకినాడలో రూం తీసుకున్నాను. అందులో మేం నలుగురైదుగురం వుంటాం-మీరేం బెంగపెట్టుకోకండి. ఇక ముందు ఆర్థికంగా నాకెలాంటియిబ్బందులూ వుండవు.'

ఆ మాటల్లో అంతులేని అగాధం కనిపించింది. అగాధమైతే మసగ్గా కనిపించిందికాని అందులో ఏం వున్నాయో-క్రూరమృగాలే వున్నాయో-రంగురంగుల పువ్వులే వున్నాయో-మాత్రం దృగ్గోచరం కాలేదు. నేను, విమల తన స్వంత కాళ్ళమీద ఎలా నిలబడగలుగుతుందని అడుగుదామనుకున్నాను. కాని ఆమె మాట్లాడే తీరులో అందుకు సావకాశం ఎక్కడా లేదు. ఇంటికి తిరిగి వచ్చేశాను.

విమల ఇంత ధైర్యంగా మాట్లాడటం వింతగానే కనిపించింది. సముద్రపు టలల్ని చూచి భయపడుతూనే వుంటాం – కాని పరిస్థితులు కెరటాల మధ్యకు విసిరివేస్తే ఎక్కడలేని ధైర్యం వస్తుంది. ఊరికే ఏడుస్తూ కూర్చుంటే జీవిత శృంఖలాల్ని తెంపుకోలేం గడ్డిపరక దొరికితే అది రక్షిస్తుందన్న ఆశవదలదు. క్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కొనే శక్తి స్త్రీలకు ఎక్కువగా వుంటుంది.

కాని పదిరోజులు పోయాక కాని ఈ చదరంగంలోవున్న ఎత్తులు బోధపడలేదు. భాస్కరం రిజైన్ చేసి కాకినాడలో ఓ హైస్కూలులో చేరాడు. రెండుమూడుసార్లు నేను అక్కడికి వెళ్ళినప్పుడు విమలను కలుసుకున్నాను. ఆమె గుప్పిట్లో దేన్నో దాచి వుంచుకుని రహస్యంకనుక్కొమన్నట్టు సవాలుచేసింది. ఆమె తమ్ముడుకూడా అక్కడే చదువుకున్నాడు. భాస్కరాన్ని త్రోవలో కలుసుకున్నాను.

'భాస్కరం! నీకు విమలకనిపిస్తోందా?' అనడిగాను.

'కనిపించకేమండి! వారానికి రెండుమూడు సార్లు ఇద్దరం కలుసుకుంటున్నాం.'

అతను ఎప్పటికిమల్లే నే మాట్లాడాడు.

'కాని, నా సందేహం ఒక్కటే! విమల ఆర్థికంగా ఎలా సమాళించుకుంటోందని.'

'క్షమించాలండి — మొదట్లో విమల చాలా పెంకిపిల్ల — క్లాసులో నన్ను ఏడిపించటమే ఆమె అభిప్రాయమని అనుకుని భయపడ్డానుకాని ఇప్పుడా భావం తొలగిపోయింది. ఆమెకు అప్పుడప్పుడు స్వార్థరహితంగా నేనే సాయంచేస్తున్నా, నాకు పనుంది. మళ్ళా కలుసుకుందాం—' అంటూ చకచకా వెళ్ళిపోయాడు.

పొంగుతున్న పాలు హఠాత్తుగా విరిగినట్లయింది.

ప్రతివ్యక్తికి కొన్ని నిశ్చితాభిప్రాయాలు వుంటాయి — వాటినెవరూ మార్చలేరని ముందే చెప్పాను. అవి స్థిరమైన స్వయంసిద్ధాంతాలమీద ఆధారపడకపోయినాసరే—విమల, భాస్కరం ఇలా విహంగాల్లా తిరగటం నాకిష్టంలేదు. సామ దాన భేద దండోపాయాలచేత దీన్ని చెదరగొట్టటం నా దృష్టిలో న్యాయసమ్మతంగానే కనిపించింది.

నా ఓటమిని అంగీకరించలేకపోయాను.

* * *

కాలచక్రంలో రెండుసంవత్సరాలు దొర్లిపోయాయి

కాకినాడలో ఓ హైస్కూలులో నాకు హెడ్మాష్టరుగా అపాయింటుమెంటు దొరికింది. అదృష్టవశాత్తూ ఆ స్కూల్లో భాస్కరం పనిచేస్తున్నాడు. కొత్తగా ఛార్జితీసుకున్న రెండువారాలకు ట్రెయినింగ్ పాసైన విమల ఇంటర్వ్యూకివచ్చింది. ఆమెతోబాటు అనుభవంవున్న మరో యిద్దరుకూడా పోటీగావచ్చారు. కాని కరస్పాండెంటుకు నచ్చజెప్పి విమలకు ఆ వుద్యోగంవచ్చేట్టుచేశాను. ఇందులో సానుభూతికంటె స్వార్థం ఎక్కువగావుంది.

ఇంక భాస్కరంమీద పగసాధించాలి. అతని లోపాలుకనిపెట్టి వున్నవీ లేనివీ మేనేజరు చెవిలో వూదాను. రెండుమూడుసార్లు లేటుగావస్తే బలవంతంగా లేటు మార్కు చేయించాను. వారానికి రెండుసార్లు అతని క్లాసుకు వెళ్ళి టీచింగు తృప్తికరంగా లేదని రిపోర్టు రాశాను. అతని చుట్టూ విషసర్పాల్ని సృష్టించాను. అతనిదగ్గర

వినయంగా ప్రవర్తించిన విద్యార్థులు నా ప్రోద్బలంతో ఎదురుతిరిగి అతన్ని ఏడిపించసాగారు. భాస్కరం అంతా గమనిస్తూనే వుండాలి. కాని ఏమీ ఎరగనట్టు కాలం గడుపుకుంటూ పోతున్నాడు.

ఉన్నట్టుండి భాస్కరం డిస్‌మిస్ అయ్యాడు. చట్టప్రకారం అతనికి నోటీసు యివ్వవలసివుంది. కానీ అతను ప్రతిఘటించలేదు. కాని ఏ పునాదిమీద నా భవనాన్ని నిర్మించదలచుకున్నానో ఆ పునాది కూలిపోయింది.

విమలకూడా రిజైన్ చేసి వెళ్ళిపోయింది. ఆమెను వారించటానికి యత్నించాను. విఫలత నన్ను చూసి నవ్వింది.

ఎడారిలో ఎండమావులకోసం ప్రయాసకోర్చి పయనం సాగించినట్టు — ఎక్కడో బంగారు గనులున్నాయని మైళ్ళకొలది దూరం నడిచి చివరికి పిడికెడు ఇసుక దొరికితే ఎలావుంటుంది? నా పరిస్థితి కూడా అంతే అయింది. తరువాత వాళ్ళజాడ తెలియలేదు.

ఓ సంవత్సరమైన తరువాత నేను మొదట పనిచేసిన హైస్కూలుకే హెడ్మాస్టరుగా తిరిగివచ్చాను.

* * *

అమ్మ దీపంవెలిగించింది.

గదిలో విహారంచేస్తున్న చీకటి చెదిరిపోయింది.

'మేష్టారూ!' అంటూ గదిలో ఎవరో అడుగుపెట్టారు. తలెత్తిచూశాను. కొంతసేపు అలాగే వుండిపోయాను.

'జ్ఞాపకం లేనండీ? భాస్కరాన్ని' అన్నాడు.

'నువ్వా? కూర్చోవోయ్! చాలా మారిపోయావు — బాగున్నావా?' భాస్కరం నవ్వి నా కెదురుగా కూర్చున్నాడు. మానసికంగానూ, శారీరకంగానూ నాలో కలిగిన దౌర్బల్యాన్ని అతను గుర్తించే వుంటాడు.

'మేష్టారూ! మీతో ఒక ముఖ్యవిషయం చెబుదామని వచ్చాను. వచ్చే శనివారం విమలకూ — నాకూ పెళ్ళి — ఇది ఎంతో కాలంక్రితం జరగవలసింది. అందరికీ మల్లే శుభలేఖ పంపటం నా కిష్టంలేదు. మీ ఆదరణకు — ప్రేమకూ జీవితంలో నే నెంతో ఋణపడివున్నాను. అందుకే స్వయంగా పిలవటానికి వచ్చాను. మీరు తప్పకుండావచ్చి మమ్మల్ని ఆశీర్వదించాలి.'

నా కళ్ళు నీటితో నిండిపోయాయి. కళ్ళజోడును తుడుచుకుంటున్న నెపంతో కన్నీళ్ళు తుడుచుకున్నాను.

'భాస్కరం! నిన్ను నేను చాలా బాధించాను. నువ్వు డిస్‌మిస్ కావటానికి నేనే కారణం. నన్ను క్షమించు' అన్నాను.

'తప్పండి — మీ రలాగనకూడదు. నాకంటె మీరు పెద్దవారు, మీమనసు పాతజ్ఞాపకాలతో కలవరపడుతూంది. జీవితాని కర్థంలేదని గ్రహించిన మీరే ఇలా బాధపడటం న్యాయంకాదు. నేను మిమ్మల్ని తరువాత కలుసుకుంటాను.' అంటూ సెలవుతీసుకున్నాడు

నా నెత్తిమీదిబరువు దిగినట్లయింది. బహుశా భాస్కరం నే ననుకున్నంత 'చెడ్డమనిషి' కాడు. నాకంటె అతని హృదయం విశాలమైంది.

నేను ఎవరి మంచికోసమూ ఇంత శ్రమపడలేదు. నా భార్య చనిపోయిన రెండు సంవత్సరాలకు విమల తండ్రి విమలను నాకిచ్చి పెళ్ళిచేస్తానని వాగ్దానం చేశాడు. అందుకే భాస్కరాన్ని దూరంగా వుంచాను. నేను మంచిచేసినా, చెడ్డచేసినా విమలకోసమే! ఆమెకోసమే జీవించాను—ఉపాధ్యాయుడికి ప్రేమించే హక్కు లేదని కొందరు వాదిస్తారు గామోలు!

అంతా అయిపోయింది.

పక్వానికి వచ్చిన ఫలం నాకు అందలేదు. కాలవృక్షంతో పోరాటంమాత్రం మిగిలింది. వేదాంతంతో పూరట పొందవచ్చు. కాని అదికూడా క్షణికం-ఇంద్రధనుస్సు మాయమైంది. కారుచీకటి అలుముకుంది— అయినా ప్రయాణం సాగించక తప్పదు. ఇదివరకు గమ్యస్థానం మనసులో వుంచుకుని ఆ దిశగా నడిచాను. ఇప్పుడు చీకట్లో ఎక్కడికి నడుస్తున్నానో—ఏమిటో తెలియదు. కాని పయనించక తప్పదు. జీవితం నేర్పిన పాఠాలు అవగాహన చేసుకోటానికి ఇంకా కొంత కాలంపడుతుంది. ఆనాడు విమలతో అసలు విషయం చెప్పివుంటే ఈ బాధ వుండేదికాదు. ఆకాశంలో ఎక్కడో మబ్బుల్లో దాగివున్న శాంతిని పట్టుకు తీసుకురావాలి. శరీరంలో జనించే ఉద్రేకాలకు ఆత్మ ఎంతమాత్రం బాధ్యత వహించదు. అది కేవలం అసహాయతతో గూటిలో చిలకలా చూస్తూ కన్నీరు కారుస్తుంది. అంతే—చాలాదూరం వెళ్ళాక కాని తప్పుత్రోవలో పడ్డామన్న సంగతి తెలియదు.

నా జీవితాన్ని చీకటి గుహలో బంధించిందెవరు? భాస్కరమా? విమలా? కేశవరావా? లేక నా చర్యల్ని సమర్థించుకు నేందుకు నేను సృష్టించుకున్న సిద్ధాంతాలా? సరైన వయసు రాకుండానే తల నెరిసింది. చీకటి కళ్ళను ఆవరించింది. నామీద ఎవరికీ సానుభూతికూడా వుండదు. బ్రౌనింగ్ నడిగితే ఇవన్నీ 'సుభసూచకాలు' అంటాడేమో! కిటికీలోనుంచి బయటికి చూశాను.

దూరంగా ఆకాశజ్యోతుల్లా దీపాలు మిణుకు మిణుకుమంటున్నాయి. దేవుడి విగ్రహంముందు నిలబడి అమ్మ ఏవో స్తోత్రాలు చదువుతూంది.

కనుగొలకుల్లో రెండు నీటిబిందువులు నిలిచాయి.

# నాగార్జున క్షేత్రం

శ్రీ పి. వి. ప్రసాదరావు

ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగిన ఈ నెలలో ఆంధ్రప్రదేశ్ విశిష్టతకు, ఖ్యాతికి కారణాలలో ఒకటయిన నాగార్జున క్షేత్రంగూర్చి ఈ నాడు మనం తెలిసికొనటం ముదావహంగా వుంటుంది.

ఆంధ్రప్రదేశ్ లోనే గాక, భారతదేశం మొత్తం మీద మహోజ్జ్వల యాత్రా కేంద్రంగా పరిఢవిల్లిన ఈ క్షేత్రం నవ్యశోభలతో విలసిల్లే నవ్యాంధ్రలక్ష్మికి నిజంగా శిరోభూషణమనటం అతిశయోక్తి కాదు.

నాగార్జున క్షేత్రం విశిష్టతకు ఈ క్రిందివి ప్రధాన కారణాలు.

(1) ఆచార్య బోధిసత్వ బిరుదాంచితుడైన నాగార్జునుడు ఈ క్షేత్రంలోని శ్రీపర్వతంమీద నే వసించి బ్రహ్మాండమైన తాత్వికపరిశోధనలు గావించాడు. (2) ఈ క్షేత్రంలోని శ్రీపర్వతానికి పశ్చిమంగా విజయపురి అనే నగరాన్ని నిర్మించి ఇక్ష్వాకు వంశీయులు రాజ్యాన్ని పాలించారు. (3) బౌద్ధమతానికి చెందిన అపూర్వ శిల్ప సంపద ఇచ్చటె లభ్యమయింది. (4) అన్నిటికన్నా ముఖ్యంగా, 34 లక్షల ఎకరాలు సాగుచేసే నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఇచ్చటె నిర్మింపబడుతున్నది.

గుంటూరు—మాచర్ల రైలుమార్గంలో చివరి స్టేషను అయిన మాచర్లకు 13 మైళ్ళదూరంలో నాగార్జున కొండను తాకుతూ ఒకలోయగుండా కృష్ణ ప్రవహిస్తున్నది. దానికిదగ్గరగా నందికొండ అనే గ్రామం ఉన్నది. దీనికి 1½ మైలు తూర్పుగా ఉన్న ప్రదేశంలోనే ప్రస్తుతం ఆనకట్ట నిర్మాణం జరుగుతున్నది. ఈ లోయ ప్రాంతంలోనే ఆనాడు ఇక్ష్వాకుల రాజధాని విజయపురి విలసిల్లినది. ఈ ప్రాంతంలోనే మహత్తరములైన పురాతన శిల్పాలు బయల్పడుచున్నవి. ఈ ప్రాంతం అంతటిని నాగార్జున క్షేత్రం అని అనవచ్చు.

## ఆచార్య నాగార్జునుడు

ఇతడు దాక్షిణాత్య బ్రాహ్మణుడు టిబెట్ సంప్రదాయం ప్రకారం ఇతడు 137 క్రీ. శ. తరువాత 57 సంవత్సరాలు. బౌద్ధమతానికి ఆచార్యుడై ప్రసిద్ధికెక్కినట్లు తెలుస్తుంది.

ఇతడు తపశ్శక్తిసంపన్నుడు. కాంచీనగరమున తారాదేవి నుపాసించి సిద్ధుడయ్యెనని ఒక గాథగలదు. నాలందాలో చండికనుపాసించి సిద్ధుడయ్యెనని వేరొక గాథ గలదు. మొత్తంమీద ఏది ఎటులైనను ఇతడు తపశ్శక్తిసంపన్నుడు. అఖండ పాండితీ ప్రతిభల సమార్జించుకొన్న మహావ్యక్తి. రసాయన శాస్త్రవేత్త. ప్రముఖ తాంత్రికుడు. వక్త. బహుగ్రంథకర్త.

ఇతని అపార శేముషీప్రాభవాన్ని గుర్తించి శాతవాహన చక్రవర్తి అయిన యజ్ఞశ్రీ నాగార్జున కొండమీద సంఘారామాన్ని నిర్మించి, ఆయా శాస్త్రములలో పరిశోధనలు సలుపు నిమిత్తము దానిలో తగిన వసతులు కల్పించాడు. యథార్థంగా ఆచార్య నాగార్జునుని పరిశోధన బహుముఖమైనది.

రసాయన శాస్త్రమందు గావించిన కృషికి నిదర్శనంగా ఇతని 'రసరత్నాకరము' వెలయుచున్నది. వైద్యశాస్త్ర పరిశోధనల ఫలితంగా 'కక్షపుటతంత్ర', 'ఆరోగ్యమంజరి' అను గ్రంథములు విలసిలినవి. నేత్ర వైద్యమున ఇతడు కనిపెట్టిన చికిత్సలు నేటికీ టిబెట్ నందు వ్యాప్తిలోగలవు. ఇక తాత్విక పరిశోధన విషయమున ఇతను జరిపిన కృషి అపారమూ, అనన్యసామాన్యమూ అయినది. బుద్ధుని అనంతరము ఇతని తత్వమే సర్వాంగ సుందరమూ, యుక్తియుక్తమూనై వున్నది. ఇతడు మాధ్యమిక వాదాన్ని ప్రచారం గావించాడు.



నాగార్జున క్షేత్రమున లభించిన శిల్పములు

ఇతడు వ్రాసిన గ్రంథాలలో 24 మాత్రం లభ్యమైనవి. ఈ క్రిందివి వానిలో ముఖ్యమైనవి.

(1) ప్రజ్ఞాపారమిత శాస్త్రము (2) ప్రజ్ఞామూల శాస్త్ర టీకా (3) ప్రజ్ఞా ప్రదీపశాస్త్ర కారికలు (4) మూలమాధ్యమిక శాస్త్రము (5) శూన్యసప్తాధి (6) మాధ్యాంతానుగమశాస్త్రము (7) దశభూమి విభాసా శాస్త్రము (8) ద్వాదశనికాయ శాస్త్రము (9) వివాదసమాన శాస్త్రము (10) ప్రమాణ వివేచన (11) ఉపాయన కౌశల్య హృదయ శాస్త్రము (12) విగ్రహ వ్యావర్తనీ కారికలు.

ఇతడు దిగ్దంతులైన శిష్యులను తయారు చేశాడు. వీరిలో ఆర్యదేవుడు ప్రముఖుడు. స్థవిరబుద్ధ పాలితుడు, భావ వివేకుడు, చంద్రకీర్తి, శాంతిదేవుడు అనువారలు కూడా వారి శిష్యులలో ప్రముఖులు.

ఆచార్య నాగార్జునుని పరిశోధనల నిమిత్తము శాతవాహన రాజయిన యజ్ఞశ్రీ, పర్వతంమీద నిర్మించిన సంఘారామం జగత్ప్రసిద్ధ మయినది.. ఇది ఐదు అంతస్తులు గలది.

అందులో మొదటి అంతస్థు ఏనుగ ఆకారము కలిగి 500 గదులతోను, రెండవది సింహాకృతి గలిగి, 400 గదులతోను, మూడవది హయాకృతి గలిగి 300 గదులతోను, నాల్గవది వృషభాకృతి గలిగి 200 గదుల తోను, ఐదవది పావురము ఆకృతి గలిగి 100 గదుల తోను విలసిల్లినవి. ఈ అంతస్తు లన్నింటికన్నా పై భాగమున జలాశయము గలదు. పైగా, ఒక్కొక్క అంతస్తులో బంగారపు బుద్ధవిగ్రహం వున్నది.

యాథార్థంగా ఈ మహత్తర నిర్మాణం ఆనాటి శిల్పకళలకు ప్రత్యక్ష ప్రామాణమైన నిదర్శనం.

ఆచార్య నాగార్జునుని మరణముగూర్చి భేదాభిప్రాయములున్నవి. ఇంతటి సర్వతోముఖ ప్రజ్ఞాశాలి ఈపర్వతప్రాంతమున నె విశ్వవిద్యాలయమును నెలకొల్పి వేలకొలది విద్యార్థులకు విద్యాదానమొసంగెను. ఇతని శిల్పశాస్త్ర పాండితికి ప్రత్యక్ష నిదర్శనములుగ కార్లీ చైత్యగృహము, సాంచీస్తూపద్వారములు, అమరావతీ మహాచైత్యము వెలయుచిన్నవి.

## ఇక్ష్వాకు వంశీయులు

వైజ్ఞానికంగా ఈ నాగార్జున క్షేత్రం ఎంత మహోన్నతమైనదో, చరిత్రాత్మకంగా కూడా అంత మహోజ్జ్వలమైనది.

ఇక్ష్వాకువంశీయులు కి శ. 3 శతాబ్దంలో ఇక్కడ విజయపురిని నిర్మించి 50 సంవత్సరాలపాటు రాజ్యపాలన సాగించారు. వీరు సనాతనులు. వీరి ప్రశంస అథర్వణ వేదంలోనూ, శతపథ బ్రాహ్మణంలోనుగలదు. శ్రీ రామచంద్రమూర్తి వీరి వంశీయుడే. ఆయన కుమారులలో ఒకడైన లవుడు శ్రావస్తీనగరం రాజధానిగా ఉత్తర కోసలను, రెండవవాడైన కుశుడు వింధ్యకు దక్షిణాన కుశస్థలి రాజధానిగా దక్షిణకోసలను పరిపాలించినారు.

వీరు కోసల (అయోధ్య)ను పాలించినారనీ, మగధరాజ్యం అభివృద్ధికి రావటంతోనే దక్షిణానికి వచ్చినారనీ తెలుస్తున్నది. వీరు శాతవాహనుల దగ్గర సేనాధిపతులుగానో, మంత్రులుగానో ఉండి, పిదప సువిశాలమైన రాజ్యాన్ని పరిపాలించారు.

వీరిలో మొటమొదటివాడు మహారాజ మూలుడు. ఇతను వైదికమతానికి జీవంపోసిన మహనీయుడు. రెండవవాడు వీరపురుషదత్తుడు. ఇతను బౌద్ధ మతానుయాయి అయినాడు.

ఆంధ్రదేశానికి సంబంధించిన బౌద్ధచరిత్రలో ఈ వీరపురుషదత్తుడు, ఇతని భార్యలు రుద్రభట్టారిక, (ఈమె ఉజ్జయినీరాజు కుమార్తె) చాపిశ్రీ అనువారలు ఒక నూతనాధ్యాయాన్ని ప్రవేశపెట్టినారు. వీరివలననే ఆంధ్రలో బౌద్ధమతవ్యాప్తి బ్రహ్మాండంగా జరిగినది. వీరుగాక శాంతశ్రీ, హమ్మశ్రీ, బోధిశ్రీ అనుస్త్రీలు కూడ బౌద్ధమత విజృంభణకు తోడ్పడినారు.

వీరపురుషదత్తుని అనంతరం కుమారుడైన బాహుబల శాంతిమూలుడు రాజ్యం పాలించినాడు. ఇతని కాలంలోనే రెంటాలవద్ద ఒక బౌద్ధభవనం నిర్మింపబడినది. ఇతని అనంతరమే అనగా క్రీ.పూ. 270 ప్రాంతంలోనే ఇక్ష్వాకువంశం నాశనముయినది. పల్లవరాజులు రంగంలోకి ప్రవేశించినారు. బౌద్ధమతం దెబ్బతిన్నది.



నాగార్జున క్షేత్రమున లభించిన శిల్పములు

ఇక్ష్వాకవంశీయులకు రాజధానిఅయిన విజయపురి అనగా నాగార్జునక్షేత్రం—శోభ బాహుబల శాంతిమూలునితో అంతరించినది.

## అపూర్వ శిల్ప సంపద

ఇక్ష్వాకులు గతించిన అనంతరం వారునిర్మించిన కట్టడాలు క్రమంగా శిథిలమై భూగర్భంలో నిలచిపోయినవి. 2000 సంవత్సరాలనుండి భూగర్భంలో దాగుకొనియున్న శిల్పసంపదను మొట్టమొదటిసారిగా కనుగొనిన కీర్తిప్రతిష్ఠలు 1926 లో మద్రాసు వస్తు పురాతత్వశాఖ సూపరింటెండెంటుకు తెలుగు అసిస్టెంటుగావున్న శ్రీ సరస్వతిగారికి దక్కినది. నిజంగా ఇది ఆంధ్రులకు గర్వకారణం.

ఆనాడు నాగార్జునకొండకు సరియైన మార్గమంటూ ఏదిలేదు. పుల్లారెడ్డిగూడెం అనే గ్రామం ఈ నాగార్జునకొండకు దగ్గరగా ఉన్నది.

1926 లో సాగించిన త్రవ్వకాల ఫలితంగా కొన్ని ఇటుకరాళ్ళ గుట్టలు, కొన్ని పాలరాతి సంభాలు బయటపడినవి. అనంతరం కొంతకాలానికి భారత పురాతత్వ పరిశోధనశాఖ సూపరింటెండెంటుగా ఉన్న లాంగ్ హార్స్ట్ అనునతను త్రవ్వకం సాగించినాడు. అప్పుడు ఒక పెద్ద స్తూపం, కొన్ని చిన్న స్తూపాలు, నాలుగు విహారాలు, ఆరు చైత్యాలు, నాలుగు మండపాలు, రాజప్రాసాదస్థలం, కృష్ణానది తీరాన ఒక రేవు కట్టడం బయటపడినవి.

ఈ నిర్మాణాల కుపయోగింపబడిన ఇటుకరాయి $20'' \times 10'' \times 3''$ పరిమాణం గలది. ఇలాంటి కొలతలుగల ఇటుకలె అశోకుని రాజధానీ స్థలంలో గూడా కనబడటం ఒక విశేషం.

ఇక్కడగల స్తూపం చాలావరకు నాశనమయి ఉన్నది. దానికి కారణం, నిధినిక్షేపాలకొరకు ప్రాకులాడే మూఢులెవరో ఈ అద్భుత కళాఖండాన్ని నాశనంచేసి ఉంటారు.

అసలు స్తూపం అంటే ఏమిటి? బుద్ధదేవుని ధాతువుమీద ఘంటాకృతిగ నిర్మింపబడిన కట్టడాన్ని స్తూపం అని అంటారు. శిల్పకళాసంపదతో తులతూగే శిలలను దానిమీద కప్పుతారు. దానిచుట్టూ వలయాకారంగా సగటున మూడు ప్రాకారాలుంటవి. ఈ వలయాకారాలుగాఉన్న స్థలాలమీద భిక్షులు వినయ వినమితగాత్రులై ప్రదక్షిణలు చేస్తారు. ఈ ప్రాకారాలకు నాలుగుమూలలా నాలుగుతోరణ ద్వారాలుంటవి.

ఈ విధమైన స్తూపాలు పోయినవిపోగా, ఇప్పటికి చక్కగా నిలచియున్నవి రెండు మాత్రమే. అవే సారనాథ్, సాంచీస్తూపాలు.

ఈ స్తూపాల విషయంలో మరొకటి చెప్పాలి.

బుద్ధభగవానుని మరణానంతరం బౌద్ధమత వ్యాప్తికి సమగ్రమైన, సంపూర్ణమైన దోహదం గల్గించాలనే సత్సంకల్పంతో ఆ బుద్ధమూర్తి అవయవ విశేషాలను ఎనిమిది భాగాలుగాచేసి దేశంలో ఎనిమిదిచోట గల స్తూపాలలో అవి భద్రపరచిరి. అశోకచక్రవర్తి బౌద్ధమతావలంబి అయినపిమ్మట, ఒక్క రామగ్రామ స్తూపముతప్ప మిగిలిన ఏడుస్తూపాలను తెరిపించి వానిలోని ధాతువులను చిన్నచిన్న ముక్కలుగాచేసి వానిని వివిధ ప్రాంతాలలోని బౌద్ధులకు పంచిఇచ్చి 84 వేల స్తూపాలను కట్టించెనట. నాగార్జునకొండ, అమరావతి, భట్టిప్రోలు గ్రామాలలోని స్తూపములు వానిలోనివే.

నాగార్జునకొండవద్దగల స్తూపానికి ఉత్తర భాగాన ఒక మంజూషయందు బఠాణిగింజంత పరిమాణము గల బుద్ధదేవుని ధాతువు ఒకటి కనిపించినది. త్రవ్వకాల సమయమున లభించిన ఈ ధాతువును, భారత పురాతత్వశాఖవారు సారనాథ్ క్షేత్రంలో బౌద్ధసంఘం వారు మూలగంధకుటి విహారాన్ని నిర్మిస్తుండగా, వారికి సమర్పించినారు.

ఇక ఈ స్తూప నిర్మాణం విషయం తెలుసుకొందము. 5 అడుగుల ఎత్తు, 102 అడుగుల వ్యాసం గల వేదికపై ఈ స్తూపం నిర్మింపబడినది. దీనిచుట్టు 13 అడుగుల వెడల్పుగల ఒక బాట ఉన్నది. ఈ బాట మీదనే భిక్షులు స్తూపంచుట్టూ ప్రదక్షిణం చేస్తారు. ఈ బాట చుట్టూ 5 అడుగుల ఎత్తుగల ఒక ఇటుకగోడ గలదు. దీనికి నాలుగు ద్వారాలు గలవు ఈనాడు వీని పునాదులు మాత్రమే కనుపిస్తున్నవి.

ఇక కృష్ణాతీరానగల రేవు కట్టడం విషయం. శ్రీ పర్వతంవద్ద గల విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించటానికి వచ్చిన వేలాది విద్యార్థులు ఈ ఓడరేవులోనే దిగెడివారు. అంతేగాక బ్రహ్మాండమైన వర్తక వ్యాపారాలుకూడ ఈ రేవు ద్వారానే జరిగినవి. నేడు కనిపించే కట్టడాన్ని బట్టి చూస్తే దీని పొడవు 250 అడుగులని, వెడల్పు 50 అడుగులని తెలుస్తున్నది.

1938 వరకు జరిపిన త్రవ్వకాల ఫలితంగా మొత్తం 500 శిల్పకళాఖండాలు దొరికినవి.

అనంతరం 1954, అక్టోబరు 17 న మరల త్రవ్వకం పని ప్రారంభమయింది. (మనకు ప్రత్యేకాంధ్రరాష్ట్రం 1953 అక్టోబరులో వచ్చింది.) ఈ త్రవ్వకం పనికి రాష్ట్ర ఆర్థిక మంత్రిగా వున్న శ్రీ



నాగార్జునసాగరం వద్ద నూతనంగా కృష్ణపై నిర్మింపబడిన రోడ్డు వంతెన

తెన్నేటి విశ్వనాథం ప్రారంభోత్సవం చేశారు. ఆ త్రవ్వకం పని ఈనాటి వరకు సాగుతునే ఉంది. కొన్ని వందలమంది కూలీలు మూడు చదరపుమైళ్ళ విస్తీర్ణంలో త్రవ్వకం సాగిస్తున్నారు. ఆనాటి చరిత్రను తెలియజేసే వివిధ శిల్పాలు, కట్టడాలు, ఎన్నో బయట పడుతున్నవి. ఇంకను బయటపడనున్నవి.

ఈ శిల్పఖండాలను వెలికితీసే సందర్భంలో గుంటూరుజిల్లా కలెక్టరుగా ఉండి వెళ్ళిపోయిన ఎస్. రామేశంగారి కృషి ముఖ్యంగా పేర్కొనదగినది.

1954 అక్టోబరు 17 వ తేదీన నాగార్జునకొండకు వెళ్ళబోయే ముందు గుంటూరులో జరిగిన మహా సభలో భారత పురాతత్వశాఖ డైరెక్టరు జనరలు శ్రీ టి. ఎస్. రామచంద్రన్ ఉపన్యసిస్తూ ఒక్క భారత దేశంలోనే గాక ప్రపంచం మొత్తం మీద ఏ ప్రమాణాన్ని బట్టి చూచినా నాగార్జునకొండలో, నాగార్జునక్షేత్రంలో, వెల్వడిన శిల్ప కళాఖండాల శిల్పంతోనూ, సౌందర్యంతోనూ పోల్చదగిన దేదీ లేదని అన్నారు.

"నాగార్జున క్షేత్రంలోని ప్రతిరాయి ఒక శిల్పమే. ఒక కళాఖండమే, అక్కడి శాసనాలలోని ప్రతి అక్షరమూ సౌందర్యనిలయమే. అక్కడి శిల్ప కళాసంపద బయటపడితే కళాచరిత్రలో ఒక మహోజ్వల నూతనాధ్యాయం ప్రారంభమై, ప్రపంచ కళా చరిత్రలో ఆంధ్రుల అపూర్వ శిల్ప చిత్రలేఖన కళా నైపుణ్యానికి సాటిలేని మహోన్నత స్థానం లభ్యమై తీరుతుంది." అని కూడా వారన్నారు.

ఈమాటలు అక్షరాలా నిజం...

నిజానికి నాగార్జున క్షేత్రంలో త్రవ్వకం పని ఆరంభించిన అనంతరం బహిర్గతమైన శిల్పసంపదను వీక్షిస్తే శ్రీ రామచంద్రన్ అన్న వాక్కులలోని యాథార్థ్యం గోచరింపకమానదు.

బహిరతమైన వానిలో ఒక దేవాలయం కూడా ఉన్నది. ఇది కొండపైన గలదు. కొండపైకి ఎక్కే యాత్రీకులు మార్గమధ్యంలో విశ్రమించటానికి వీలుగా కొన్ని శిలా వేదికలు కూడా అమర్చబడినవి. పాద ప్రక్షాళన చేసికొన్న అనంతరం ఆనీరు బయటికి పోవటానికి వీలుగా ఒక తూము ఉన్నది.

క్రీస్తుశకం రెండవ శతాబ్దినాటి నాణెములు, సీసపు ముద్దలు, నాణెములు తయారుచేయుటకు కావలసిన మూసలు బయటపడినవి. ఇవిగాక 60 శాసనములు వెలువడినవి. ఒక శాసనం మీద బోధిశ్రీ అను నామె కాశ్మీర్, గాంధార్, తోసలి, యవన, తమిళ, మొదలగు దేశములందు బౌద్ధమతవ్యాప్తిచేసిన బిక్షు సంఘములకు నివాసాలుగా అనేక కట్టడాలు నిర్మించినట్లు వ్రాయబడి ఉన్నది. ఆనాడు బౌద్ధమతంలో వర్ధిల్లిన వివిధ శాఖలను గూర్చి కూడా కొన్ని శాసనాలలో తెలియజేయబడినవి.

నిర్మాణ కళావైభవాన్ని తెలియచేసే 43 అడుగుల చైత్యం బహిర్గతమయినది. ఐదు శిలాస్తంభాలు కనబడినవి.

ఇవిగాక స్టేడియం, ఒక ఆరు గ్యాలరీ, ఆచార్య నాగార్జునుని నిమిత్తం నిర్మింపబడిన బ్రహ్మాండమైన సంఘారామం బయటపడినవి.

ఇటీవలగా, వేటగాని వేషంలో ఉన్న సిద్ధార్థుని కంచు విగ్రహం దొరికినది. ఒకచోట అశ్వమేధ యాగం జరిగిన స్థలం కనిపించినది. ఇక్కడ ఒక గుఱ్ఱం, ఒక మేక అస్థిపంజరాలు కనపడినవి. అంతేగాక, రాతిచెక్కడం పరిశ్రమకు ఉపయోగించే పరికరాల పరిశ్రమ ఒక్కటి ఇక్కడ వ్యాప్తిలో ఉన్నట్లు కూడ వెల్లడి అయినది.

నాగార్జున సాగర్ నిర్మాణం పూర్తిఅయినపుడు ఈ శ్రీ పర్వత ప్రాంతం — అడుగున పడిఉన్న బ్రహ్మాండమైన శిల్పసంపదతో పాటు — నీటిలో మునిగిపోతుంది గనుక, ఈ లోయలో గల అమూల్యమైన కళాఖండాలను భద్రపరిచే ఉద్దేశంతో ఈ త్రవ్వకం పని చాలా చురుకుగా సాగుతున్నది. ఈ త్రవ్వకం పనిలో ఇంకను అనేకకళాఖండాలు బయల్పడ నున్నవి. వీనితోపాటు అనేక నూతనాంశాలను తెలియచేసే మహోజ్జ్వల చారిత్రక విశేషాలుకూడ తెలియగలవు.

## నాగార్జున సాగర్

నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మింపబడుతున్నది నాగార్జునక్షేత్రంలోనే. మాచర్లకు 13 మైళ్ళ దూరంలో గల నందికొండ అనే గ్రామానికి $1\frac{1}{2}$ మైలు దూరంలో నిర్మింపబడుతున్న ఈ ప్రాజెక్టు వలన 34 లక్షల ఎకరాలకు సాగు ఏర్పడి, 12 లక్షల టన్నుల ఆహారధాన్యాలు అదనంగా పండుతవి. ఈ ప్రాజెక్టుకు కయ్యే ఖర్చు రు 122కోట్లు. సిమెంటురాయితో ఇక్కడ కట్టే ఆనకట్ట భారత దేశంలోని అన్ని ఆనకట్టలకన్నా పెద్దది. ప్రపంచంలో ద్వితీయస్థానం ఆక్రమిస్తుంది.

ఈ ప్రాజెక్టు కృష్ణానదీ జలాలపై నిర్మింపబడుతున్న రెండవ నిర్మాణం. దీని ప్రధానమైన కాలవల నిడివి 416 మైళ్ళు, రిజర్వాయరు పరిమాణం 93 లక్షల ఎకరాల అడుగులు.

1955, డిసెంబరు 10 వ తేదీన ఉదయం 8 గం 30 ని॥ లకు భారత ప్రధాని నెహ్రూ ఈ ప్రాజెక్టు నిర్మాణానికి శంకుస్థాపనచేశారు. ఆనాడే ఆంధ్ర తెలంగాణాల సమ్మేళనోత్సవం కూడ జరిగిందని చెప్పాలి.

ఆనకట్ట నిర్మాణోత్సవాన్ని శ్రీ నీలం సంజీవరెడ్డి 1956 అక్టోబరు 10 వ తేదీన ప్రారంభించారు. 1957 జూలై 12 వ తేదీన ఆనకట్ట రాతి కట్టడం నిర్మాణానికి కేంద్ర సాగుదల విద్యుచ్ఛక్తి శాఖా మాత్యులు ఎస్. కె. పాటిల్ ప్రారంభోత్సవం చేశారు.

ప్రాజెక్టు నిర్మాణం సాగుతున్నకొలదీ ఆనకట్ట పరిసరాలలో బ్రహ్మాండమైన నగరం ఒకటి ఏర్పడుతున్నది. సుమారు 30 వేల జనాభా ఉన్నారు. ప్రస్తుతం వారి సౌకర్యార్థం అక్కడ ఆసుపత్రి హైస్కూలు గృహాలు ఇత్యాదులు నిర్మాణంలో ఉన్నవి.

ఆనకట్టకు రెండు వైపులా రోడ్ల నిర్మాణం పూర్తిఅయింది. విద్యుచ్ఛక్తి సరఫరాకు విద్యుత్ కేంద్రాన్ని మాచర్లలో ఏర్పాటుచేశారు. డాముకు దిగువన 30 లక్షల ఖర్చుతో రోడ్డుబ్రిడ్జి నిర్మాణంలో నున్నది. దీనివెడల్పు 38 అడుగులు.

మాచర్లనుంచి సరాసరి ఆనకట్ట దగ్గరకు రైలు మార్గం వేస్తున్నారు. మాచర్లలో సిమెంటు ఫ్యాకరీని నిర్మిస్తున్నారు. అదే ప్రాజెక్టుకు కావలసిన సిమెంటును సప్లయి చేస్తుంది. 1957 జూన్ ఆఖరు నాటికి ప్రాజెక్టుకోసం సుమారు రు 6 కోట్లు ఖర్చుపెట్ట బడినది.

ఒకవైపు ఆనకట్ట నిర్మాణం, మరోవైపు నగర నిర్మాణం వేరొకవైపు కాలవల నిర్మాణం ఇంకొక వైపు శిల్పసంపదను బయటికి తీయటానికిగాను త్రవ్వకం పని వీటన్నిటితో నాగార్జున క్షేత్రం ఈనాడు తిరిగి కళకళ లాడుతున్నది.

త్రవ్వకం పని సాగవలసిన ప్రాంతం 2750 ఎకరాలు ఇప్పటికి 1200 ఎకరాలలో త్రవ్వకం పనిపూర్తి అయింది.

1960 నాటికి త్రవ్వకం పని పూర్తిఅయి లభ్యమయిన శిల్పసంపద అంతా నాగార్జున పర్వతం మీద నిర్మింపబడనున్న మ్యూజియంలో భద్రపరచబడుతుంది. 110 చ. మైళ్ళ విస్తీర్ణంగల రిజర్వాయరు మధ్యలో ఈపర్వతం ఒక చక్కని ద్వీపంమాదిరి ఉంటుంది. ఈ నాగార్జున క్షేత్రం ఆనాడు మహోజ్జ్వల విజ్ఞాన సాగరంగా విలసిల్లినది. ఈనాడది కృష్ణవేణీ జలాలద్వారా ఆంధ్రావనిని సస్యశ్యామలం కానున్నది. ఇంతకు ఆచార్య నాగార్జునుని తపోమహిమ అనిర్వచనీయమూ, అనుపమానము అయినట్టిది. అందుకే ఆయన అమరజీవి అయినాడు.

# వసతి గృహం

శ్రీ బలిజేపల్లి రాఘవరావు

**పాత్రలు:** కాంతారావు, కృష్ణారావు, ఉష, రాము, భాస్కర్, ప్రభాకర్, సీతారామయ్య

* * కాంతారావుగారి యిల్లు, నాగరికుల యింట్లో వుండవలసిన సామగ్రి అంతా వుంటుంది. కుడి ఎడమ వైపులకు ఇంట్లోకి, వీధిలోకి ద్వారా లుంటాయి. ఎదురుగా ఒకద్వారం, దాని పక్కనే రేడియోసెట్టు, రేడియోపైన వీణ వాయిస్తున్న సరస్వతి విగ్రహం అమర్చబడి వుంటుంది. గోడమీద రాధాకృష్ణుల ఫోటో, దానికి చెరోవైపునా రెండు ప్రకృతి దృశ్యాలూ కనిపిస్తాయి. మూడు పేము కుర్చీలూ, మధ్యని టీపాయ్, దాని మీద ఎంబ్రాయిడరీ చేసిన టేబిల్ క్లాత్ వుంటాయి. తెర లేచేసరికి కాంతారావు హడావుడిగా తిరుగుతూ కనిపిస్తాడు. వయస్సు 50 సం॥లు.

కాంతా: రామూ! ఒరే రామూ!

[లోనుండి "బాబూ"అని కేక. రాముప్రవేశం. 16 సం॥ల వయస్సు. కేక వేసిన ఒక నిమిషానికి వస్తాడు.]

రాము: పిలేరా బాబూ!

కాంతా: చిత్తం! ఇంత వేగం వచ్చేరేమండీ!

రాము: అదేమిటి బాబయ్యా! పిలవగానే వచ్చేను కదండీ

కాంతా: (కోపం అణుచుకుంటూ) పిలవగానే వచ్చేడుట! వెధవ! ఇంకా జవాబు చెపుతున్నావ్... నీకు బుద్ధి లేదురా!

రాము: చిత్తం!

కాంతా: (కోపంగా) ఏమిటి చిత్తం, బత్తెం!... నువ్విప్పు డెన్ని తప్పులు చేసేవో తెలుసా?

రాము: తెలీదండి.

కాంతా: ఔను నీ కెలా తెలుస్తుంది?

రాము: చెబితేనండి.

కాంతా: ఆహాఁ! అయితే విను. మొదటిది. పిలవగానే రాలేదు. రెండోది,...ఆఁ!, పిలవగానే ఏం చెయ్యాలని చెప్పేను?

రాము: ఏ పని చేస్తున్నా ఆ పని అలాగే వదిలేసి....

కాంతా: నిశ్శబ్దంగా నాదగ్గరికి రావాలి, అని చెప్పేను ఔనా?

రాము: అవునండి.

కాంతా: మరి నువ్విప్పుడేం చేశావ్?

రాము: ఏం చేసేనండి?

కాంతా: ఏం చేసేవా!...పిలవగానే "బాబూ!" అని కనేడియన్ ఇంజన్ కూతలాంటి కేక ఒకటి వేసేవ్. దానివల్ల యిక్కడ ఎంతమందికి డిస్టర్బెన్స్ అయిందో తెలుసా?

రాము: అవుతుందండి.

కాంతా: అవదు మరీ! అంతెందుకు, అసలు నిన్నెందుకు పిల్చేనో కూడా నేను మరిచిపోయాను ఆ కేకవల్ల!

రాము: అలాగాండి!

కాంతా: ఆఁ! అంచేత ఇకనుండి అలాంటి వెధవకేకలు వేస్తే రూపాయి ఫైన్. ఇక పో!

రాము: (వెళ్తూ మధ్యలో ఆగి) ఇంతకీ నన్నెందుకు పిల్చేరు బాబూ?

కాంత: అదే మర్చిపోయానని అన్నానా ఇందాకా!

రాము: చిత్తం! (వెళ్తూవుంటాడు)

కాంత: (ఒక్కక్షణం వూరుకుని) ఒరే రామూ!

రాము: (నిశ్శబ్దంగా దగ్గరికి వచ్చి నిలబడతాడు)

కాంత: అబ్బాయి వచ్చేడా!

రాము: రాలేదు బాబూ!

కాంత: రాలేదు. నాకు తెలుసు వాడు రాడని. లక్ష సార్లు చెప్పేను వాడికి ఆ క్లబ్బులో పేకాడ వద్దని. వింటేనా! పోనీ అమ్మాయేనా వుందా?

రాము: వున్నారండీ!

కాంత: నేను రమ్మన్నానని పిలు!

["అలాగేనండి" అని రాము లోనికి వెళ్తూండగా వీధిలోనుంచి కృష్ణారావు ప్రవేశం. వయస్సు సుమారు 22 సం॥లు. చురుకుగా కనిపిస్తాడు.]

కాంత: (ఇంట్లోకి వెళ్తూన్న కొడుకుని చూసి) ఒరే కృష్ణా!

కృష్ణా: (ఆగి) ఏం?

కాంత: ఒక్కసారి యిలా రా!

కృష్ణా: (వచ్చి) ఎందుకు?

కాంత: షికారు పూర్తయిందా? ఏమిటా వేషం నువ్వూను!

కృష్ణా: ఏం? ఇప్పుడేం తక్కువైంది నాకు?

కాంత: ఇంటికివచ్చే అతిథులముందు అలానుంచో డానికి సిగ్గువెయ్యడంలేదు నీకు?

కృష్ణా: నాకెందుకు సిగ్గు? అయినా ఆ వచ్చేవాళ్ళు చెల్లాయిని చూడ్డానికి వస్తారుగాని నన్ను చూడ్డానికి కాదుగా!

కాంత: అయితే దాని పెళ్ళి బాధ్యత నీకేం లేదన్న మాట

కృష్ణా: అన్ని బాధ్యతలూ సక్రమంగా నిర్వర్తిం చేందుకు మీరున్నారుగా! మరి నేనెందుకు?

కాంత: సవితిఅన్న వైనందుకు నీబుద్ధిపోనిచ్చు కున్నావుగావురా! చదువా సంధ్యా! ఇరవై నాలుగ్గంటలూ ఆక్లబ్బులో పేకాడకపోతే అలా ఒకసారి పొలం వేపు వెళ్ళిరారాదూ?

కృష్ణా: ఐందా? ఇంకేమన్నావుందా? ఇందుకేనా నన్ను పిల్చింది?

కాంత: (కోపం అణుచుకుంటూ) ఒరేయ్ నాయనా ఈ రెండురోజులైనా ఇంటిపట్టున వుండరా నామాటవిని!

కృష్ణా: అలాగేలెండి. (లోపలికి వెళ్తాడు)

కాంత: (కూర్చుంటూ) ఛ! ఛ! బొత్తిగా భయం భక్తిలేకుండా పోయాయిగదా! అందుకే పిల్లల్ని అతిగారాబం చెయ్యొద్దన్నారు పెద్దలు.

[లోనుంచి ఉష ప్రవేశం. సంప్రెటి ముఖం. చురుకుగానూ గుడుగ్గానూ కన్పిస్తుంది. వయస్సు 16 సం॥ లైనా 18 సం॥ రాలు గలదిగా కనిపిస్తుంది. అందమైన విగ్రహం]

ఉష: ఏం నాన్నా పిల్చేరట?

కాంత: ఆ! చూడమ్మా! నువ్వు బట్టలూ అవీ త్వరగా మార్చుకుని సిద్ధంగా వుండాలి.

ఉష: రేపటి సంగతి కదా నాన్నా!

కాంత: అన్నా! రేపటి సంగతైతేనేం? వాళ్ళివాళే రావొచ్చు.

ఉష: ఎందరు?

కాంత: పెళ్ళికొడుకు, అతని స్నేహితుడు, వాళ్ల నాన్నగారు. ఆయనా నేను చిన్నప్పుడు ఒకేస్కూల్లో చదువుకున్నాంలే! కుఱ్ఱాడు సౌమ్యుడు, అభ్యుదయభావాలున్నవాడు,

[ఈ సంభాషణ అవుతూవుండగా కృష్ణారావు వీధిలోకి వెళ్తూవుంటాడు.]

కాంత: (ఆగి) వీధిలోకేనా మళ్ళీ?

కృష్ణా: ఇంటిదగ్గరుండి ఏం చెయ్యమన్నారు?

ఉష: అవున్నాన్నా! అలా వెళ్ళి వస్తాడు!

కాంత: సరే! నువ్వూలోపడుతూన్నా!...ఒరే! వాళ్ళకి ఎదురు వెళ్ళగురా?

కృష్ణా: అలాగేన్లెండి! (వెళ్తాడు).

కాంత: ఛ ఛ! మరీ పొగరుబోతుగా తయారౌతున్నాడు!

ఉష: ఎవరు నాన్నా?

కాంత: ఇంకెవరు? వాడే! పొద్దున్న లేచినదగ్గర్నుంచీ రోజల్లా ఆ క్లబ్‌లో పేకాడడమే పని!

ఉష: మరి ఇంటిదగ్గర ఊసుపోవద్దు నాన్నా!

కాంత: ఇంట్లో ఊసుపోకపోతే పేకాట ఆడమని వుందా యేమి?...సరే! నువ్వెళ్ళమ్మా! వెళ్లు!

ఉష: అలాగేన్లెండి (వెళ్తుంది.)

కాంతా: రామూ! ఒరే రామూ! (రాము తొందరగా వస్తాడు.) ఒరే చూడు! ఎవరైనా వస్తే నేనా మండువాగదిలో వుంటాను చెప్పు. తెలిసిందా?

రాము: తెలిసిందండి!

కాంతా: నువ్విక్కడే వుండు! (వెళ్తాడు.)

[కొద్దిక్షణాలు నిశ్శబ్దం. వీధిలోంచి కృష్ణారావు, భాస్కర్, ప్రభాకర్ వస్తారు. వాళ్ల చేతుల్లో లెదర్ బేగ్స్ వుంటాయి. ఇద్దరూ ఒకే యీడువాళ్లు.]

ప్రభా: (చుట్టూ కలయజూసి) ఇదేనా?

కృష్ణా: ఆc! యిదే!...ఒరే రామూ! ఆ దక్షిణపు వేపుగది శుభ్రంచేసి వీ రిద్దరికే మంచాలూ అవీ వేసి సిద్ధంచెయ్యి! వీళ్లిద్దరూ ఇవాళ యిక్కడే భోజనమని లోపల చెప్పు.

రాము: అలాగేనండి(ఎదురుగావున్న ద్వారంలోనుంచి వెళ్తాడు.)

భాస్క: ఏమండీ! ఒక చిన్న సందేహం!

కృష్ణా: ఏమిటండీ?

భాస్క: ఇది హోటల్ లా లేదే!

కృష్ణా: అదే నండీ యీ వసతిగృహం యొక్క ప్రత్యేకత! చాలా హోమ్లీ గా వుంటుంది.

ప్రభా: ఇంతకంటె మంచివిలేవా అండీ యీ వూళ్లో?

కృష్ణా: అబ్బే! ఎలా వుంటాయండీ? ఇది పల్లే పట్నం కాదు.! ఉన్నవాటిలో యిదే మంచిది!

భాస్క: నెయిటర్స్ ఎవరూ కనపడరేం?

కృష్ణా: ప్రత్యేకంగా లేరుగాని, ఇందాక వెళ్లేడే వాడే అన్నీను.

ప్రభా: పోనీ యాజమాని అంటూ వొకడున్నాడా అదీ లేదా?

కృష్ణా: ఉన్నాడు లెండి ఒకపక్షి!

ప్రభా: అయితే ఫరవాలేదు లెండి!

భాస్క: ఇవాళ ఇక్కడ ఉండవలసింది మే మేలా వుందె...ఊళ్లోనా కెవరైనా.

కృష్ణా: ఈ వూళ్లో కొత్త పెద్దమనుషులన్న వాళ్లంతా యిక్కడికి వస్తారులెండి.

భాస్క: అలాగా!

కృష్ణా: మీ రీవూరు పెళ్లిచూపులకి వచ్చేమన్నారు కదూ

భాస్క: ఔను.

కృష్ణా: ఎవరి పిల్లని?

ప్రభా: ఈ వూళ్లో కాంతారావుగారని వున్నారట! వారమ్మాయిని. వీడేలెండి, వరుడు.

కృష్ణా: మరి మీవెంట పెద్ద వాళ్లెవరూ రాలేదేం?

ప్రభా: వాళ్ల నాన్నగారు పట్నంనుంచి మమ్మల్నిక్కడికి రమ్మని వ్రాసేరు. ఆయనకూడా వస్తారు. మేం నేరుగా పట్నంనుంచి వచ్చే మిక్కడికి.

కృష్ణా: మరి మీకు తెలుసా ఆ కాంతారావుగారు?

భాస్క: తెలీదు. కానివారికి మాత్రం మమ్మల్ని తెలిసేవుంటుంది.

కృష్ణా: ఎలా?

భాస్క: వారూ, మా నాన్నగారూ చిన్నప్పుడు ఒకేస్కూల్లో చదువుకున్నారు. బాల్యస్నేహితులు. ఎప్పుడో ఐదేళ్లక్రిందట ఆయన మాయింటి కొచ్చినప్పుడు చూసేను. ఆయన నన్నెరుగుదురనుకుంటాను.

కృష్ణా: మీరాయన్ను గుర్తుపట్టగలరా?

భాస్క: చాలా కష్టం! నేను పోల్చలేనండి.

ప్రభా: అది సరేగాని, ఏమండీ! నాకు తెలీక అడుగుతాను, ఈ కాంతారావుగారి స్థితి యెలాంటిదండీ?

కృష్ణా: అంటే?

ప్రభా: మనిషి మంచివాడేనా అని?

కృష్ణా: మంచివాడే.

భాస్క: ఆయనెప్పుడైనా యిక్కడకు వస్తారండీ?

కృష్ణా: ఆc! అప్పుడప్పుడు...వారమ్మాయి మాత్రం రోజూ వస్తుందిక్కడికి.

భాస్క: ఎందుకు?

కృష్ణా: ఈ హోటల్ యజమాని కూతురూ ఆమె స్నేహితులు. క్లాస్ మెట్స్ అంచేత రోజూ వస్తుంది. ఇవాళకూడా వచ్చేవుంటుంది.

ప్రభా: ఇవన్నీ మీకెలా తెలుసండీ?

కృష్ణా: సరే! నాకు గాకపోతే మీకు తెలుస్తాయా? నాకీ హోటల్లో భాగంవుందికూడా తెలుసా?

భాస్క: అలాగా! మరి చెప్పారు కారేం?

కృష్ణా: మీరు చూడాలనుకుంటే ఆ అమ్మాయిని పిలిపిస్తాను. ఇక్కడే చూడొచ్చు.

ప్రభా : ఈ హోటల్‌లో అలాంటి సమావేశాలు కూడా అవుతాయేమిటండీ ?

కృష్ణా : అబ్బే ! ఆ అమ్మాయి ఒక వరసని నాకు చెల్లె లవుతుందిలెండి !

ప్రభా : ఓహోఁ ! అలాగా !

భాస్క : ఎవరండీ ఆ వొస్తున్నాయన ?

కృష్ణా : (చూసి) ఆయన... ఆయనే ఈ హోటల్ యజమాని, చాలా మంచివాడు ! (కాంతా రావులోనుండి వస్తాడు. అంతా లేచి నుంచుంటారు.)

భాస్క, ప్రభా : సమస్కారమండి !

కాంతా : నమస్తే !

భాస్క : మేం ఈరాత్రికి యిక్కడే వుంటామండి ! ప్రొద్దున్నే...

కాంతా: కృష్ణా ! వీరెవరు ?

ప్రభా : మేమూ.

కృష్ణా : (మధ్యలో ఆపి) అదంతా నే చెప్తాలెండి ! మీ కెందుకా శ్రమ ! వీరిద్దరూ ఈ రాత్రికి యిక్కడే వుంటారు.

కాంతా: అసలు వీరెవరో ?

ప్రభా : మేమూ......

[రాము వస్తాడు]

కృష్ణా : సరే మీ రెవరో నేను చెప్తానులెండి !... ఏరా ! గది సిద్ధమేనా ?

రాము : అయిందండి.

కృష్ణా : రండి. ముందు మీకు గది చూపిస్తాను. నే నాయన్తో అన్నీ చెప్తాలెండి.

[ముగ్గురూ కలిసి ఎదురుగా వున్న ద్వారంగుండా వెళ్తారు.]

కాంతా: ఒరే రామూ ! వీళ్ళెవర్రా ?

రాము : ఏమోనండి ! చిన్నయ్యగారే తీసుకొచ్చారు. దక్షిణపు వేపు గది సిద్ధం చెయ్యమన్నారు ఆరిద్దరికీ. ఇయ్యాళ ఆరిద్దరూ భోజనం అన్నీ యిక్కడే !

కాంతా: ఎవరు చెప్మా ! ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం ! ఎక్కడ చూసేనో !

రాము : అయ్యా ! కొంపదీసి మనం అనుకుంటున్న వారే నేమో యీరు.

కాంతా: ఎవరు ?... పెళ్ళివారా ?...ఛ ఛ ! వాళ్లు కారు.

రాము : లేకపోతే చిన్నయ్యగారి స్నేయితులేమో ?

కాంతా: ఏమో ? కావచ్చు.

రాము : పోయి అడిగేదాండి ?

కాంతా: వొద్దు వొద్దు ! నువ్వేం అడగొద్దు ! అబ్బాయొస్తాడు, వాణ్ణో అడగొచ్చు !

రాము : అది సరేగాని బాబూ ! ఆ పెళ్ళికొడుకుగారు ఆ దొరబాబు నాగుంతారండీ ?

కాంతా: ఏ దొరబాబురా ?

రాము : అత నేనండీ ? ఆ టోపీ యేసుకున్నాయన !

కాంతా: ఓహో ! అతనా !...అవున్నా ! ఇంచుమించు అలాగే వుంటాడు. ఏమో సరిగ్గా జ్ఞాపకం లేదు. ఆ అబ్బాయిని ఎక్కడో చూసి నట్టుంది.

[కృష్ణారావు ప్రవేశం]

కృష్ణా : ఒరే ! రామూ ! వాళ్ళకేదైనా అవసరం వుంటుందేమో ! నువ్వెళ్ళి అక్కడే వుండి ఏది కావలిస్తే అది యివ్వు ! పో !

[రాము వెళ్తాడు.]

కాంతా: కృష్ణా ? వాళ్ళెవరు ?

కృష్ణా : ఏమో నాకూ తెలీదు. కొత్తగా వచ్చేం, నా వసతి సదుపాయం దొరుకుతుందా అని అడిగేరు. పోనీలే అని తీసుకొచ్చేను. ఈ రాత్రి వుంటారు, పొద్దున్నే పోతారు.

కాంతా: వాళ్లిదేవూరో, ఏం పనిమీద వచ్చేరో తెలుసుకున్నావా ?

కృష్ణా : పోనిద్దురూ, అవన్నీ మనకు ఎందుకు ? అయినా మనకవి అనవసరమేమో !

కాంతా: అంతేలే అంతే ! కాని తెలుసుకుంటే మంచిదికదా అని అన్నాను...ఆఁ ! నేనలా బస్ స్టేండుకి వెళాను.

కృష్ణా : ఎందుకు ?

కాంతా: ఆ వొచ్చేవాళ్ళకు మన యిల్లేం తెలుస్తుంది చెప్పు ? వాళ్లకి ఎదురు వెళ్ళినట్టూ వుంటుంది, షికారూ అవుతుంది. వెళ్తాను.

కృష్ణా: సరే ! మీయిష్టం !

కాంతా: ఆఁ! ఇంటిదగ్గర జాగ్రత్త. వస్తాను.
[కాంతారావు వీధిలోకివెళ్తాడు. కృష్ణారావు తనలోనవ్వుకుంటాడు. లోనుండి ఉషవస్తుంది]
ఉష: ఎవరన్నయ్యా ఆ వచ్చింది?
కృష్ణా: ఎవరో మనకెందుకు?
ఉష: ఎందుకొచ్చేరు?
కృష్ణా: ఏమో! ఈరాత్రివుంటారు, పొద్దున్నే పోతారు.
ఉష: బాగుంది. ఊరూ పేరూ తెలుసుకోకుండా యింట్లో ప్రవేశ పెడతావా?
కృష్ణా: వాళ్ళేం దొంగలనుకున్నావా దోచుకోడానికి?
ఉష: ఏమో, ఎందుకు కాకూడదు?
కృష్ణా: బాగుంది. అలాగని ఇంకెక్కడా అనకు. నాన్నగారికి కోపంరాగలదు.
ఉష: నాన్నగారికి తెలుసా?
కృష్ణా: తెలుసు...ఆయనే అన్ని సదుపాయాలూ చెయ్యమన్నారు.
ఉష: అలాగా!
కృష్ణా: ఆఁ! చూడుచెల్లీ! వాళ్ళతో కాస్త మర్యాదగా మాట్లాడూ!
ఉష: అలాగేలే!
కృష్ణా: (ఒక్కక్షణం వూరుకొని) నేనలావెళ్ళియిప్పుడే వస్తానూ...వాళ్ళకేమైనా కావలిస్తే చూడూ!
ఉష: సరే! నువ్వుమళ్ళీ వేగంరావాలి సుమా!
కృష్ణా: ఇక్కడున్నట్టురానూ!
[వీధిలోకి వెళ్తాడు. కొద్దిక్షణాలు నిశ్శబ్దం. ఎదురుగావున్న ద్వారంలోనుంచి ప్రభాకర్ ప్రవేశం. అతన్నిచూసి ఉష లేచి నిలబడుతుంది. ప్రభాకర్ కొద్దిగా తటపటాయించి ఏదో వూహిస్తాడు].
ప్రభా: నమస్తే!
ఉష: నమస్తే!...కూర్చోండి. [ఇద్దరూ కూచుంటారు]
ప్రభా: మీరూ...
ఉష: నేనీగృహయజమాని కుమార్తెను.
ప్రభా: ఓఁ! అలాగా!
ఉష: మీకిక్కడ అన్నిసదుపాయాలూ సరిగా అమిరాయా?
ప్రభా: ఓఁ! అద్భుతంగా వుందండి. ఇక్కడివసతి, మాకెంతో హాయిగావుంది.

ఉష: ఆఁ! ఏదోలెండి. మావూరు పూర్తిగా పట్నం కాదు, పూర్తిగా పల్లెగాదు; రెంటికీ చెడ్డ రేవడి!
ప్రభా: ఐతేనేమండి. ఇటువంటి వసతి సదుపాయాలు ఏపట్నంలోనూ వుండవ్. పైగా బోలెడుడబ్బు తీసుకుంటారు. ఒకటే సరిగ్గావుండదు...అది సరే గాని మీరేమీ అనుకోకపోతే ఒక చిన్నవిషయం అడుగుతాను.
ఉష : అడగండి.
ప్రభా : మీరీ వూళ్ళో కాంతారావుగారని......
ఉష : అవును. ఆయన మా నాన్నగారే!
ప్రభా : ఏమిటీ! అంటే మీరూ!...మీ పేరు?
ఉష : నాపేరు ఉష. ఇంతకీ మీరెవరు?
ప్రభా : నాపేరు ప్రభాకర్. ఆ రెండో ఆయనపేరు భాస్కర్. నా స్నేహితుడు. మేమిద్దరం పట్నంలో బి. ఏ. ఫైనల్ యియర్ చదువుతున్నాం.
ఉష : మరి ఈ వూరెందుకొచ్చారు?
ప్రభా : పెళ్ళి చూపులకి.
ఉష : ఎవరికి?
ప్రభా : మావాడున్నాడే...మా భాస్కర్‌కి. వాళ్ళ నాన్నగారు ఇక్కడొక సంబంధం వుందని, చూడమని వ్రాసేరు. వాడికి తగని బిడియం! అందుకని నేను వెంటవచ్చాను.
ఉష : ఇంతకీ మీరెవరి పిల్లని చూడాలి?
ప్రభా : (తాపీగా) మిమ్మల్నే!
ఉష : (ఆశ్చర్యంగా) ఏమిటీ!
ప్రభా : ఈ వూళ్ళో కాంతారావుగారి అమ్మాయిని మేం చూడాలి. మీరే అన్నారుగా వారు మీ నాన్నగారేనని. అంచేత మీరే నన్నమాట మేం చూడాల్సిన వధువు.
ఉష : మరి మా నాన్నగారు మీకోసం వెళ్ళారే! మీకు తెలీదా ఆయన్ని?
ప్రభా : తెలీదు. ఈ హోటల్‌కి మీరొస్తారని ఆ పెద్దమనిషి చెప్పాడు.
ఉష : ఇది హోటలని ఎవరు చెప్పేరు?
ప్రభా : కాదా?
ఉష : కాదు.

ప్రభా : మరి? ఆ పెద్దమనిషి యిది హోటలని చెప్పేడే!

ఉష : మీరు పొరబడి వుంటారు. మీరనుకుంటున్న కాంతారావుగారి యిల్లు ఇదే.

ప్రభా : (ఆశ్చర్యంగా) ఆఁ! ఇది కాంతారావుగారి ఇల్లా!

ఉష : ఔను. ఆ ముసలాయనే కాంతారావు గారంటే!

ప్రభా : ఇంకా నయం! ఆయన దగ్గిర ఈ మాట లన్నాం కాము. వీపు రాండోలు వాయించును.

ఉష : ఇంతకీ ఇది హోటలని చెప్పిన ఆ పెద్ద మనిషి యెవరు?

ప్రభా : మమ్మల్నిక్కడికి తీసుకొచ్చాడే, ఆ యెఱ్ఱ బుష్‌కోటు వేసుకున్నాయనే!

ఉష : (తేలిగ్గా) ఓఁ! అతనా! అతను మా అన్నయ్యే లెండి!

ప్రభా : ఏమిటీ! అ మహానుభావుడు మీ సహోదరుడా గొప్ప కిలాడీ లాగున్నాడే!

ఉష : వాడికి కొత్తవాళ్లని ఏడ్పించడమంటే కొంచెం సరదాలెండి!

ప్రభా : ఏం సరదావో బాబూ!...దయచేసి మీ నౌఖర్ని పంపుతారా వోమాటు!

ఉష : ఎందుకు!

ప్రభా : ఏదైనా హోటల్ చూపిస్తే అక్కడికి పోతాం!

ఉష : మరేం ఫర్వాలేదు. ఇక్కడే వుండండి. అసలు మీకోసమే ఎదురుచూస్తున్నాం మేమంతాను.

ప్రభా : అలాగా! థేంక్స్!

ఉష : అసలు మీరెలా కనిపించారు మా అన్నయ్యకి?

ప్రభా : బస్సు దిగగానే ఆ మహానుభావుడే ఎదురు పడ్డాడు. కొత్తడాబుసరిగా వున్నాడుకదా అని 'ఏదైనా వసతి గృహంవుందా యీవూళ్లో?' అని అడిగాం "ఏవూరు? ఏంపని మీదవచ్చేరు?' అని అడిగేడు. ఇలా పెళ్ళి చూపులకి ఒచ్చేమని చెప్పాం. మేము చెప్పినవన్నీ విని అదోలా మొహం పెట్టి నాతోరండని చెప్పి యిక్కడికి తీసుకొచ్చాడు.

ఉష : అలాగా!

ప్రభా : అసలు ఈ యింటిని చూడగానే యిది హోటల్ కాదనిపించింది మాకు. కాని ఆయన మిమ్మల్ని దబాయించేసు. మరింకేంచేస్తాం? అసలే కొత్తవూరు. అంచేత ఆయన చెప్పిన మాటలు నమ్మవలసి వచ్చింది!

ఉష : పాపం!

ప్రభా: చూడండి!...మీతో ఇంత యిదిగా మాట్లాడుతున్నందుకు.

ఉష : మరేం ఫర్వాలేదు. చెప్పండి! అసలు నాకు కలుపుగోలుతనంగా వుండేవాళ్ళంటే సరదా!

ప్రభా : అలాగా! అయితే ఫర్వాలేదు. కాని మా వాడున్నాడు చూసేరూ!

ఉష : ఎవరూ?

ప్రభా : అదే మా భాస్కర్. అంటే పెళ్ళికొడుకు... వాడు చాలా ముభావంగా వుంటాడండి. అసలు వాడి ప్రకృతే వేరండి!

ఉష : ఉహూఁ! (పైమాటలుఅవుతూండగాభాస్కర్ వస్తాడు.)

భాస్క : ఒరే ప్రబర్! (అని ఉషనిచూసి మధ్యలో ఆగిపోతాడు.)

ప్రభా : ఫర్వాలేదు చెప్పు!

భాస్క : అబ్బే ఏం లేదు.

ప్రభా : చూడండి, ఇతను నా స్నేహితుడు భాస్కర్. IV. బి. ఏ. — వీరు కుమారి ఉషాదేవి. [భాస్కర్, ఉష నమస్తేఅంటే నమస్తే అనుకుంటారు.]

ఉష: (భాస్కర్‌ని ఉద్దేశించి) ఇంకా నిలబడే వున్నారు. కూచోండి!

భాస్క : ఫర్వాలేదులెండి. (కూర్చుంటాడు)

ప్రభా : ఈమె యీ గృహ యజమానిగారి కుమార్తె!

భాస్క : అల్లాగా!

ప్రభా : మా వాడు కథలూ గేయాలూ వ్రాస్తూంటాడు లెండి. పత్రికల్లో మాత్రంపడవు.

ఉష : మంచిదే!

ప్రభా : మా భాస్కర్ బుఱ్ఱ మంచి పదునైంది లెండి! క్లాసులో ఫస్టుమార్కులన్నీ వాడివే! ప్రత్యేకం తెలుసులో.

భాస్క : వాడి మాటలకేం లెండి.

ప్రభా : (జేబులు తడుముకుంటూ) అరె సిగరెట్లు మర్చిపోయా రూమ్‌లో. ఇప్పుడే వస్తా!

[ప్రభాకర్ వెళ్తాడు. కొద్ది క్షణాలు నిశ్శబ్దం ఇద్దరూ ఎవరిలోకంలో వాళ్లుంటారు. భాస్కర్ తలవంచుకుని వుంటాడు. సూటిగా ఆమెవైపన్నా చూడడు. ఏదో బెరుగ్గావుంటాడు. ముందుగా ఉష మొదలు పెడుతుంది.]

ఉష: మీకిక్కడ అన్ని సదుపాయాలూ సరిగా వున్నాయా?

భాస్క : ఓఁ!

ఉష : మీరు బి. ఎ. ఫైనల్ ఇయరా?

భాస్క : అవును...మీరేమన్నా చదువుతున్నారా?

ఉష : ఫిఫ్త్‌ఫారం పాసయేను.

భాస్క : అలాగా! (రేడియో చూసి) మీకు సంగీతం వొచ్చా?

ఉష : కొద్దిగావచ్చు!...ఫిడేలు వాయిస్తాను.

భాస్క : అలాగా!...మీరు తరుచు సినీమాలు చూడ రనుకుంటాను.

ఉష : లేదండి. మా వూరు మంచి సినిమాలు రానే రావు...మీరూ...పాడగలరా!

భాస్క : పాట!...అబ్బే! నాకు రాదండి!

ఉష : తెలుగు సినీమానటుల్లో మీ అభిమాన నటీనటు లెవరో తెలుసుకోవచ్చా?

భాస్క : దానికేం? స్త్రీలలో భానుమతి, పురుషు లలో నాగేశ్వరరావు.

[కొద్ది క్షణాలు నిశ్శబ్దం. భాస్కర్‌కు గందర గోళంగా వుంటుంది. ఆవిడముఖం చూడకుండా తప్పుకోనడానికి ప్రకృతి దృశ్యాలు చూస్తూ వుంటాడు.]

ఉష : ఆ దృశ్యం చూసేరా! (ఒక దృశ్యం చూపు తుంది.)

భాస్క : (చూసి) చాలాబాగుంది! పల్లెసీమల్ని, వారి ఆచారాలనూ, పల్లెవాతావరణం చూపే దృశ్యా లంటే నాకెంతో యిష్టం!

ఉష : అది నేను వేసిందే!

భాస్క : ఆహాఁ! అలాగా! అంటే మీకు చిత్రకళలో కూడా ప్రవేశముందన్నమాట!

ఉష : ఏదో కొద్దిగా!

[మళ్ళీ నిశ్శబ్దం! భాస్కర్‌కి మరింత గందర గోళంగా వుంటుంది. ఆమెనెలాగైనా వొది లించుకోవాలని అనుకుంటాడు.]

భాస్క : ఆఁ! కొంచెం మంచినీళ్లు తెప్పిస్తారా! శ్రమ అనుకోకపోతే.

ఉష : దానికేం! నేనే తెస్తాన్లెండి! [ఉష వెళ్తుంది.]

[భాస్కర్‌కి కొండంతబరువు దింపినట్టవుతుంది. ప్రభాకర్ వస్తాడు.]

భాస్క : ఒచ్చేవా! రక్షించేవ్!

ప్రభా : ఏం ఇప్పుడేమైంది నీకు?

భాస్క : ఏమైందా? ఆ అమ్మాయిదగ్గర నన్నొక్కణ్ణీ వదిలి నువ్వు పోయావుగదా! అదేంబాగుందిరా నీకు?

ప్రభా : ఏడ్చినట్టుంది. ఆ అమ్మాయి అంత 'ఫ్రీ' గా వుంటే నువ్వలా నంగిరిగా నీరు కారిపోతావేం! నీ నంగిరి చూసి ఆమె యేమనుకుంటుందో ఆలో చించావా?

భాస్క : ఏమనుకుంటే నాకేం! నేనుమాత్రం ఆమె ముఖమన్నా తిన్నగా చూడలేదు.

ప్రభా : ఉద్ధరించేవ్! చూస్తేయేం?...ఇంత పిరికివాడి వేంరా నువ్వు? రేపు పెళ్లయిన తరవాతకూడా యిలాగే సిగ్గుపడతావేమిటి?

భాస్క : ఒరే ఎప్పుడైనా నీకే అలాంటి పరిస్థితి తటస్థ పడితే తెలుస్తుందిరా! ఆడవాళ్ళతో మాట్లాడా లంటే ఎంత చికాగ్గా వుంటుందో తెలుసా? అందులోనూ ఒంటరిగా చదువు కున్న స్త్రీతో...

ప్రభా : ఆఁ! ఆఁ! బాగుంది! రేపు ఆ అమ్మాయే నువ్వు చూడవలసిన పిల్ల అనుకో. అప్పుడూ యిలాగే సిగుపడి చూడ్డం మానేస్తావా?

భాస్క : అది రేపటి విషయంకదా! ఆ తరవాత ఆలోచించవచ్చులే!

ప్రభా : ఒరే! నామాట విని ఈసారైనా ఆ అమ్మా యితో సరిగా మాట్లాడరా బాబూ!

భాస్క : అదిమాత్రం నాకు చేతగాదు సుమీ!

ప్రభా : నీకు కాబోయేభార్య ఎలాంటిదో తెలుసు కోవాలని లేదా నీకు?

భాస్క : అబ్బబ్బ! అవన్నీ నువ్వే తెల్సుకుందూ ఆ తర్వాత! నన్ను చంపకు!

ప్రభా : ఇది మరీబాగుంది......(చూసి) ఒరే! ఆ అమ్మాయి మళ్ళొవస్తోంది. ఈ సారైనా సరిగా మాట్లాడరా!

భాస్క : (గాభరాగా) ఒస్తోందీ! ... చచ్చా(నా బాబూ!...ఒరే నీకు పుణ్యముంటుంది! నన్ను పోనీరా! [ఎదురుగా వున్న ద్వారం వేపు పోతూవుంటాడు].

ప్రభా : ఒరే! ఆగరా! ఆగు!

భాస్క : నువ్వు వెయ్యిచెప్పు లక్ష చెప్పు! నేనవన్నీ అడగలేను. నువ్వే అడుగు! [భాస్కర్ వెళ్తాడు]

ప్రభా : హోరి నీసిగ్గు బంగారంగానూ! [మంచినీళ్ళ గ్లాసుతో ఉష వస్తుంది].

ఉష : (చూసి) ఏరీ ఈయన?

ప్రభా : ఎవరూ!...భాస్కరా?

ఉష : ఔను.

ప్రభా : ఒంట్లో ఏదో యిదిగా వుందని వెళ్ళిపోయాడు

ఉష : అరె! మంచినీళ్ళు కావాలన్నారే!

ప్రభా : మరేం బాధలేదులెండి. మాగదిలో వున్నాయి. అవసరమైతే తాగుతాడు.

ఉష : ఒంట్లో బాగాలేదా? ప్రయాణపు బడలిక

ప్రభా : ఆఁ! అంలాంటిదే ఏదో అయివుంటుంది లెండి...(తాపీగా) ఆఁ! చూడండి! మీ యిద్దరి సమావేశం విజయవంతంగా ముగిసిందని అనుకోవచ్చా?

ఉష : అంటే?

ప్రభా : మీరిద్దరూ ఆ సమావేశంలో ఒకరి హృదయా లొకరికి విశదపర్చుకున్నారా?

ఉష : అబ్బే! నాకంటే వారు తెలుసుగాని, వారికి నేనెవరో తెలీదుగా!

ప్రభా : అయితేనేం? మనిషి తత్వం కనిపెట్ట వచ్చుగా!

ఉష : అబ్బే! ఇంకా మేమిద్దరం...—

ప్రభా : నేనంతా వింటూనే వున్నాన్లెండి! చూడండి! ఆమాట్లాడిన కాస్సేపట్లోనూ మీరు వాడి స్వభావం ఎలాంటిదో కనిపెట్ట గలిగేరా?

ఉష : లేదు. అసలు నాకా వుద్దేశమే లేదు.

ప్రభా : చూడండి! నేను మీకోసంగతి చెబుతాను. ఏం అనుకోరుగదా!

ఉష : చెప్పండి.

ప్రభా : మా వాడిది అదోరకమైన ప్రకృతి. ఆడ వాళ్ళతో మాట్లాడ్డ మంటేనే చాలాసిగ్గు! అందులోనూ యిక్కడ మరీను. వాడు మీముఖ మైనా సరిగా చూడలేదుకదూ?

ఉష : ఔను. చూచినట్టు లేదు.

ప్రభా: మరి...మీకు వాడి భావాలూ ఆదర్శాలూ తెలుసుకోవాలని ఉందా?

ఉష : ఉంది. కాని వాటికేం తొందర?

ప్రభా: అదికాగు. మీ రిద్దరూ వధూవరులు. మీభావి జీవితం సౌఖ్యదాయకంగా వుండాలంటే యిద్దరి భావాలూ ఏకీభవించాలి. విరుద్ధ భావాలు గల భార్యా భర్తల సాంసారిక జీవితం ఎలా వుంటుందో మీకు చెప్పనక్కర్లేదు. ఏమంటారు?

ఉష : అవును.

ప్రభా: అదిగాక యిది జీవితాంతం వుండవలసిన అను బంధంగాని, ఒక రోజుతో తెగిపోవలసిన సం బంధంకాదు.

ఉష : నిజమే!

ప్రభా: అలాంటప్పుడు మీరు చేపట్టబోయేవ్యక్తి యొక్క భావాలూ, ఆదర్శాలూ, మన స్తత్వం తెల్సుకోవాలనుకోడం ధర్మం న్యాయం కూడాను. ఏమంటారు.

ఉష : నిజమే! మీరన్నట్టు యిది జీవితాంతం వుండాల్సిన అనుబంధం!

ప్రభా: అంచేత మీరు వాడి స్వరూప స్వభావాలు తెలుసుకోవాలనుకోడం లేదూ?

ఉష : ఉంది. కాని ఎలా?

ప్రభా: నేనోక ఉపాయం చెప్తాను. అలా చేస్తారా?

ఉష : ఓఁ! అలాగే చేస్తాను. చెప్పండి!

ప్రభా: మీరు వాడి మన స్తత్వం తెలుసుకోవాలను కున్నా వాడితో 'ఫ్రీ'గా మాట్లాడాలనుకున్నా ఇలా వెళ్తే లాభంలేదు. మీరు వేషం కాస్త మార్చాలి.

ఉష : అంటే?

ప్రభా: అంటే మీరు కాసేపు కాంతారావుగారి కూతురి నన్నమాట మర్చిపోవాలి.

ఉష : మీరు చెబుతున్నది నాకేం అర్థం కావడంలేదు.

ప్రభా: మరేం లేదు. మీరు కొంచెం సేపు ఉషాదేవిగా కాక ఉషాదేవి పనిమనిషిగా మారిపోవాలి. అలా మారి ఏదో మిషమీద మా వాడి దగ్గరికి రండి అప్పుడు మీరు ఫ్రీగా మాట్లాడొచ్చు. నేను చెప్పింది అర్థమైందనుకుంటాను.

ఉష : అయింది. అంటే నేనిప్పుడొక పని మనిషిగా మారాలన్నమాట!

ప్రభా: ఆ కొద్దిసేపే! "జస్ట్ ఫర్ ఫైవ్ మినిట్స్"— అదయినా కేవలం అభినయమే—

ఉష : దానికేం లెండి. అలాగే చేస్తాను.

ప్రభా: అయితే మరి మీరు త్వరగా మీ వేషం మార్చుకురావాలి...ఆ! మీ నౌకరు పేరేమిటి?

ఉష : రాము. ఏం?

ప్రభా: ఆఁ! ఏంలేదు. మీరు వెళ్ళండి.
[ఉష లోపలికి వెళ్తుంది. ప్రభాకర్ పచార్లు చేస్తూ రాముని పిలుస్తాడు. రాము వస్తాడు.]

రాము: పిల్చేరా బాబూ!

ప్రభా: ఆఁ!...ఏం చేస్తున్నారాయన?

రాము: ఎవరూ? ... ఇంతాక మీ కూడా వచ్చినాయనా?

ప్రభా: అవును.

రాము: ఏదో చదువుకుంటున్నారండి.

ప్రభా: ఓ సారి నేనిలా రమ్మన్నానని చెప్పు!

రాము: అలాగేనండి. [రాము లోనికి వెళ్తాడు. వీధి లోనుంచి కృష్ణారావు వస్తాడు.]

కృష్ణా : హల్లో! ఏమిటిలా ఒంటరిగా కూర్చున్నారు?

ప్రభా : ఏముంది? ఏంలేదు.

కృష్ణా : ఏదో దీర్ఘాలోచనలో వున్నట్టున్నారు?

ప్రభా : ఎవరూ? నేనా? లేదే!

కృష్ణా : మీరు చాలా తేలిగ్గా అబద్ధాలాడతారే!

ప్రభా అదిమీకు బాగా అలవాటు కాబోలు!

కృష్ణా : అదిసరే! మీ కిక్కడ అన్నీ సరిగా వున్నాయా? ఏమైనా లోటుపాట్లున్నాయా?

ప్రభా : లేదండి! క్షేమంగావుందిక్కడి వసతి!

కృష్ణా : ఏదో చేతనైనంతవరకూ సదుపాయాలుచేస్తాం! ఆపైన లోటుపాట్లుంటే కాస్త సర్దుకుపోవాలి!

ప్రభా : అమ్మమ్మ! ఎంతమాట! ఈమాత్రం వసతైనా దొరికింది మాధర్మాన!

కృష్ణా : నాదేముంది?...వస్తాను (లేస్తాడు.)

ప్రభా : మళ్ళా యెక్కడికి?

కృష్ణా : అలావెళ్ళి సిగరెట్లు తెచ్చుకుందామని.

ప్రభా : నౌకర్ని పంపకూడదా?

కృష్ణా : ఎందుకండీ యీమాత్రం దానికి? "డిగ్నిటీ ఆఫ్ లేబర్!" దీన్లో తప్పేంవుంది?

ప్రభా : బాగాచెప్పారు. ఆచేత్తోనే మాకూ ఒక పేకెట్ 'బెర్కిలీ' తెచ్చి పెడతారా?

కృష్ణా : అలాగే! అసలు మీకిక్కడ అన్నీ సరిగా వున్నాయో లేవో చూసిపోదామనే వచ్చేను. మరొస్తాను!

ప్రభా : మళ్లా పునర్దర్శనం?

కృష్ణా : మరొక అరగంటలో! గంటలోనో వస్తాను.
[వీధిలోకి వెళ్తాడు.]

ప్రభా : "పూర్ ఫెలో!" ఇంకా మనసంగతి తెలీదు పాపం! హుఁ! [ఎదురుగా వున్న ద్వారం లోనుంచి మెల్లగా భాస్కర్ వస్తాడు.]

భాస్క : (ఉష వుందేమోనని చుట్టూ చూసి) ఏరా ప్రభాకర్? పిల్చేవట?

ప్రభా : అవును.

భాస్క : ఏమిటంత కొంపమునిగి పోయినంతపని?

ప్రభా : కొంప మునిగిపోయినంత పని అని మెల్లిగా అంటావేమిటిరా! నీనుండి వ్యవహారమంతా చెడిపోయింది!

భాస్క : ఏమిట్రాఅది? నాకేం అర్థంకావడం లేదు.

ప్రభా : ఔను. నీకెలా అర్థమౌతుంది? ఆ అమ్మాయి ముందు అలా మన్నుతిన్న పాములా వుండక పోతే కాస్త డాబుగా వుండరాదూ?

భాస్క : ఏం? అయితే యిప్పుడేమైంది?

ప్రభా : ఏం కావాలింకా! ఆమె నిన్నొక చవటకింద కట్టి పారేసింది.

భాస్క : ఆఁ!

ప్రభా : నువ్వి యిరవయ్యో శతాబ్దంలో వుండవలసిన వాడివి కావట!

భాస్క : ఆఁ! మరి?

ప్రభా : నిన్ను చూస్తే రాతి యుగపు మనుషులు జ్ఞాపకం వస్తారుట?

భాస్క : ఆఁ! అంతమాట అన్నదిరా?

ప్రభా: పైగా స్త్రీలను గురించి ఆయనకు సద్భావాలున్నట్లులేదు అంది.

భాస్క: ఉహూఁ! ఇంకా?

ప్రభా: ఇంకేం వుంది? ఇంకా చాలా చాలా అందిలే!

భాస్క: అవన్నీ వింటూ నోరూమ్మాసుకొని ఊరుకున్నావ్ నువ్వు?

ప్రభా: మరేం చెయ్యడం? వాదించినా లాభం లేకపోయింది.

భాస్క: అరెరే!

ప్రభా: ఒరే బ్రదర్! నా మాటవిని ఇకముందైనా ఆడ వాళ్లంటే సిగ్గుపడకురా!

భాస్క: అలాగేలే!

ప్రభా: అసలు వాళ్లని చూస్తే నీ కెందుకురా ఆ భయం?

భాస్క: ఎందుకో నువ్వే ఆ పరిస్థితుల్లో వుంటే నీకే తెలిసేది.

ప్రభా: బాగుంది!

భాస్క: అది సరేగాని...ఒరే ప్రభాకర్!...అంత మాట అన్నదిరా ఆ అమ్మాయి?

ప్రభా: అహఁ! లేదు. నేనే కల్పించాను.

భాస్క: అబ్బే నేనలా అన్నానుట్రా!...ఆమె కంత ధైర్యం ఎలా వచ్చిందా అని?

ప్రభా: లేకపోతే అంతా నీలాగే నంగిరిగా నీరుకారి పోతారనుకున్నావా?

భాస్క: (ఆలోచిస్తూ) ఒరే బ్రదర్!

ప్రభా: ఏం?

భాస్క: ఆ అమ్మాయికి మన తడాఖా చూపించాలిరా!

ప్రభా: తడాఖా చూపించాలా?

భాస్క: అహాఁ! తప్పకుండా.

ప్రభా: ఎలాగంటావ్?

భాస్క: అదే మరి నువ్వాలోచించాలి.

ప్రభా: (ఆలోచిస్తూ) నే నొకటి చెప్తాను. అలా చెయ్యి!

భాస్క: (ఆత్రంగా) ఏమిటది?

ప్రభా: ఆ అమ్మాయి స్వభావం ఎలాంటిదో కనిపెట్టు ముందు. ఆ తర్వాత చెప్తాను.

భాస్క: ఎలా?

ప్రభా: ఏముంది? ఏ నౌకర్నో, దాసీపిల్లనో అడిగితే తెలిసిపోతుంది.

భాస్క: అయితే వాణ్ణి పిల్చి కనుక్కుందామా? (పిలవబోతాడు).

ప్రభా: (ఆపి) ఆగాగు! ఇలాంటివి దాసీపిల్లలకి, ఆడ వాళ్లకి తెలుస్తాయి బాగా! ఏమంటావ్?

భాస్క: అవును. నిజమే! అదెలా కుదురుతుంది మరి?

ప్రభా: ఎలాగేమిట్రోయ్! మనం తల్చుకుంటే అన్నీ వాటంతట అవే అయిపోతాయి...కాని నువ్వు మాత్రం కాస్త జాగ్రత్తగా వ్యవహరించాలి.

భాస్క: చూస్తావుగా! ఇందాకంటే ఏదో అయి పోయిందిగాని ఇహ చూసుకోవోయ్ మన ప్రతాపం!

ప్రభా: నాకు నమ్మకంలేదు సుమా!

భాస్క: ఒరే బ్రదర్! అన్ని నాటకాల్లో వేషం వేసేను గదా! ఈ మాత్రం నటన చెయ్యలేనురా! నువ్వలా చూస్తూవుండు ఎలా 'టేకిల్' (tackle) చేస్తానో? పోనీ రిహార్సల్ చూపించ మంటావా?

ప్రభా: ఒద్దులే వొద్దు!

భాస్క: ఇహ చూడవోయ్ మన తడాఖా! ఏమను కుంటారో ఆ అమ్మాయి మనమంటే! హుఁ!

ప్రభా: రైట్! విష్ యూ గుడ్ లక్!

భాస్క: థేంక్ యూ!

[పని మనిషి వేషంలో మంచినీళ్ల గ్లాసుతో ఉష వస్తుంది.]

ఉష: మంచినీళ్లు కావాలన్నారట బాబూ!

భాస్క: ఆఁ...

ప్రభా: ఇలాతే! (త్రాగి) ఒరే! బ్రదర్! అలా వెళ్లి శ్వేతకాష్ఠాలు తెచ్చుకుంటాను. నువ్విక్కడే వుండు [అని భాస్కర్ భుజం తడతాడు.]

భాస్క: అలాగేలే వెళ్లిరా!

[ప్రభాకర్ వీధిలోకి వెళ్తాడు.]

ఉష: [ఖాళీగ్లాసు తీసుకొని వెళ్ళిపోబోతుంది.]

భాస్క: ఆఁ! అమ్మాయ్!

ఉష: (ఆగి) ఏంబాబూ!

భాస్క: నీ పేరేమిటన్నావ్?

ఉష: నా పేరాండి...రాధ!

భాస్క: రాధ! చాలా మంచిపేరు!...నువ్విక్కడ పనిమనిషివా?

ఉష: ఔనండి!

భాస్క: జీతం ఎంతిస్తారు నీకు?

ఉష: జీతం యివ్వరు కాని...

భాస్క: కాని?

ఉష: కడుపునిండా తిండిపెట్టి, బట్టలూ అవీ నాకు కావలసినవన్నీ యిస్తారండి.

భాస్క: అహాఁ! నీకు తల్లీ తండ్రీ వున్నారా?

ఉష: తల్లిలేదండి తండ్రిమాత్రం వున్నాడు.

భాస్క: అతనేం చేస్తూ వుంటాడు?

ఉష: ఏంలేదండి!...ఇక్కడే వుంటాడు.

భాస్క: అంటే అతను కూడా యిక్కడే వుద్యోగం చేస్తున్నాడన్నమాట!

ఉష: ఉద్యోగం కాదు గాని...అలాంటిదేనండి!

భాస్క: నీ మాటలతీరు చూస్తే నువ్వు దాసీపిల్లలా కనిపించవే? నువ్వేమైనా...

ఉష: నాకు కొంచెం చదువొచ్చండి.

భాస్క: అహాఁ! నీకు చదువొచ్చు నన్నమాట! ఏం చదివేవ్?

ఉష : ఫోర్తుఫారం పాసయేనండి!

భాస్క : అబ్బా! అంతవరకూ చదివేవా! మరి యీ దాసీ పనిచేస్తున్నావేం కర్మ?

ఉష : మరేం చెయ్యడం?

భాస్క : ఏదైనా వుద్యోగం చెయ్యాల్సింది.

ఉష : నే నిప్పుడు చేస్తున్నది వుద్యోగమేగా!

భాస్క : బాగుంది! ఈ దాసీ పని ఉద్యోగమా?

ఉష : కాదా! ఉద్యోగమన్నా ఒకరు చెప్పినట్టు చెయ్యాల్సిందేగా! అయినా నే నిప్పుడు దాసీనిగా నే!

భాస్క : మరి నువ్విప్పుడు చేస్తూన్న పనేమిటి?

ఉష : మంచినీళ్ళు యిమ్మన్నాగు ఇచ్చాను. అంతే!

భాస్క : అది దాసీ పని కాదా?

ఉష : కాదండి! అలాగంటే మా అమ్మాయిగారగ్గయిపోతారండి.

భాస్క : అలాగా!

ఉష: ఔనండి! అసలా మాటకొస్తే అమ్మాయిగారికి నేనంటే ప్రాణమేనండి!

భాస్క : అల్లాగా!

ఉష: ఔనండి!

[అనుకోకుండా ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటారు. ఇద్దరూ తపబడతారు. ఆ తత్తరపాటుతో ఉష చేతిలోని గ్లాసు క్రిందపడుతుంది ]

భాస్క : అరె! క్రిందపడిందే!

ఉష : ఫరవాలేదులెండి!

[గ్లాసు తియ్యాలని ఇద్దరూ ఒకే సారి వంగుతారు. మళ్ళీ అనుకోకుండా ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటారు. భాస్కర్ గ్లాసు తీసి ఉషకిస్తాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం]

భాస్క : (తేరుకుని మెల్లగా) నువ్వు సినీమాలు చూస్తావా?

ఉష : మా అమ్మాయిగారూ నేనూ వెళ్తామండి!

భాస్క : నువ్వెప్పుడైనా మల్లీశ్వరి చూసేవా?

ఉష : మా నాన్నగారితో వెళ్ళేను.

భాస్క : ఎవరు?

ఉష : (సర్దుకొని) అదేనండి! మా అయ్యగారితోనండి

భాస్క : అలాగా! పువ్వులంటే నీకు...

ఉష : చాలా యిష్టం!

భాస్క : (రాధాకృష్ణుల చిత్రం చూపి) ఆచిత్రం చూసేనా?

ఉష : రాధాకృష్ణులు! అదంటే నాకెంతో యిష్టం!

భాస్క : అల్లాగా! కలకాలం ఆరాధలా కాలంగడపాలని కోరిక గావుందా?

ఉష : అంటే?

భాస్క : (ఏదో ఆవేశం వొచ్చిమాట్లాడలేకపోతాడు) ...రాధా!...

ఉష : (చూసి) ఆఁ! ఏమిటి?...ఎంగుకలా చూస్తారు

భాస్క : (తేరుకొని) ఏం లేదు...నువ్విష్టపడితే కలకాలం ఆచిత్రంలోని దివ్య మూర్తులవలె ధన్యజీవుల మౌదామని వుంది.

ఉష : అంటే మీరూ......

భాస్క : నిన్ను ప్రేమిస్తున్నాను రాధా!

ఉష : ప్రేమించడమే!

భాస్క : అవును రాధా! నిన్ను నేను ప్రేమిస్తున్నాను

ఉష : ఆఁ!...ఇంకేమన్నా వుందా!

భాస్క : ఏం? ప్రేమించకూడదా? ప్రేమకి అంతరాలు అడ్డురావు రాధా! నేను మొట్టమొదటసారిగా నిన్నే చూసేను. ప్రేమించాను. అంతే! పెళ్లి చేసుకుంటాను!

ఉష : పెళ్ళిచేసుకోడమే!

భాస్క : ఔను రాధా! పెళ్ళిచేసుకుంటాను. నీకేమైనా ఆటంకం వుందా?

ఉష : కాని మా నాన్న యిష్టపడొద్దా? పెద్దల యిష్టాయిష్టాలెలా వుంటాయో? వాళ్ళ అంగీకారం లేకుండా మనం పెళ్లాడ్డం బాగుంటుందా? వాళ్లేమంటారో?

భాస్క : ఏమంటారు? అయినా యిది మనిద్దరికే సంబంధించినది. ఇందులో వాళ్ళ యిష్టాయిష్టాలకు తావేది? మనసులు కలిసిన తరువాత ఎన్ని అటంకాలొచ్చినా అభీష్టాన్ని నెరవేర్చుకోవలసిందే!

ఉష: మరి...మీ నాన్నగారు ఇష్టపడతారా ?

భాస్క : తప్పకుండా ఒప్పుకుంటారు. మనసులేని మనువు చేసుకుని జీవితం నరకంగా చేసుకోమని ఆయన చెప్పరు. నా యిష్టమే ఆయనయిష్టం!

ఉష: మరి...............

భాస్క : నువ్వేమీ అనుమానించవద్దు! ఇవన్నీ హృదయపూర్వకంగా చెబుతున్న మాటలుగాని బూటకాలు కావు! నన్ను నమ్ము. ఏమంటావ్ రాధా! ...నీ కిష్టమేనా ?

ఉష: [ కాసేపు అతని ముఖంలోకి చూసి చరచర లోనికి వెళ్తుంది].

భాస్క: రాధా! రాధా! [ఆమెవెనుక వెళ్తూవుంటాడు. ఇంతలో బయటినుండి చప్పట్లుకొడుతూ ప్రభాకర్ వస్తాడు].

ప్రభా: ఎక్సలెంట్! అద్భుతం! ఏమి నటనరా!

భాస్క: నటన! నటనేమిటిరా?

ప్రభా: మరిప్పుడు చేసిందంతా యేమిట్రో! అద్భుతంగా మోస్ట్ నేచురల్‌గా వుందిరా నీనటన!

భాస్క: అది నటనకాదురా!

ప్రభా: మరి?

భాస్క: అదంతా నిజమే! నేనా అమ్మాయిని ప్రేమించాను.

ప్రభా: ప్రేమ! ఆఁ! [ఏమీ తెలియనట్టు మొహం పెడతాడు.]

భాస్క: ఔను. ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాను.

ప్రభా: బాగుందిరా అబ్బీ! బాగుంది! ప్రథమ వీక్షణంలోనే ప్రేమాంకురాలు మొలిచిన మీ ప్రేమ కలకాలం వర్ధిల్లుగాక!...కాని ఈ సంగతి మీ నాన్నకి తెలిస్తే యేమౌతుందో తెలుసా?

భాస్క: తెలిస్తే యేం?

ప్రభా: ఏంలేదు. తాళాద్యాయాలు! వీపు విమానం మోత! నీక్కాదు. ముందు నాకు!

భాస్క: నీ కెందుకు మధ్య?

ప్రభా: ఎందుకా! నువ్వా పిల్లని ప్రేమిస్తూంటే చూస్తూ వూరుకున్నందుకు.

భాస్క: ఊరుకోక?

ప్రభా: అదికాదురా! మనం యీవూ రెందుకొచ్చాం?

భాస్క: పెళ్ళి చూపులకి. అయితే?

ప్రభా: ఔనా! మరి మనం చూడవలసిన పిల్లని చూడకుండా మరో దాసీపిల్లని...

భాస్క: ఇదిగో! ఆ అమ్మాయి దాసీపిల్ల కాదు.

ప్రభా: పోనీ దాసీ కాదనుకో! ఆ వేషంలోవున్న అమ్మాయిని పెళ్ళాడ్డం ఏం బావుంది? మీ నాన్న ఒప్పుకుంటాడా?

భాస్క: మా నాన్న ఒప్పుకోకపోయినా సరే! నేనా అమ్మాయి నే పెళ్ళిచేసుకుంటాను.

ప్రభా: అయితే ఎన్ని ఆటంకాలొచ్చినా సినీమాలో హీరోలాగ నువ్వా అమ్మాయినే పెళ్ళి చేసుకుంటా నంటావ్!

భాస్క: ఒరే ప్రభాకర్!

ప్రభా: ఏం?

భాస్క: నిజంగా నీకు నామీద స్నేహవాత్సల్యముందా?

ప్రభా: ఇప్పుడా అనుమానం ఎందుకొచ్చింది?

భాస్క: ఉంటే ఈ ఆటంకాలేవీ చెప్పకుండా నాకూ ఆ అమ్మాయికీ......

ప్రభా: పెళ్లియే యేర్పాటు చెయ్యమంటావ్! అంతేనా?

భాస్క: అంతే!

ప్రభా: మరి మీనాన్న?

భాస్క: అదంతా ఆతర్వాత చూద్దాం! ఆయన్ను ఒప్పించేపూచీ నాది!

ప్రభా: ఆల్‌రైట్! అలాగే చేసాన్లే!

భాస్క: నీమేలు ఈజన్మలో మరిచిపోలేనురా!

ప్రభా: (వారిస్తూ) ఆఁఆఁ! అవన్నీ ఇప్పుడెందుకు గాని, ముందు నువ్వుపోయి కాస్త విశ్రాంతి తీసుకో! ఇప్పటికే చాలా అలసిపోయావ్!

భాస్క: మర్చిపోవద్దుసుమా!

ప్రభా: ముందు నువ్వెళ్ళవోయ్!

[భాస్కర్ గదిలోకి వెళ్తాడు. అంతవరకూ పొంచివున్న ఉష వస్తుంది]

ప్రభా: ఓఁ! రండి రండి. మీకోసమే చూస్తున్నాను.

ఉష: ఏమంటాడు మీ మిత్రరత్నం?

ప్రభా: ఏమంటాడో మీకు తెలీదా?

ఉష: నాకేం తెలుస్తుంది? ఆప్తమిత్రులు మీకు తెలియాలిగాని!

ప్రభా: భేష్! సరిపోయారు ఇద్దరికిద్దరూను!...చాలా సహజంగా జరిగింది సన్నివేశంమాత్రం!... ఏమంటారు?

ఉష: (సిగ్గుతో) ఏమనమంటారు?

ప్రభా: అదీ నేనే చెప్పాలా? బాగుంది!

ఉష: (మెల్లగా) ఇన్ని మాటలు చెప్పారు. అదీ మీరే చెప్పండి. అక్కడికి పూర్తవుతుంది కథ!

ప్రభా: (నిదానంగా) ఐతే మీ వుద్దేశం నావుద్దేశం ఒకటే అన్నమాట! అంగీకారమేనా?

ఉష: (సిగ్గుతో తల వాలుస్తుంది)

ప్రభా! చాలా సంతోషమమ్మా! ఇవాళ నా సొంత చెల్లికి సంబంధం నిశ్చయమైనంత హాయిగావుంది నాకు.

ఉష: అలాగా! మా సొంత అన్నయ్యకంటే మీరే నయమేమో!

ప్రభా: అలా అనొద్దు! అతను నిజంగా మహానుభావుడు! అతనివల్లే మనకింత సన్నిహిత సంబంధం కుదిరింది!...ఆఁ! మరి నే నీశుభవార్త వాడి చెవినివేసి వస్తాను.

ఉష: అలాగే!

ప్రభా : ఇప్పుడే వస్తాను. [ప్రభాకర్ లోనికివెళ్తాడు. ఉష అక్కడున్న పేపర్లూ అవీ సర్దుతూ వుంటుంది. వీధిలోనుంచి సీతారామయ్య, కాంతారావు ప్రవేశం]

కాంత : రావోయ్! రా!...అమ్మాయ్! నీ కాబోయే మామగారు! నమస్కారం చెయ్యమ్మా! (ఉష నమస్కారం పెడుతుంది)

సీతా : శీఘ్రమేవ కళ్యాణప్రాప్తిరస్తు!

కాంత : అయితే వాళ్ళని నేరుగా ఇక్కడికే రమ్మని వ్రాశావన్నమాట!

సీతా : అవునోయ్! మళ్ళీ అక్కణ్ణుంచి ఇంటికీ, ఇంటి నుండి యిక్కడికీ తిరగడం యెందుకని నేరుగా యిక్కడికే రమ్మని వ్రాసేను.

కాంత : ఏరీమరీ! ఒచ్చినట్టు లేదే! అమ్మాయ్! మంచి నీళ్ళుపట్రా తల్లీ!

[ఉష లోనికి వెళ్తుంది.]

సీతా : వస్తాడులే!...ఏమో యీపాటికేవచ్చి ఏదేనా హోటల్లో దిగేడేమో.

కాంత : అబ్బే! ఈవూళ్ళో అంతపాటి హోటళ్ళెక్కడ?

సీతా : ఐతే సాయంత్రం బస్సులో వస్తాడులే! ఫైనల్ ఇయరామరి! ట్రిమ్ వేషం చేస్తే యెలా చెప్ప

కాంత : అవును నిజమేమరి...ఆఁ! ఒక వస్తాడా?

సీతా : అహాఁ! వాళ్ళ రూమ్ మేటు ప్రభాకర్ అని ఒక కుర్రాడున్నాడు వాళ్ళిద్దరూ కలిసివస్తారు. వ్రాసేడే!

కాంత దీనికి సెలక్షన్ కమిటీ కూడానా!

సీతా : నవయువకులు కదటోయ్!

కాంత : బాగా చెప్పావ్!

[ప్రభాకర్ ప్రవేశం]

సీతా : (చూసి) ఏమోయ్ ప్రభాకర్ ఎప్పుడొచ్చారు మావాడేడీ?

కాంత : (ఆశ్చర్యంగా) ఏమిటీ! ఈయనే నేమిటి...

సీతా : మావాడి రూమ్ మేటులే!

కాంత : ఐతే ఆరెండోవాడు మీ అబ్బాయన్న మాట!

ప్రభా : అవునండి.

కాంత : బాగుంది. మరి చెప్పావు కావేమయ్యా!

ప్రభా : అవకాశం చిక్కనిస్తేనా?

సీతా : ఎంతసేపైంది మీరొచ్చి?

ప్రభా : మధ్యాహ్నమే వచ్చామండి.

[ఉష మంచినీళ్ళు తెస్తుంది.]

ఉష : ఇవిగోనాన్నా మంచినీళ్ళు!

[ఇస్తుంది. కాంతారావు త్రాగుతాడు.]

సీతా : మా భాస్కరేడీ?

ప్రభా : తీసుకొస్తానుండండి! (లోనికి వెళ్తాడు.)

కాంత : (గ్లాసు ఉషకిచ్చి) వీళ్ళిద్దరేఅన్నమాట! కొత్తగావచ్చేమని, హోటల్ కోసం వెదుకుతూ వుంటే మాఅబ్బాయి తీసుకొచ్చాడు.

సీతా : అలాగా!

కాంత : పేర్లయినా తెల్సుకున్నాడు కాదు. వాడో దద్దమ్మ!

సీతా : పోనీ యిప్పుడేం మునిగింది?

కాంత : అహఁ! అదికాదు...(ఉషనిచూచి) యేమమ్మా! ఆయిద్దరబ్బాయిల్నీ చూసేవా.

ఉష : ఆఁ.

కాంత : ఇప్పుడువెళ్ళినాయనకాక ఆరెండోఅతనే వీరి అబ్బాయి. చూసేవా?

ఉష : (మెల్లగా) ఆఁ! ఇప్పుడే మాట్లాడేను కూడా!

కాంత : మరేమంటావ్?

ఉష : (సిగ్గుతో) ఏముందీ...(అర్థోక్తిలోనే ఆగి పోతుంది.)

సీతా : చూసేవా! అప్పుడే చూడ్డం, మాట్లాడ్డంకూడా అయిపోయింది!

కాంత : ఆఁ—ఇంక మీవాడు "ఊఁ" అనడమే తరవాయి.

[గ్లాసు తీసుకొని ఉష వెళ్ళిపోతుంది.]

సీతా : ఆ! నచ్చకేంజేస్తుంది? ఇంతకంటే రంభ దొరుకుతుందేమిటి వాడికి?

కాంత : ఏదో ఆ మూడుముళ్ళూ పడితే నీధర్మాన్న!

సీతా : చూడు కాంతం! అలాంటి మాటలంటేనే నాకు చిరాకు!

[భాస్కర్, ప్రభాకర్ వస్తారు]

సీతా : రారా అబ్బాయ్! రా!

భాస్క : ఎంతసేపైంది మీరొచ్చి?

సీతా : ఇప్పుడే. (కాంతారావుని చూచి) వీరే నీ కాబోయే మామగారు.

భాస్క : (ఆశ్చర్యంగా) ఎవరు? ఈయనా?

సీతా : అవును. ఈయనే కాంతారావుగారంటే!

కాంత : (భాస్కర్‌తో) ఏం బాబూ అలా చూస్తావ్! మొదటే ఫలానా అని చెబితే!

ప్రభా : చెబుదామనుకుంటూ వుండగానే మరి...

భాస్క : ఆయనెవరో నేచెప్తాలెండి అన్నాడు. అంచేత వూరుకున్నాం.

కాంతా : ఎవరు ?

ప్రభా : మమ్మల్నిక్కడికి తీసుకొచ్చినాయన.

కాంతా : వాడా ! మా అబ్బాయి ! వాడో మతిభ్రష్టు రామన్న ! వాడిసంగతి నీకు తెలీదూ రామం !

సీతా : తెలియకేం ?... ఆఁ ! ఏరా అబ్బాయ్ ! వీరి అమ్మాయిని చూసేవుట !

భాస్క : ఎవరమ్మాయిని ?

సీతా : వీరి అమ్మాయి ఉషని రా. ఆ పిల్ల "ఊఁ" అంది. ఇహా నువ్వే !

భాస్క : నేనా అమ్మాయిని చూడందే !

సీతా, కాంతా : చూసేవుట !

భాస్క : లేదే !

సీతా : అదేమిట్రా అలా గంటావ్ ? నువ్వూ ఆ అమ్మాయీ మాట్లాడుకున్నారుట కూడాను.

భాస్క : (ఆశ్చర్యంతో) ఎవరన్నారు ?

సీతా : ఆ అమ్మాయే చెప్పింది.

భాస్క : శుద్ధ అబద్ధం ! అసలు నేనా అమ్మాయిని చూడనే లేదు ! ఇంకెక్కడి మాట్లాడ్డం ?

కాంతా : (ఆశ్చర్యంగా) ఆఁ ! చూడనే లేదూ ?

భాస్క : లేదు.

కాంతా : మరి అమ్మాయి అలా చెప్పిందేమిటి ? నీతో మాట్లాడానంది కూడా !

భాస్క : బహుశా ఆమె కలగనివుండొచ్చు !

సీతా : ఓయ్ కాంతం ! నువ్వెళ్ళి అసలు సంగతేమిటో అమ్మాయిని అడిగిరా.

కాంతా : అలాగే వెళ్ళి అడిగివస్తానుండు. (కాంతా రావు లోనికివెళ్తాడు)

సీతా : ఏమోయ్ ప్రభాకర్ ! ఏంజరిగిం దసలు !

ప్రభా : ఏమోనండి.........ఆ అమ్మాయి ఇంకేం చెప్పిందండి ?

సీతా : నచ్చేడా అంటే...తల వూపింది.

ప్రభా : అయితే మరేం ! ముహూర్తం పెట్టించండి !

భాస్క : ఒరే ! నీకేం మతిపోతున్నదా ? నేనాఅమ్మాయిని పెళ్ళాడను.

సీతా : ఏం ? ఎందుకు ?

భాస్క : మనసు లేని పెళ్ళిచేసుకొని జీవితం నరకంగా చేసుకోలేను.

సీతా : పోనీ ఆ అమ్మాయిని చూడు. నచ్చకపోతే మానెయ్ !

భాస్క : ఎలాగో నచ్చదు. ఆమాత్రం దానికి చూడ్డమెందుకు ?

సీతా : (విసుగ్గా) ఎందుకు నచ్చదోయ్ ?

భాస్క : ఇంతకుముందు నేనొక అమ్మాయిని ప్రేమించేను.

సీతా : ఆమాట ముందే చెప్పకపోయావా ! మరి వీళ్ళకి మాటయిచ్చావే ?

భాస్క : అదికూడా యిక్కడేజరిగింది !

సీతా : ఏమిటోయ్ ప్రభాకర్ ! నీకేమైనా తెలుసా ?

ప్రభా : (తడబడుతూ) నాకెలా తెలుస్తుందండి !

భాస్క : వాడికంతా తెలుసు ! చెప్పరా.

ప్రభా : ఎమిటి చెప్పడం, ఎలా చెప్పడం ?

భాస్క : అదే. నే నెవర్ని యేవిధంగా ప్రేమించేనో చెప్పరా !

ప్రభా : ఓఁ ! అదా ! చెపాను.

[లోనుండి కాంతారావు ప్రవేశం]

కాంతా : (వేగంగా) అమ్మాయి ఖచ్చితంగా చెబుతోంది భాస్కర్ తో మాట్లాడినట్టు.

భాస్క : (ఆశ్చర్యంతో) మీ అమ్మాయే చెప్పిందా ?

కాంతా : అవును.

భాస్క : తమాషాగావుందే ! ఏమని చెప్పింది ?

కాంతా : ఏమ నేమిటి ? నువ్వామెని ప్రేమించానని చెప్పావుట ! నేనిష్టపడితే పెళ్ళాడతానన్నావట కూడాను !

సీతా : ఏరా ! నిజమేనా !

భాస్క : నేను ప్రేమించానన్నదీ వీరి అమ్మాయిని మాత్రం కాదు. మరొక స్త్రీ.

సీతా : (విసుగ్గా) అదే ఎవరోయ్ ?

కాంతా : బాబూ ! ఈముసుగులో గుద్దులాట ఎందుకు? ఏంజరిగిందో వివరంగా చెప్పేయ్ !

భాస్క : నేను ప్రేమించానన్నదీ పెళ్ళిచేసుకుంటానన్నదీ వీరి అమ్మాయిని కాదు. ఆమె ఒకదాసీ పిల్ల. ఈయింట్లోనే పనిచేస్తోంది !

కాంతా : (ఆశ్చర్యంగా) ఏమిటే ! మాయింట్లో[illegible]. దాః

భాస్క : అవును. కావాలంటే ప్రభాకర్ ని అడగండి.

కాంతా : మాయింట్లో ఆడవాళ్లెవరూ పనిమనుషులుగా లేరే ! ఇదెలా...

ప్రభా : మీరుండండి. ఒరే బ్రదర్ ! నామాటవిని నువ్వు ప్రేమించి పెళ్ళిచేసుకుంటానన్న పిల్లని లోపలికెళ్ళి తీసుకురా !

సీతా : అవును. అదిబాగుంది. వెళ్ళరా ! వెళ్ళు.

[భాస్కర్ వెళ్తాడు].

కాంతా : ఏమిటీ యిదికలా ! యథార్థమా ?

సీతా : నీకు తెలుసంటాడేమిటోయ్ !

ప్రభా : అవును. నాకు తెలుసు.
సీతా : ఐతే వాడు ప్రేమించింది దాసీపిల్లేనా ?
ప్రభా : ఆహా ! అలాంటిదే.
కాంతా : అరె ? మాయింట్లో ఆడవాళ్లు పనిమనుషులుగా చేరయ్యా అంటూవుంటే. ఉన్నది వాడొక్కడే ఆ రాముగాడు !
ప్రభా : ఏం ? ఇవాళ కొత్తగా చేరకూడదా ?
కాంతా : నాకు తెలియకుండానా !
ప్రభా : అవును.
కాంతా : అబ్బే అసంభవం ! నాకు తెలియకుండా అటువంటి వేమీ జరగవీయింట్లో.
సీతా : మరి మీ అమ్మాయి అలా చెబుతుందేం ?
కాంతా : అదే ఆశ్చర్యం !
సీతా : ఏమోయ్ ! నీకు తెలిస్తే చెప్పరాదూ !
ప్రభా : చెబుతానుండండి ! అదొక పెద్దగాథ !
సీతా : (లోనికిచూసి) అదుగో మావాడూ, మీ అమ్మాయీ వస్తున్నారు !
ప్రభా : రైట్ ! పదండి మనం అలా ఆ వరండాలోకి పోయి మాట్లాడుకుందాము.
కాంతా : ఎందుకు ?
ప్రభా : ఎందుకో మీకే తెలుస్తుంది. పదండి ముందు ! అక్కడ నేనంతా చెప్తాను ! [కాంతారావు, సీతారామయ్య, ప్రభాకర్ వీధిలోకి వెళ్తారు. లోనుండి భాస్కర్, ఉష ప్రవేశం]
భాస్క : (చూసి) అరె ! ఏరీ వీళ్లు ?
ఉష : అసలు నన్నెందుకు తీసుకొచ్చారిక్కడికి ?
భాస్క : ఏముంది ? అది చెప్పడానికే !
ఉష : ఏది ?
భాస్క : అదే. నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాననీ, నేను చూసింది నిన్ను గాని ఆ కాంతారావుగారి అమ్మాయిని కాదని చెప్పడానికే !
ఉష : ఈమాట ముందే వారికి చెప్పలేదా ?
భాస్క : చెప్పేను. కాని వింటేనా ?
ఉష : వాళ్ళేమంటా రింతకీ ?
భాస్క : ఏమంటారు ? నువ్వు చూసింది మా అమ్మాయే ! అసలు మాయింట్లో దాసీపిల్లలే లేనప్పుడు నువ్వు చూడడం ఎలా సంభవం ? అంచాత మా అమ్మాయినే చూసివుంటావ్ అంటారు !
ఉష : అయితే ఇప్పుడు మీరేమంటారు ?
భాస్క : నిన్ను వాళ్లకిచూపించి, పెళ్ళిచేసుకుంటానని చెప్తాను. ముందే చెప్పానుగా నిన్ను నేను ప్రేమించాననీ, నిన్నుతప్ప మరెవ్వరినీ పెళ్ళాడననీ !
ఉష : అసలు మీరిక్కడకు వచ్చింది కాంతారావుగారమ్మాయిని చూడాలని కదా ?
భాస్క : ఔను. వారమ్మాయిని చూడాలనీ, నచ్చితే పెళ్ళిచేసుకోవాలనీ వచ్చేం. కాని నేనామెను చూసైనా చూడలేదుగా !
ఉష : ఒకవేళ నేనే వారమ్మాయినైతే ?
భాస్క : అదేమిటి ? అదెలాగ అవుతుంది ? నువ్వు రాధవి. అతని కూతురువి కాదే !......రాధా ! ఇలా మాటల్తో కాలం వ్యర్థంచెయ్యడం నాకిష్టంలేదు. మనం పెళ్ళిచేసుకోవాలి.
ఉష : ఎలా ?...... మీ నాన్నగారు ఇష్టపడతారో లేదో ?
భాస్క : ఆయన నాయిష్టప్రకారం చేస్తారు. ఆయన ఒప్పుకోకపోయినా యీ పెళ్ళి జరిగితీరవలసిందే ! అంతేగాని ప్రేమలేని పెళ్ళి చేసుకోను !
ఉష : ఐతే మనమిప్పు డేం చెయ్యాలి ?
భాస్క : వెంటనే మా నాన్నగారికి చెప్పి, పట్నం పోయి "రిజిష్టర్డ్ మారేజ్" చేసుకుందాం !
ఉష : వాళ్లకి తెలియకుండానా ?
భాస్క : వాళ్లకి చెప్పే వెళ్దామన్నానా ? ఇందులో దొంగతనమేముంది ?
ఉష : ఐతే మీరూ నేనూ......
భాస్క : (విసుగ్గా) అబ్బ ! అవన్నీ యెందుకురాధా ! ఒక్కమాట అడుగుతాను చెప్పు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా లేదా ?
ఉష : ప్రేమిస్తున్నానే అనుకోండి.
భాస్క : ఇంకా అనుకోడమేమిటి ?
ఉష : ప్రేమిస్తే ?
భాస్క : ముందు నామాటవిని పద ! నడు !
ఉష : ఎక్కడికి ?
భాస్క : చెప్తానుగా ! నడు !
[ఉష ఒక్కక్షణం అతని ముఖంలోకి చూస్తుంది. అతను "ఊఁ" అంటాడు. ఇద్దరూ రెండడుగులు ముందుకు వేస్తారు. బయటినుండి కాంతారావు, సీతారామయ్య, ప్రభాకర్ వస్తారు. వాళ్ళనిచూసి ఇద్దరూ ఆగుతారు.]
కాంతా : (భాస్కర్‌తో) భలేవాడివే నోయ్ ! ఈ అమ్మాయినేనా నువ్వు ప్రేమించావ్ !
భాస్క : అవును.
కాంతా : మరి మా అమ్మాయిని కాదని దమాయించావేం ?
భాస్క : ఈమె మీ అమ్మాయా ?
కాంతా : కాదా ?
భాస్క : కాదు.

[ఉష, ప్రభాకర్ వాళ్లలో వాళ్లు నవ్వుకుంటూ వుంటారు.]

కాంతా: (వేళాకోళంగా) మా అమ్మాయినిగురించి నాకంటే ఎక్కువ తెలిసినట్టు మాట్లాడుతున్నావే! కని, పెంచిన తండ్రిని! నా కూతురు నాకే తెలీదూ!....పదమ్మా ఉషా! లోపలికి పద!

భాస్క: ఉష? ఆమె ఎవరు?

సీతా: వాడి కూతురురా!

భాస్క: ఆమె ఉష కాదు. రాధ!

సీతా: పోనీ అలాగే కానీ! కాంతం! వాడికి ఆమె రాధ! తెలిసిందా!

కాంతా: అలాగేలే! పదమ్మా!

భాస్క: ఏమండోయ్!......

సీతా: ఒరే బాబూ! నీకేం తెలియనట్టు నటిస్తావేంరా?

భాస్క: మీ మాటలు నాకేం అర్థం కావడం లేదు.

సీతా: సరే. ప్రభాకర్! వాడికి అంతా చెప్పవోయ్!

[వీధిలో నుండి కృష్ణారావు ప్రవేశం]

కృష్ణా: (అందర్నీ చూసి) ఏమిటే అసాధారణసమావేశం?

ప్రభా: రండి స్వామీ! మీకోసమే చూస్తున్నాం! మీతో రావలసిన వారంతా వచ్చినట్టే!

భాస్క: ఏమిటిదంతా?

ప్రభా: ఒకే బ్రదర్! కొంచెం ఓపికపట్టు! రాధకీ, ఉషకీ అట్టే తేడా లేదు. ఆమే యీమే ఒకటే!

భాస్క: ఏమిటి నువ్వనేది?

ప్రభా: అదంతే!

కృష్ణా: ఏమిటండీ మీరు చెప్పేది?

కాంతా: నువ్వాగరా ఒక్కక్షణం! కానీవోయ్!

ప్రభా: సీతారామయ్యగారు వ్రాసిన ప్రకారం మేమిద్దరం బయలుదేరి ఈ వూరొచ్చాం. కొస్త ముందుగా రావడంవల్ల ఏదైనా హోటల్లో దిగుదామనుకుంటూ వుండగా ఈయన కనిపించారు కృష్ణారావుగారు.

కృష్ణా: ఔను. ఈ వూళ్ళో ఏదైనా వసతిగృహం దొరుకుతుందా అని మీరు నన్నడిగేరు. నేనిక్కడికి తీసుకొచ్చాను.

ప్రభా: ఊరికే తీసుకొచ్చారా! ఇది వసతి గృహం అని చెప్పేరు. అసలు దీన్ని చూడగానే హోటల్ కాదనిపించింది మాకు! కాని ఈయన మమ్మల్ని దమాయించాడు! మరేం చేస్తాం! అసలే కొత్తవూరు! అంచేత ఆయన మాటల్ని నమ్మవలసి వచ్చింది!...ఆ తరువాత ఉషని కల్సుకున్నాను.

ఉష: ఔను. నా దగ్గర మీరు ఇది హోటల్ అన్న భావంతో మాట్లాడితే ఇది హోటల్ కాదనీ, కాంతారావుగారియిల్లనీ అంతా చెప్పాను. మీరు వెళ్ళిపోతామంటే వుండమనికూడా చెప్పాను.

ప్రభా: అప్పటికి నాకు విషయమంతా బోధపడింది! ఈలోగా భాస్కర్ వచ్చాడు. ఉషని, భాస్కర్‌నీ విడిచి ఏదో మిషమీద లోపలికి వెళ్ళాను నేను. ఏరా బ్రదర్!

భాస్క: అవును నువ్వు వెళ్ళాక నేను యమబాధ పడ్డాను. ఆమె ముఖమన్నా సూటిగా చూడలేదు నేను. చివరికి ఆమెను వదిలించుకోవాలని మంచినీళ్లు తెప్పించమని నేను బయటపడ్డాను.

ప్రభా: అదే! ఆడవాళ్ళంటే నీకుండే ఆసిగ్గూ, భయమూ పోగొట్టాలనే ఉషా నేనూ కలిసి ఈపథకం వేసేం. దాని ప్రకారం ఉష రాధ అయింది. మిగిలిందంతా మీకు తెలిసిందే!

కృష్ణా: బాగుందండి నాటకం!

భాస్క: మీ నాటకం కంటేనా?

కాంతా: అసలు నువ్వెందుకు అబద్ధం చెప్పావురా ఇది వసతి గృహమని?

కృష్ణా: (తేలిగ్గా) ఏముంది? కాస్తవినోదం కోసం, వీళ్ళని ఏడిపించాలనీను!

భాస్క: ఐతే యిప్పుడేడ్చేన వాళ్ళెవరో?

కాంతా: ఎవరో యేమిటి? అంతా యేడ్చాం!

ప్రభా: అలాగనకండి! కొందరు మాత్రమే యేడ్చాం!

సీతా: కాంతం! మొత్తంమీద మన ప్రమేయం లేకుండానే పెళ్లి ఏర్పాటయి పోయిందోయ్!

కాంతా: ఆఁఆఁ! అందులోనూ మీ అబ్బాయి అమోఘమైన నటన!

సీతా: మీ అమ్మాయి కంటేనా!

ఉష: సూత్రధారులుంటూఉండగా మమ్మల్నెందుకనడం? ఈ క్రెడిటంతా ప్రభాకర్‌దే!

ప్రభా: క్రెడిట్ మాటకేం! బూరె ముక్కలకు ఎలాగో ఆలస్యం వుంది, ముందు కాస్తకాఫీ అన్నా పోయించండి, ఆలసిపోయి ఆత్మారాముడు గోలచేస్తున్నాడు? (అంతా నవ్వుతారు.)

కాంతా: పదండోయ్! లోపలికి రండి!

[ముందు కాంతారావు, వెనుక సీతారామయ్య, భాస్కర్, ఉష, కృష్ణారావు, ప్రభాకర్ వెళ్తూ వుంటారు]

కృష్ణా: (ఆగి) సారీ! ఇదుగో మీ సిగరెట్ పెట్టె!

ప్రభా: (తీసుకుని) థేంక్ యూ వెరీమచ్!

కృష్ణా: నో మెన్షన్ ప్లీజ్!

[ఇద్దరూ నవ్వుకుంటూ నిష్క్రమిస్తూండగా తెర జారుతుంది.]

---

* గోల్డ్‌స్మిత్ వ్రాసిన "ది మిస్టేక్స్ ఆఫ్ ది నైట్" ఆధారంగా.

# కలగూరగంప



## బుద్ధుని జననము

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

గౌతమబుద్ధుని మహాపరినిర్వాణమునకు చెందిన 2500 వార్షికోత్సవాన్ని భారతదేశం జయప్రదంగా చేసింది. కాని బుద్ధుడు గతించి 2500 సంవత్సరాలైనా అనే సంశయం కలగటానికి చాలా ఆధారాలున్నవి. 1552 సంవత్సరాల క్రిందట మన దేశానికి వచ్చిన ఫాహీన్ యాత్రికుడు బుద్ధుని నిర్వాణమంతకుముందు 1497 ఏండ్లనాడు జరిగిందనే వదంతిని పేర్కొన్నాడు దీనిని బట్టి బుద్ధనిర్వాణము క్రీ. పూ 1086 న కావాలి. బుద్ధనిర్వాణమై ఎన్ని ఏండ్లు గడచినవనే విషయంలో అభిప్రాయభేదాలున్నవని, ఈ మధ్యకాలం 900 నుంచి 1600 దాకా గలదని చెప్పేవాదాలున్నవని యువాన్‌చ్వాంగ్ చెప్పినాడు (వాటర్స 2.28), టిబెట్ దేశపు సంప్రదాయంలో బుద్ధనిర్వాణాన్ని గురించి పదునాలుగు తేదిలు చెప్పబడ్డవని మాక్స ముల్లర్ పేర్కొన్నాడు. ఇవి క్రీ పూ. 546, 576, 653, 752, 837, 880, 882, 884, 1060, 1310, 2135, 2139, 2148, 2422 సంవత్సరాలు. కాంటన్ లోని సంప్రదాయం ప్రకారం క్రీ. పూ. 487, చీనా సంప్రదాయంలో క్రీ. పూ. 639, ఇతరులు క్రీ పూ. 544 అన్నారు. ఇన్ని తేదిలు కన్పిస్తుంటే ఏది సరియైనదని నమ్మగలము ?

మాక్సముల్లర్ తన సంస్కృత సాహిత్యచరిత్రలో (పుట 139) టిబెట్‌వారిచ్చిన తేదిలనిస్తూ, చీనా వ్రాతల ప్రకారం అశోకుడు క్రీ. పూ. 850 లోనో, 750 లోనో రాజ్యానికి వచ్చినట్లున్నదని (పుట 134-5) పేర్కొన్నాడు. ఇలాంటి చిక్కులలో బుద్ధనిర్వాణము ఎప్పుడుజరిగిందో నిర్ణయించటం చరిత్రకారులకు మాత్ర మెలాసాధ్యమౌతుంది? అందులో అలెగ్జాండరు కాలానికి చంద్రగుప్తమౌర్యు డున్నాడని చెప్పే పాశ్చాత్య సిద్ధాంతాలను నమ్మే చరిత్రకారులీ తేదిలన్నిటినీ త్రోసివేయటం సహజమే. మున్షీగారి విద్యాభవనం తరఫున భారతదేశచరిత్ర సంపుటాలు వెలువడుతున్నవి. రెండవ సంపుటంలో విచిత్ర విషయాలున్నవి. బుద్ధనిర్వాణమైన 218 ఏళ్ళకు అశోకుడు రాజ్యానికి వచ్చినాడు గనుక నిర్వాణము క్రీ. పూ. 487 లో నన్నారు. మహావీర నిర్వాణము క్రీ. పూ. 528 అని జైన సంప్రదాయమంటున్నా ఈ తేదీ క్రీ. పూ. 487 కు సరిపోదు గనుక త్రోసివేయాలన్నారు. (పుటలు 36,37) బుద్ధనిర్వాణమైన పదిహేనేండ్లకు మహావీరుడు గతించెనను వాక్యాన్ని అందరూ అంగీకరిస్తారు. కాని మహావీరుని కాలాన్ని దిద్దటంలో అభిప్రాయమేమి? జైన సంప్రదాయాన్ని బట్టి బుద్ధనిర్వాణము క్రీ. పూ. 543 లో జరిగి వుండాలి. బుద్ధుడు ఎనభైఏండ్లు జీవించి ఉన్నాడని అందరు అంగీకరించిన విషయమే. ఈ తేదినిబట్టి బుద్ధుని జననము క్రీ. పూ. 623 లో అయి ఉండాలి.

కాని బౌద్ధ జైన సంప్రదాయాలే కాకుండా వైదిక సంప్రదాయంలో కూడా బుద్ధుని ప్రసక్తి ఉన్నది. ఈ సంప్రదాయంలో కన్పించే విషయాలనుబట్టి బుద్ధుని కాలనిర్ణయం చేయావచ్చును. మనకు నేడు కన్పించే శక్తి సంగమతంత్రంలో ఛిన్నమస్తాఖండము ఉన్నది. దీని ఆరవపటలంలో వివిధ అవతారాలు ఏ సంవత్సరంలో వచ్చినవో చెప్పబడినవి. ఇచట:

"కలౌ చవత్సరే చైవ ఖరే చాషాఢకే తథా
శుద్ధా చ దశమీ దేవి రవి వారేణ సంయుతా
శుక్ల యోగే విశాఖాయాం దివా నాడీచషట్తథా
బౌద్ధోఽవతీర్ణో దేవేశి తతః కలియుగేశ్వరః."

అని ఉన్నది. కలియుగంలోనిది బుద్ధావతారము. ఖరనామ సంవత్సర ఆషాఢ శుద్ధ దశమీ ఆదివారం నాడు, శుక్లయోగము, విశాఖ నక్షత్రము ఉండగా సూర్యోదయానంతరము ఆరుఘడియలకు బుద్ధుడు జన్మించినాడన్నమాట. క్రీ. పూ. 569, 629, 689, 749, 809, 869, 929 మొదలైనవన్నీ ఖరనామ సంవత్సరాలు. వీటిలో ఏ సంవత్సరానికి ఆషాఢ శుద్ధ దశమీ ఆదివారం విశాఖ నక్షత్రం వస్తుందో తెలుసుకోవాలి. బుద్ధ నిర్వాణానికి క్రీ.పూ. 489, 549, 609, 669 మొదలైన సంవత్సరాలు రాగలవు. జైనులు చెప్పే మహావీర నిర్వాణానికి సమీపంలో ఉన్న సంవత్సరము క్రీ. పూ. 549. ఇది బుద్ధ నిర్వాణమని అంగీకరించితే, బుద్ధుని 2500 వ పరినిర్వాణ వార్షికము క్రీ. వె. 1951 లో ఐతీరుతుంది.

ఫాహీన్ చెప్పిన క్రీ. పూ. 1086 ను అంగీకరిస్తే బుద్ధుని జననం 1166 లో ఔతుంది. దీనికి దగ్గరగా ఉన్న క్రీ. పూ. 1169 ఖరనామ సంవత్సర మౌతుంది. కాంటన్ సంప్రదాయం ప్రకారము క్రీ. పూ. 569, చీనా వారి లెక్క ప్రకారము క్రీ. పూ. 629 బుద్ధుని జన్మ సంవత్సరం కాగలదు. జ్యోతి స్సిద్ధాంతం ప్రకారం లెక్క వేసి విజ్ఞులీ విషయాన్ని నిర్ధరించాలి.

జైనుల లెక్కను, వైదికసంప్రదాయాన్ని కూడా త్రోసివేసి మన ఇష్టం వచ్చిన తేదిని అంగీకరించడం శాస్త్రీయము కాదు. శక్తి సంగమ తంత్రంలో చెప్పినది మాత్రము ప్రామాణికమా? అని కొందరు ప్రశ్నించవచ్చును. బౌద్ధ తంత్రాలు చాల వరకు శాక్త, శైవతంత్రాలుగా తర్వాతి కాలంలో మారినవి. దీనితోబాటు కొన్ని బౌద్ధాచారాలు అద్వైతపరంపరలోకి వచ్చినవి. ఇలా వచ్చిన వాటిలో చాతుర్మాస్య దీక్ష ఒకటి ఉన్నది. ఈ దీక్ష యతులకు విధింపబడ్డది. ఆషాఢ శుద్ధ ఏకాదశినాడీ దీక్ష ప్రారంభము. కేవలము వర్షాకాలంతోనే నిమిత్తముంటే ఈ దీక్షను పూర్ణిమనుంచిగాని, పాడ్యమి నుంచిగాని ఎందుకు ప్రారంభించ కూడదు? దాదాపు బుద్ధుని జన్మదినముతో ప్రారంభమయ్యే ఈ దీక్షలో బౌద్ధవాసన కన్పించకపోదు. ఇదే సమయానికి జగన్నాథుని రథయాత్ర కూడా కన్పిస్తుంది. జగన్నాథాలయమునకు పూర్వ కాలంలో బౌద్ధుల సంబంధము లేదని ఎవరునూ చెప్పలేరు గదా! ఈ ఆధారాలచేత శక్తి సంగమతంత్రంలోని శ్లోకము పరమ ప్రామాణికమని ఒప్పుకొనవలెను. అప్పుడు బుద్ధుని నిర్వాణ సంవత్సరము క్రీ. పూ. 549 లోనో అంతకంటె చాల ముందో ఐ ఉండాలి.

# గ్రంథవిమర్శనము

## పాలవెల్లి

సాహిత్య వ్యాససంపుటి; రచన: శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య: సారస్వత కుటీరము: మద్రాసు-21. వెల: రు. 1/-

ఇది పూర్వకృతులలోని కొన్ని పాత్రములను, సన్నివేశములను ఏరుకొని వాని నిర్మాణమును వివరించుటకుఁ జేసిన ప్రయత్నము. 'మగువమాంచాల' 'దమయంతి పెండ్లి' 'మాలదాసరి' 'శాలీనుఁడు' 'కౌటమరాజు' 'చిత్రాంగి' అను శీర్షికలతో ఆఱు వ్యాసములీ సంపుటిలోఁగలవు. పూర్వసాహిత్యముపై విద్యార్థులకాభిముఖ్యమును గల్పించుటయే యీ రచనోద్దేశ్యమని గ్రంథకర్త 'మనవి' లో తెలిపెను. ఈ యూహ మేలు. ప్రాథమికులకై - అభిరుచి నిర్మితికై - యుద్దిష్టమైన రచన విస్పష్టమైన ఆలోచనతో, పునరుక్తిలేని వివరణతో, ప్రామాణికములైన సిద్ధాంతములతో, నుండుట మంచిది. ఎంత ప్రాథమికులకు అంత పరిణతుల మార్గదర్శిత్వము, ప్రయోజనకరము. తెలుఁగు నాఁటికి పలనాటి వీరచరిత్రము రెండవ భారతము. 'మగువ మాంచాల'లో గ్రంథకర యొక్క వివరణాన్వేషణమునకు దొఱకక మిఱుమిట్లు గొలుపుచున్న భావమును, పరిచయ కర్త రెండు మాటలతో ఎత్తి చూపిరి. 'మాంచాల మనోరత్న'మని! పలనాటి వీరచరితమునందలి ఏ పాత్ర మధురము కాదు? ఒక్కొక పాత్రమునందలి మాధుర్యము అనుభవమునకు వచ్చుట మన యభిరుచి విలువ పెఱుఁగుటకు గుర్తు. వీర చరితమునందలి పాత్రముల మానసిక పరిణతియే, వేఱు. వారందఱు పండిన తత్త్వవేత్తలు. అందు మనస్వినియైన మాంచాల మనోరత్నము. తెనుఁగు సారస్వతమునకు త్రికాలములకు వెలుఁగు!

'దమయంతి పెండ్లి'లో గ్రంథకర్త స్థాపింపఁదలఁచినది శ్రీనాథుఁడా పెండ్లి సంబరమునకు ఆంధ్రత్వముద్రవైచెనని. మంచిదే. ఈమాత్రమునకు భారతనలకథకు లేని కావ్యత్వమును దన నలకథకు శ్రీనాథుఁడు సంపాదించెనన నక్కఱలేదు. బహుభాషలయందు బహుజనులు స్వస్థానవేషభాషామయములుగనే యితిహాస కథలను జిత్రించికొని యానందింతురు. ఆంధ్రత్వముద్ర ఆంధ్రహృదయమునకు మాత్రమే ఝటితి రసస్ఫురణకు హేతువు. ఇతిహాస కథలు సర్వమానవ హృదయ స్పందకములగు నుదాత్తతకలవి. ఆ యుదాత్తతకు భంజకముగునేని అట్టి యాంధ్రత్వముద్ర అభిలషణీయము కాదు. భారతనలకథ యందలి యుదాత్తత సంస్కృతాంధ్ర నైషధములు వెరసి అందకొనరానిది.

'మాలదాసరి' సృష్టిగొప్పదే. కాని విష్ణుచిత్త గోదాపాత్రములు ప్రబంధ లక్షణములకు లోనైనపాపమునఁ గృత్రిమము లయ్యెననుట అవిచారితము. రాయల పాత్రనిర్మాణశక్తి 'మాలదాసరి' సృష్టియందే ఉట్టిగట్టుకొనలేదు. అది విష్ణుచిత్తుఁడు, పాండ్యుఁడు, అతని పట్టమహిషి, యామునాచార్యుఁడు, కేశిధ్వజ ఖాండిక్యులు—అతని సర్వపాత్రములయందుఁ గలదు. నేఁటి హరిజనాభిమానమువలన 'దాసరి' మనకు సన్నిహితుఁడనిపించునేమో! మాలదాసరి కథలో స్వభావోక్తి ప్రియుడైన రాయలవర్ణనాప్రతిభయు వాదప్రౌఢియుఁగలసి దానికా ప్రశస్తిని దెచ్చినవి. దాసరి మిక్కిలి గడుసరి. వానిలోతు తెలిసికొనుట కింకను దిగ వెతుకవలయును. అతఁడు బ్రహ్మరాక్షసునకుఁ జరమగీత ఫలమీయలేదు. 'ఇచ్చినాఁడ'ని మనము గ్రహింపవలెనని గ్రంథకర్తయనుట సరికాదు. దాసరిదృష్టిలో గీతిఫలమునకు ఇయత్తాకల్పన దోషము. గీతఫలమువలన నీ రాక్షసత్వము పోవుచున్నచో ఇయత్త చేసినట్లే. ఇంతకు వాని రాక్షసత్వముపోవుటకు గీతఫలము వఱకేల? తన సంకల్పమాత్రము చాలదా! దాసరికింత ప్రత్యయము. 'అట్లీయనుట' కర్థమిది. దీనిని తెలిసికొని వివరింపవలెను.

శాలీనుఁడు... పెద్దన ప్రవరునకుఁ బై చేయిగా సూరన చేసిన సృష్టియని కొందఱు వాకొందురు. వీరి యూహ తాత్పర్య మిదియై యుండును. ప్రవరుఁడు వరూధినిని నిరాకరించెను. శాలీనుఁడును సుగాత్రి నొల్లలేదు' కదా! అని, మొదటియతఁడు ధర్మాధర్మ వివేకముచేత — రెండవయాతఁడు నిరంభరణ సౌందర్యాభిమానముచేత—ధర్మాభిమానము కన్న సౌందర్యాభిమానము గొప్పయనుదృష్టి కంతే. కాని

అన్యోన్యముగా సుగాత్రి నొల్లకుండుటకు నిరాభరణ సౌందర్యాభిమాన మనుటకంటె—ఉద్యోగక సామగ్రికొఱవడిన శాలీనుని సహజ శాలీనతయే హేతువను కొనుట యుక్తతరము. పురుష ప్రభేదములలో నది యొకటి. దానిని పరిశీలించి నూతన వాస్తవిక దృష్టితోఁ గావ్యమున నిక్షేపించుటయే నేఁటి భావుకుల నదియాకర్షించుటలోని రహస్యమైయుండును. ఈ శాలీనుని కథలోని అందమును పూర్వ విమర్శకులు వివరించిరి.

కాటమరాజుకథ— ఇది తరతరములుగఁ దెలుఁగునాఁట బహుళ జనానురాగ పాత్రము. అట్లగుటకు నిందలి పాత్రీకరణ ప్రజ్ఞయే హేతువని గ్రంథకర్త యుపపాదన. ఆ పాత్రీకరణ మెట్లు నిర్వహింపఁబడెనో నిరూపింపలేదు. కాటమరాజు జనోదాహరణముగ 'కొమారబంగారము' భట్టుపలికిన పలుకు లివి యని గ్రంథకర్త యుదాహరించిన ద్విపదలలో నతఁడు పసులమేపికొనుచు తిరిగిన దేశముల పట్టీ యున్నది కాని అతని వ్యక్తి లక్షణములను పట్టియిచ్చు నాధారములు లేవు.

ఇంతు పాత్రీకరణము గొప్పగా నున్నదని చెప్పటతోఁబాటు 'పెద్దనకుఁ బూర్వమున్న కవులలో నొక్క తిక్కన్నలోఁదప్ప నీ పాత్రచిత్రణము కానరాదు' అని యొక అవిచారిత నిర్ణయము! కాటమరాజు కథలోనున్న పాటి పాత్రచిత్రణము పెద్దనకుఁ దిక్కనకు మధ్యనున్న కవులలో నెవరిలోను లేకపోవుట గాక! ఇంతకు పూర్వము మన ప్రశంస లందికొన్న పలనాటి వీరచరిత్రము గతి యేమి కావలెను?

'నాటకీయముగఁ బాత్ర నిర్మాణము సేయలేరు. రచన నాటకీయముగ నున్నప్పుడుకాని పాత్ర నిర్మాణ ముండదు. రసస్ఫూర్తికిఁ బాత్ర నిర్మాణ మావశ్యకమయి నప్పుడు కాటమరాజు కథ మొదలయిన గేయప్రబంధ ములలోఁ బాత్ర నిర్మాణముయొక్క యావశ్యకత ఇట్టిదని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.'

ఇన్నిసార్లు పాత్ర నిర్మాణమును వాడుటకన్న అది కాటమరాజు కథలో ఎట్లు చేయఁబడినదో నిరూపించియుండిన బాగు. ఈ వ్యాసములో మెకంజీ లోకలు రికార్డులనుండి 'కాటమరాజు కథా వృత్తాంతమని' యుదాహరింపఁబడిన వ్యావహారికపు తెనుఁగు రచన కాటమరాజు కీలారముల పాలి మేఁతలలోనికి మనలను దీసికొనిపోవునంత రమ్యముగ నున్నది.

'చిత్రాంగి'—ధర్మవరమువారి విషాదసారంగధర నాటకములోని ప్రధాన పాత్రమను దృష్టితో అనుశీలనము నడచినది. సరిగ నిల్లే విషాద సారంగధరలోఁ జిత్రాంగి చిత్రణమున్నచో నది చేమకూర సారంగధర చరిత్రకు అక్షరశః నకలు! ఈ సృష్టివలని కీర్త్యపకీర్తులు 'చేమకూరకు' చెందవలెను. ధర్మవరమువారు చేసిన మార్పులు ఒకటి రెండున్నచో నవి చిత్రాంగిపై సామాజికులకు సానుభూతి కలిగించుటకు చేసినవి. ఇట్టి పాత్రములమీఁద సానుభూతి, దేవుని యంతవిశాల హృదయుఁడు పూరి నిర్వహింపఁగలఁడు కాని, సామాన్య మానవుల నిది యపమార్గముల కీడ్చి తీఱును. కానఁ గవి, విమర్శకులు దానినిఁ గల్పించుటకై ప్రయత్నింపరాదేమో! మొత్తముమీఁద యీ వ్యాసములను గూర్చిన గ్రంథకర్త యాశయము మేలే కాని ఇందలి పెక్కు విషయములు నెనుకటి తరము విమర్శకులు తెలిచినవే. విమర్శలోఁగూడ నుపజ్ఞ ఫలయును గదా! ఈ రచయిత తగినంత పరిణతితోఁ గ్రొత్త ఘట్టములను మనకు వివరింపఁగలరని ఆశింపవచ్చును.

## ఉషాసుందరి

నాటకము; రచన: శ్రీ పెడిపాటి సుబ్బరామ శాస్త్రి, మారుతీనగర్, విజయవాడ; వెల రు 1-50.

ఈ ఐదంకముల నాటకమునకు ఉషాపరిణయ కథ వస్తువు. బాణాసురుని రక్షణ శిక్షణములకై పోటీ పడిన శివకేశవుల తగాదాకు బ్రహ్మను దీర్పరినిజేయుట యీ రచయిత యుపజ్ఞ. దీనిని గమనింపవలసినదని పీఠికలో ప్రత్యేకముగ హెచ్చరిక కలదు. ఈ సన్నివేశముతోఁ ద్రిమూర్తులు దేవతాత్వము జాఱిపోయి కేవలము 'వ్యవహారపక్షులు'గా గోచరింతురు. సాంఘికమైన వస్తువును దీసికొని యెట్లు నిర్వహించినను అంత ప్రమాదములేదు. దివ్యులను పాత్రములుగాఁజేసి నిర్వహించుటకు గొప్ప సంస్కారమును భావనాశక్తియుఁ గావలయును. పౌరాణిక వస్తువును దీసికొని అనౌచిత్యము రాకుండ నిర్వహించుట మిక్కిలి కష్టము. ప్రణయ కథకు ఉషానిరుద్ధులే అక్కఱలేదు. ఎవరైన పనికివత్తురు.

ఈ వాక్యములు పరిశీలించునది.

ఉష॥ మన సత్త్వములు మార్చుటకు యుద్ధము సాధనమా? ఉషాసుందరి కారణముగా ఇరు పక్షములను రక్త ప్రవంతులు పొంగి పొరలవలసినదేనా? అమాయిక స్త్రీలు భృతికారణముగ పతిసుతాదుల మారై బలి పెట్టవలసినదేనా? హింసా స్వరూపిణి యుద్ధమారి వేయి నాల్కలు చాచి వికృతాట్టహాసమును చేయుచున్నదే?

ఇంతటి అభ్యుదయభావభరమును ఉష మోయఁగలదా? ఇంకొకచోట:

బాణు॥ నాజాతి గౌరవము పుత్రికా వాత్సల్యముకన్న మిన్న. [ఈబాణాసురుఁడు జాతీయ నాయకునివలె నున్నాఁడు.]

# గ్రంథ విమర్శనము

నాందీ పద్యము—

శ్రీయుమాశారదా రాగసించితములు
హరిహరహిరణ్యగర్భహృత్సరసిజములు
మధుర మధురంపు తావి సంపదల పొదలి
విశ్వకల్యాణరోచి ప్రహ్వీభవించు॥

'శ్రీయుమా' సమాసమేని విసంధి చేయరాదు. కాదేని అర్థము కుదురదు. ఉమకు పర్యాయ పదము వెతుకవలెను.

రాగసించితములు—రాగముతో రంజనము కుదురును గాని సేచనము కుదురదు.

విశ్వకల్యాణరోచి ప్రహ్వీభవించు—ప్రహ్వీభవించుటకు నమ్రమగుట - ముకుళించుకొనుట అర్థము. కవి యుద్దేశమునకు విరుద్ధార్థము వచ్చుచున్నది.

ఇంక పీఠికలో—"కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలము చదివిన పిమ్మట చక్కని నాటకము రచింపవలెనను అభిలాషయే "ఉషాసుందరిగ రూపొందినది." ఈ సృష్టికి అది యుద్బోధకమని చెప్పుకొనుటకైన కొంచెము సంకోచ ముండవలయును. ఈ రచయిత యిట్టి రచనల కుపక్రమించుటకు ముందు కొంత ఆత్మ విచారమును చేసికొనవలయును.

## జాతీయ భారతి

గేయసంపుటి: రచన: శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి; మారుతీనగర్, విజయవాడ. వెల రు. 2-50.

ఇది జాతీయతా ధర్మప్రబోధము. కొందఱు దేశనాయకులు, పంచశీల వీని ప్రచారమును దృష్టియందుంచికొని వ్రాసిన గేయముల సంపుటి. ఈ రచనలకు వలసిన యర్హత యీ రచయితకు గలదు. ఈ గేయములకు నింతకు పూర్వమే దేశములో ప్రచారముగలదు. ప్రతి గేయముక్రిందను ఒక్కొక్క సంగీతవాద్య చిత్రమున్నది. ఆ గేయమును ఆ వాద్యముపైఁ బలికింపవలయునని రచయితే సూచనయై యుండును. ప్రచార సులభమైన శైలిలోనుండుట యీ గేయములలోని విశేషము. తంద్రాళువైన జాతికి నిత్యప్రబోధము అవసరమే కావచ్చునుగాని ఒక్కొక్కసారి—

"తెలుఁగుదేశం మనదేనోయ్
తెలుఁగులంటే మనమేనోయ్.
రాయలు మనవాడోయ్—పండిత
రాయలు మనవాడోయ్
కలంతిక్కనా ఖడ్గతిక్కనా
గణపతిదేవులు మనవారోయ్".

ఇత్యాదులు చూచినప్పుడు 'తెలిసిన సొదతో తెగఁజంపుటయే కలిగిన ఫలమా? కవితలకున్' అని యనిపింపక మానదు. ఈ పురశ్చరణవలన ఫలమేమి?

ఇందలి 'గోమాత' 'ఏఱువాక' అను గేయములలోఁ గొంత కావ్యగుణమున్నది.

శివశర్మ

## శృంగార తిలకము

మహాకవి కాళిదాసు రచనగా చెలామణి అవుతున్న చిన్ని కృతికి అనువాదం: అనువాదకులు: శ్రీ ఉప్పాడ రాజారావు; ప్రకాశకులు: శ్రీ హనుమంతు మోహనరావు, తలగాము, (వయా) చోపడా, శ్రీకాకుళము జిల్లా, వెల: రు. 0-50.

వ్యాసులు, శంకరులు, కాళిదాసులూ, మనకు అనంత సంఖ్యలో నున్నారు. ఈ 'శృంగార తిలక' మాతృక ఏ కాళిదాసు రచనో మనకు తెలియదు. ఇది స్త్రీ సౌందర్యవర్ణన పరమాశయంగాగల కావ్యం. భావనలో వైచిత్రి వున్న కారణంగా కావ్యగౌరవాన్ని సంతరించుకున్నది.

అనువాదం సరసంగా వుంది.

"కుసుమే కుసుమోత్పత్తిః
శ్రూయతే నచదృశ్యతే
బాలే! తవ ముఖాంభోజే
కథ మిందీవర ద్వయం॥"

అన్న శ్లోకాన్ని ఇలా అనువదించారు:

"కుసుమమున కుసుమోత్పత్తి యొసగుచుండు
పృథివితలమందు గనలేదు; వినగలేదు
బాల! భవదీయ లలితాస్య పంకజమున
గాననయ్యె జగానల్లకల్వదోయి."

## చెరగని అక్షరాలు

కథల సంపుటి: రచన: శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి; ప్రచురణ: నవ్యభారతి, 760 హిమాయత్ నగర్, హైద్రాబాదు. వెల: రు. 1-00.

ఈ సంపుటిలో, టపాకాయలు, పూవులూ కాయలూ, కాలిన చేతులు, ధర్మపత్ని, చెరగని అక్షు

తాలు, కథలో కథానిక, విశాలహృదయం, జన్మహక్కు—అనే ఎనిమిదికథలున్నాయి. వీటిలో చెరగని అక్షరాలు అనే కథ లోగడ 'భారతి' ద్వారా పాఠకులకు పరిచయమైనదే. మిగతా కథలుకూడా, ఆయా పత్రికలలో లోగడ ప్రచురింపబడినవి. శ్రీ దక్షిణామూర్తిగారి రచనలో, భావతీవ్రత వుంటుంది. దానికి తగిన నిరాడంబరమైన భాషనుకూడా సమకూర్చుకోగలరు.

## వాస్తు పద్మాకరమ్

[ప్రథమ ఖండము]

రచన శ్రీ కె. యస్. శర్మ; ప్రాప్తిస్థానం: రచయిత, మెయిన్‌రోడ్, కాకినాడ; వెల రు 8/-

మనకు ప్రాచీన వాస్తుశాస్త్రం అనంతంగా వున్నదని చెబుతారు. కాని అదంతా సంస్కృతంలో వున్నది, ఎక్కడెక్కడో అటకలమీద మూలుగుతున్న అముద్రితములైన తాటాకు గ్రంథాలలో వున్నది. అందు చాలా గ్రంథాలు, సాంకేతిక విజ్ఞాన శాఖకు చెందివున్న కారణంచేత వాటిలో వాడబడిన పారిభాషిక పదజాలం మామూలు సంస్కృత భాష చదువుకున్న మాత్రం చేత అర్థంకావు, ఆశాస్త్ర విషయంలో పరిపూర్ణ పాండిత్యంగల గురువులు లభించితేనే తప్ప ఈ కవిలెకట్టలు విప్పనెవ్వరికీ సాధ్యం కాదు. అట్టి గురువులు ఇప్పుడు ఈ దేశంలో ఎంతమంది వున్నారు. అంతేగాదు ఈశాస్త్ర విజ్ఞాన గ్రంథాలతో ఒక చిక్కుగూడా వుంది. వీటిలో ప్రక్షిప్తాలు అనంతం. మన ప్రాచీన లేఖకులలో కొంతమంది చాలా అనాలోచితంగా వ్యవహరించారు. పరిమిత పరిజ్ఞానమూ అంధవిశ్వాసములు గల ఈ లేఖకులు మూలగ్రంథాలను మూలగ్రంథాలుగా వుంచారు గాదు. కొత్త రెండుశ్లోకాలు వ్రాయటంచేతనైన ప్రతి ఒక్కడూ ఏదో చెత్త వ్రాసి మూల గ్రంథాలలోకి దూర్చారు. భారతం వంటి ఐతిహాసిక గ్రంథంలోనే ఇలాంటి దౌర్భాగ్యం అనంతంగా కనుపించుతోంది. ఈ దుశ్చర్యతో దానికిగల ఐతిహాసిక ప్రామాణ్యాన్ని దగ్ధం చేశారు. అలాగే శాస్త్రవిజ్ఞానగ్రంథాలలోకూడా చేసి వాటికిగల శాస్త్రీయ ప్రామాణ్యాన్ని నాశనం చేశారు. ఏశాస్త్ర విజ్ఞాన గ్రంథాన్ని చూచినా శాస్త్రీయ విషయంతో పాటుఅశాస్త్రీయమైన, అవివేకమైన,మూలచ్ఛేదకమైన చెత్త ఎంతో కనుపిచుతుంది. దాంతో బుద్ధివంతుడైన పాఠకునిలో ఆ గ్రంథంయొక్క ప్రామాణ్యవిషయములోనే ఆశంక కలిగి, అవిశ్వాసం పుడుతుంది. మన విజ్ఞానశాస్త్రాలమీద దేశంలో నేడు ప్రబలియున్న అవిశ్వాసానికంతకూ ఇదే కారణం. ఈస్థితికి, మరొకరెవరో కారణమనీ, దేశంలో ఆంగ్లభాషవ్యాప్తిచేత అలాటిది కలిగిందనీవాదించటం, ఆత్మవంచన చేసుకుని మన బాధ్యతలనుంచి మనం తప్పుకోవటానికి ప్రయత్నించటమే. అయితే ఇప్పుడు మనం నిర్వహించగల బాధ్యతలేవిటి? ఆయా విజ్ఞాన శాస్త్రాలలో తగిన వ్యుత్పత్తిని సంపాదించుకోవాలి. ఆ శక్తితో ఈ గ్రంథబాహుళ్యంలో వున్న విషయ సంచయంలో శాస్త్రీయ విషయాలేవో అశాస్త్రీయ విషయాలేవో నిర్ణయించి శాస్త్రీయ విజ్ఞాన గ్రంథాలను పునర్నిర్మాణం చేసి, పునరుద్ధరించాలి. ఇది కబుర్లతో జరిగేపని గాదు, విశేషమైన కృషి అవసరం. పాత తాటాకులమీద వ్రాసివున్నదంతా పరమ ప్రమాణమనే అంధవిశ్వాసం గల వ్యక్తులు ఈ రంగంలో పనిచేయటానికే అనర్హులు. శాస్త్రీయ విజ్ఞానానికి ప్రజా ప్రయోజనం పరమలక్ష్యముగా ఉండాలి. ప్రయోజనరహితమైన శాస్త్రం అంతరించి పోతుంది. శ్రీ శర్మగారు ఈ రచనలో ఈ విషయాన్ని అంతగా గమనించినట్లు కనుపించదు. ఏవో శ్లోకాలు ఉటంకించినంత మాత్రంచేత ఆ గ్రంథానికి ప్రామాణ్యతా సిద్ధించదు — ప్రయోజనమూ ఉండదు.

ప్రాచీన వాస్తుశాస్త్రం ఈ దేశంలో పూర్తిగా నశించిపోయింది — దానికి కారకులెవరైనా కానీయండి. దీనివల్ల ఈ దేశానికి ఎలాంటి దౌర్భాగ్యస్థితి పట్టిందో ఊహించ శక్యంగాదు. చిన్న కుటీరం నిర్మించుకుందామనుకున్న సామాన్యగృహస్థుని దగ్గర నుంచీ, పెద్ద పెద్ద ప్రాజెక్టులు నిర్మించుతున్న వారిదాకా, ప్రణాళికారచన సంఘందాకా దారి తెలియక అంధకారంలో తన్నుకుంటున్నారు. విదేశాలలో నిర్మాణ కార్యక్రమాలు ఎలా సాగుతున్నాయనే దృష్టి తప్ప దేశీయ పరిస్థితులదృష్టి లేదు. విజాతీయ శాస్త్ర విజ్ఞానంయొక్క అంధానుకరణ ఇందుకు కారణం. 'స్వామీ' చిన్నగృహం నిర్మించుకోవాలని వుంది అని అడిగితే 'సిమెంటుకూ, ఇనుముకూ పర్మిట్లు సంపాదించావా' అనేప్రశ్న వస్తోంది. యావద్భారత ప్రజానీకానికీ గృహనిర్మాణం జరగాలంటే సిమెంటూ, ఇనుమూ, ఇంజన్లూ ఎక్కడనుంచి వస్తాయి, విట్లోనుంచి ఇన్ని యుగాలనుంచీ ఈ దేశంలో జరిగిన నిర్మాణాలన్నీ, సిమెంటూ, ఇనుమూతోనే నిర్మించారా, ఇంజన్ల సహాయంతోనే కట్టారా? ఇక్కడ

లభించే సాధనసంపత్తి యేమిటో చూసుకోవాలి, ఇక్కడ మానవశక్తి ఎంత పుష్కలంగా లభించుతుందో కళ్లు తెరచి చూచుకోవాలి. లేకపోతే మనకు మోక్షం లేదు అంధానుకరణవల్ల, దేశీయ పురోగమనం డొంకదోవనుబట్టి, డాలర్ భిక్షులకొరకు నిరీక్షిస్తూ చేతగానివాళ్లమై కూర్చునే దౌర్భాగ్యం పట్టింది. ఈ వక్రమార్గాన్నుంచి మరలించటానికి, జాతీయ శాస్త్ర విజ్ఞానవేత్తలు ప్రయత్నించాలి. ఈ రంగంలోవారు జాతికి చేయదగిన సేవ చాలావుంది. జాతీయ వాస్తు శాస్త్రజ్ఞులు ఈ రంగంలో తమకుగల శక్తి సామర్థ్యాలేమో విస్పష్టం చేయాలి. శ్రీ శర్మగారు ఎలాగో మూడు ఖండాలుగా ఈ వాస్తు శాస్త్రాన్ని ప్రకటించబోతున్నారు గనుక ఈ విషయాలను దృష్టిలో వుంచుకుని మిగతా రెండు ఖండాలను, ఇప్పటికే రచించబడివుంటే, తగిన విధంగా సంస్కరించి, ప్రయోజనకరమైన విషయాన్ని అందజేయగలరనీ, జాతికి కొంత సేవజేయగలరనీ ఆశించుతున్నాము.

ఈ ప్రథమ ఖండాన్ని శ్రీ శర్మగారు నాలుగు గుచ్ఛాలు (భాగాలు)గా విభజించారు. మొదటిభాగం ఇంచుమించు దేవతలకు సంబంధించింది. రెండవ గుచ్ఛంలో 'క్షేత్రీకృతపదము' అంటే యేమిటో చర్చించారు. అనేకరకాల కొలతలు వ్యవహారంలోకి వచ్చిన ఈనాడు ఈ 'క్షేత్రీకృతపద' చర్చ కేవలం నిష్ప్రయోజనకరం.

తృతీయ గుచ్ఛంలో ఆయా రకాల గృహాలకు పారభాకంగా వుండే పేర్లను వాటి వివరాలనూ చర్చించారు. చతుర్థ గుచ్ఛంలో వారశూలలు వగైరా చర్చించారు.

ఈ రచన యావత్తూ ప్రశ్నలు జవాబుల రూపంలో జరిగింది. శ్రీ శర్మగారు మిగతా రెండు ఖండాలనూ ఇంతకంటే వాస్తవిక దృక్పథంతోనూ, ప్రయోజనకరంగానూ రచించి అందజేయగలరని ఆశించుతున్నాము.

## చైతన్య స్రవంతి

రచన: శ్రీ బుచ్చిబాబు; ప్రచురణ : ఆదర్శ సాహిత్యమాల, (17-5-350 out-side Dabipura) హైదరాబాదు-2; వెల రు 1/.

ఈ సంపుటిలో చైతన్యస్రవంతి అనే అధివాస్తవిక రచన ఒకటి, 'ఇంటాయన X విదు' పూడివచక్రం 'వాడనిపుష్పం' 'దాగిలిమూతలు', 'పశ్చాత్తాపం' అనే నాలుగుకథలూ వున్నాయి. కథారచన విషయంలో శ్రీ బుచ్చిబాబును క్రొత్తగా పాఠకాలలకు పరిచయం చేయవలసిందేమీ లేదు. ఆధునిక కథారచయితలలో శ్రీ బుచ్చిబాబు పేరెన్నికగన్నవారు. ఇక మిగిలిన 'చైతన్యస్రవంతి' అనే రచనను గురించే ఒకటిరెండు మాటలు చెప్పవలసివుంది.

ఆంగ్లభాషలో ఎక్కువ పరిచయంవున్నవాడూ లేనివాడూకూడా, ఎంతచదువుకున్న పెద్దమనిషైనా సరే "మీరు 'జేమ్సు జాయిస్' చదివారా?" అని దబాయించటం పరిపాటిఅయింది. అది తలకాయికి పట్టినా పట్టకపోయినా దొరటోపీ పెట్టుకోవటం ఆముగ్ధ్యఫాషన్‌గా ఎలా చెలామణీఅయిందో, తలకు పట్టినా పట్టకపోయినా 'జేమ్సు జాయిస్' చదివాననటం జాయిస్ 'యూలిసిస్' ప్రతిని ఒకదాన్ని చంకలో పెట్టుకు తిరగటం సాహిత్యకారుల మనిపించుకో జూస్తున్నవారులో ఒక ఫాషనయిపోయింది. ఈవాతావరణంలో బుచ్చిబాబు, 'జాయిస్'ను అనుకరించుతూ ఒక రచన చేయటానికి ప్రయత్నించారంటే అందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. అక్కడ పశ్చిమదేశాల్లో ఏవెట్టికేక బయలుదేరినా దాని ప్రతిధ్వని ఇక్కడ వినిపించటంతప్ప దీనివల్ల కలిగే విశిష్టప్రయోజనమేమీ లేదు. ఈరకం అంధానుకరణవల్ల ఇప్పటికే మనం చాలా చెడ్డాం. స్వతంత్రమైన భావుకతను సృజనశక్తినీ మనం పెంపొందించుకోనకపోతే మనకు ఎప్పటికీ మార్గం దొరకదు. పాఠకుల పరిశీలనార్థం శ్రీ బుచ్చిబాబు రచననుంచి, కొలదిభాగాన్ని క్రింద ఉటంకించుతున్నాం.

'ఇప్పుడు తెలిసిందా? నేనెందుకు చేరతానో ఈ చేరలో? పావ్‌లావ్ కుక్కలాగా పొట్టకూటికి గుంట్రని ఎముకని చూపిస్తే వాడి చెయ్యి నాకుతా, వాడి పెళ్ళాం కాళ్లు పడతా ఛీ ఛీ. ఫ్రాయిడ్ తాతయ్య నూరిపోశాడురా. వాడి పెళ్లాం గొడవ నాకెందుకు? వాడి కాళ్లే పడతా ఫ్రేజరు (Frazer). 'బంగారు బొమ్మ'లో వెనక ఈజిప్టురాణి వెన్ను నాకేటందుకు ఇద్దరు జీతగాళ్ళుండేవారని వ్రాశాడు. ఇది చదివి నాలిక కోరుకున్నాను. అయిదువేల కాపీలు అమ్ముడయాయి, ఈ దేశంలో దినవారం పత్రిక లేకపోతేను—దిన, వారం మాసికం సంవత్సరీకం పత్రిక ఒక్క కాగితాన్ని ఐదువేలమంది ముక్కలక్రింద కొరుక్కుతింటారు. పదివేలమంది పెళ్ళాలు—అంటే జుంగు (Jung) గాడు చెప్పినట్లు ప్రతిమగాడికి ఒక పెళ్ళాం ఒక ప్రియురాలు—మొత్తం ఎంతమంది? పదివేల మంది. దానితో హాయ్యిగా రాజేస్తారు.'

ఈ రచనయొక్క ప్రయోజనాన్ని గురించి పేజీల తరబడి చర్చ అనవసరం. పాఠకులు పైన ఉటంకించిన భాగాన్ని పరిశీలించితే సర్వం అర్థమౌతుంది.

తై. సూ.

# స్వీకారము

గాలి, గ్రహాలు: పద్యాలలో చెప్పబడిన ఖగోళ శాస్త్రం. రచన: శ్రీ వసంతరావు వేంకటరావు; ప్రాప్తిస్థానం: రచయిత, విజయనగరం; వెల రు 1-00

మాధురీమహిమ: వ్యాససంపుటి; రచన: శ్రీపిల్లలమర్రి వేంకటహనుమంతరావు; ప్రచురణ: శారదా పీఠము, గుంటూరు. వెల: రు 2-00.

సుభాషితత్రిశతి: శ్రీ నీలకంఠ దీక్షితులవారి "సభారంజన" "కలివిడంబన" "వైరాగ్యశతకము" అనే రచనలకు అనువాదం. అనువాదకులు: శ్రీ రూపావతారం నారాయణశర్మ; ప్రాప్తిస్థానం: భారతి కుటీరము, హిందూపూరు, అనంతపురంజిల్లా: వెల రు 0-75.

మానవబోధామృతము: పద్యరచన: శ్రీ అకుండి వేంకటశాస్త్రిగారు, విజయనగరము; అమూల్యం.

రసవాహిని: ఖండకావ్యసంపుటి: రచన: శ్రీ పి; వి. యల్. వి. ప్రసాదరావు; హిందూ కాలేజి, గుంటూరు: వెల రు 1-50.

మహాభారత విమర్శనము: రచన: శ్రీ కోడాలి లక్ష్మీనారాయణ, ప్రాప్తిస్థానము: సాహితీకేంద్రము తెనాలి; వెల రు 3-00.

## సుందర భారత యాత్ర

కన్యాకుమారి మొదలు కాశ్మీరు వరకు గల హిందూ, జైన, బౌద్ధ క్షేత్రముల వివరములు, చారిత్రక విశేషములు, రైల్వేసమాచారము, దేశపటముతో, 280 చిత్రపటములతో, 770 పైగా పేజీలతో, దేశాటన, తీర్థయాత్రలు చేయువారికి సర్వ సమాచారము తెలుపు చక్కని మార్గదర్శి.

వెల: బైండు రు 5/; సాదా రు. 4/-లు పోస్టేజి 1-6-0.

సాధన గ్రంథ మండలి, తెనాలి.

ఆంధ్ర తులసీరామాయణము : (ఉత్తరకాండము) అనువాదకులు : శ్రీ మైలవరపు సూర్యనారాయణ మూర్తి; కృష్ణపాలెం (పోస్టు), వయా కొవ్వూరు. వెల. రు 1-50.

మునిగోరింట : కథల సంపుటి; రచన : శ్రీమల్లాది రామకృష్ణశాస్త్రి; విశాలాంధ్ర ప్రచురణాలయం; విజయవాడ 2; వెల రు 1-25.

రంగవల్లి: కథల సంపుటి; రచన : శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి; విశాలాంధ్ర ప్రచురణాలయం—విజయవాడ 2-వెల 1-25.

1857 పూర్వరంగములు : (ప్రథమ భారతీయ స్వాతంత్ర్య సమర పూర్వరంగములు); రచన: శ్రీ దిగవల్లి వేంకట శివరావు; విశాలాంధ్ర ప్రచురణాలయం; వెల 2-75.

అల్లో నేరేడు: కథల సంపుటి; రచన: శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి. విశాలాంధ్ర ప్రచురణాలయం; విజయవాడ—2.

రసమంజరి : కథల సంపుటి; రచన : శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి విశాలాంధ్ర ప్రచురణాలయం; విజయవాడ. 2-వెల రు 1-25.

నర్తనబాల : బాలబాలికల కొరకు ఉద్దేశింపబడిన నాట్యశాస్త్ర ప్రబోధకగ్రంథం; రచన : శ్రీ నటరాజ రామకృష్ణ; విశాలాంధ్ర ప్రచురణాలయం; విజయవాడ—2; వెల రు 5-0 0

ప్రాచీన కావ్యమంజరి : సంకలనం; శ్రీ శ్రీగంటి జోగి సోమయాజులు; విశాలాంధ్ర ప్రచురణాలయం; విజయవాడ—2; వెల రు. 1-50.

చనువిచ్చిన స్కూల్ మాస్టరు : ఏంకాంకిక : రచన : శ్రీ కె. సుధాకరమూర్తి; ప్రాప్తిస్థానం : కె. సుధాకరమూర్తి (alias) కె. కృష్ణమూర్తి, కుప్పం, చిత్తూరుజిల్లా వెల : రు. 0-37.

శ్రీ కన్యకాపరమేశ్వరీ దండకము : రచన : కోట సోదరకవులు; ప్రాప్తిస్థానము : కవిచంద్ర గ్రంథమాల; 147 మింటుస్ట్రీటు, మద్రాసు-1. వెల: రు. 0-25.

మేఘసందేశము : కాళిదాస కృతికి అనువాదం; అనువాదకులు : శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ; ప్రాప్తిస్థానం: ఆదిత్యప్రచురణలు అరండల్ పేట గుంటూరు.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**

Bharathi 7th November 1957 Regd. No. M. 1856

